శ్రీ మహాగణాధిపతయేనమః

# బ్రహ్మసూత్రవృత్తి

శివాద్వైత మతవిధి-శాంభవదీక్షా ప్రాశస్త్యము-శివలింగ ధారణ ప్రాముఖ్యము-కేవలాద్వైత వైష్ణవ రామానుజ మధ్వమత నిషేధములు అనువానితో కూడినది.

వేదాంతార్థ పరిష్కారతారహారము

ఇందు....33.......పరిష్కారములు కలవు.

సంస్కృతమూలము

మహోపాధ్యాయ, శివయోగి, ముదిగొండ-నాగలింగశాస్త్రివర్యులు

"శైవనందిని" తెలుగుసేత

ఆచార్య-శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి-ఆరాధ్యులు



ప్రకాశకులు

శివజ్ఞానలహరి-ధార్మికసంస్థ-రిజిస్టర్డ్, హైదరాబాద్.

అధ్యక్షులు - శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారు

40-15-3, బృందావనగార్డెన్స్-లబ్బీపేట,

విజయవాడ-520 010, ఆం.ప్ర.



వెల రూ. 100-00

ప్రతులు 500

ప్రథమ ముద్రణ 6-9-1998

శాలివాహనశకము 1920

కలియుగ గతాబ్దములు 5099

శ్రీబహుధాన్యనామ సం॥ భాద్రపద పూర్ణిమ-ఆదివారము



వలయువారు:

శివశ్రీ॥ AVSR. చంద్రశేఖర్
కార్యదర్శి-శివజ్ఞానలహరి-ధార్మికసంస్థ (రిజి.)
3-6-462/8, మొదటి అంతస్తు,
సుందరసదనము-వీధి నెం. 5,
హిమాయత్ నగర్-హైదరాబాద్-500 029, ఆం.ప్ర.
ఫోనులు-7603662(0)7645516(2)

ముద్రణ :
శివాజీ ప్రెస్, 4-4-53, గంజ్ బజార్, సికింద్రాబాద్-3.

# స్వాభిప్రాయము

"శివ ఏకో ధ్యేయః-శివంకరః-సర్వమన్యత్ పరిత్యజ్య"

అష్టాదశవిద్యలలో శ్రేష్ఠములు అనాది సిద్ధములు అపౌరుషేయములు నగు వేదములు, వేదానుకూలములైన స్మృతి పురాణాగమేతిహాసకావ్యాదులును ఆస్తికులగు వైదికులందరికి పరమప్రమాణములగుట సువిదితమే గదా!

వేదమనఁగా- "వేదయతీతి వేదః" ప్రత్యక్షఅనుమాన ఉపమాన ప్రమాణములకు అందనట్టి ధర్మాధర్మములను శివజ్ఞానసాధనములగు కర్మభక్త్యుపాసనములను పరమేశ్వరతత్త్వమును బోధియనది-వేదమని అర్థము.

ఉపనిషత్తులు వేదశిరస్సులు కాగా-అయ్యవి ఉపక్రమోపసంహారాది లింగములతో శివుఁడే పరతత్త్వమని ప్రతిపాదించునని ఆచార్యసార్వభౌములు సర్వజ్ఞులు నగు శ్రీశ్రీ నీలకంఠ భగవత్పాదులవారు నిరూపించిరి. నీలకంఠీయ భాష్యములు శాస్త్రజ్ఞులగువారికే దురవగాహములగుటచే-భాష్యార్థములు తేలికగా తెలియుటకై మహోపాధ్యాయ శివయోగి ముదిగొండ నాగలింగశాస్త్రిగారు-సర్వశాస్త్రప్రవీణులై సంస్కృత వ్యాఖ్యానములను రచించిరి.

ఒకప్పుడు- నీలకంఠ భాష్యములను బోధింపుడని-ఆరాధ్యశైవుఁడొకరు నన్ను కోరగా ఆ భాష్యముల నామూలాగ్రము పఠించుట-తటస్థించినది. బ్రహ్మశ్రీ॥ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారు "నీలకంఠ భాష్యములఁజదువుచు శ్రీ నాగలింగశాస్త్రి గారు ఆనందపరవశులగుచుండిరని చెప్పుచు శ్రీ శాస్త్రిగారి పాండిత్యప్రకర్షను ప్రశంసించుచుండిరి.

"బ్రహ్మావిష్ణు రుద్రేంద్రా స్సంప్రసూయంతే-న కారణం కారణానామ్" ఇత్యాద్యుపనిషద్వాక్యార్థ నిరూపణముతో నిండియున్న శ్రీ

శ్రీకంఠ భాష్యములకు-ఆచార్య శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు- శ్రీ అన్నదేవర సుబ్బారావుగారి ప్రోత్సాహమున తెలుగున పదార్థ భావార్థములను వ్రాయుట- కడుంగడు ముదావహమైనది.

వీరు నాకు అపరిచితులైనను- వీరు సరియైన అవగాహనతో అధీత విజ్ఞానపరిపూర్ణత గలవారని వీరి వ్రాతవలన స్ఫురించినది. వీరి యనువాదము-సంస్కృత వ్యాఖ్యానములకు సర్వథా అనుకూలమైనదని గుర్తించితిని. నీలకంఠాచార్యభాష్యార్థ జిజ్ఞాసువులకు-ఈ యనువాదము పరమోపకారకమగుననుట-అతిశయోక్తి కాదు.

శ్రీ ఆద్యశంకరాచార్యుల వారి శివారాధనము, శ్రీ అప్పయ దీక్షితేంద్రాదుల యొక్క శివపారమ్యభావన, ఇత్యాదులు-ఈ బ్రహ్మ పథమున గానంబడుచున్నవి.

ఇట్టి శైవగ్రంథములను "శివజ్ఞానలహరి" అను ధార్మికసంస్థ ద్వారా ప్రచురింపజేయునట్టి శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారు ధన్యజీవనులు. శివానుగ్రహ పాత్రులు నని చెప్పుటలో సందేహమెంతమాత్రము లేదు.

శివాద్వైత ప్రాముఖ్యమునకు గల ప్రమాణబాహుళ్యమును విస్తరభీతిచే-ఇచట నిర్దేశింపలేదు. "నృణా మేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ" అను పుష్పదంత సూక్తి ననుసరించి-శైవాది షణ్మతములవారికి శివపదమే గమ్యస్థానమనియు, వైష్ణవాదిమతములు నదులుకాగా- సముద్రమగు శైవములోనే ఇతర వైదికమతములన్నియు కుటిల ఋజుమార్గమున చేరునని భావించుచు విరమించుచున్నాను.

శ్రీ బహుధాన్య సంవత్సరాది
29-3-1998 తర్క వేదాంత సమ్రాట్ మహోపాధ్యాయ,
ఆదివారము మద్దులపల్లి మాణిక్యశాస్త్రి
విజయవాడ

ఓమ్

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# పీఠిక

శ్రీ ఆద్యశంకరాచార్యులవారి కంటె పూర్వీకులగు శ్రీశ్రీ నీల కంఠ భగవత్పాదుల వారి శివాద్వైత సిద్ధాంతమును పురస్కరించు కొని- మహోపాధ్యాయ, శివయోగి-ముదిగొండ నాగలింగశాస్త్రిగారు శ్రుతిసూత్రానుగుణముగా వ్రాసిన బ్రహ్మపథ మీ గ్రంథము.

ఇందు—వేదపథము, వ్యాసపథము అను రెండు విభాగములు ముఖ్యములైనవి. వేదపథమున—శివాద్వైతపథవిధి, శివతత్త్వనిరూప ణము, శాంభవదీక్షావిధి, కేవలాద్వైత పథ ప్రతిషేధము, వైష్ణవ పథ ప్రతిషేధము, రుద్ర జన్మాభావ నిర్ణయము, శ్రీరామాయణ ప్రతి పాద్య నిర్ణయము, శ్రీ మహాభారత ప్రతిపాద్య నిర్ణయము, శ్రీ భగవద్గీతా ప్రతిపాద్య నిర్ణయము కలవు.

ఇఁక వ్యాపథమునందైతేనో-రామానుజపథప్రతిషేధము మాధ్వ పథప్రతిషేధము, కేవలాద్వైత పథప్రతిషేధము ఇత్యాదులు కలవు. తర్హి-"కేవలాద్వైతాదులను నిరాకరించుట మాత్రము నా లక్ష్యము కాదనియు స్వమతమును సుప్రతిష్ఠితము నొనర్పుటయే ప్రధాన లక్ష్య మనియు" శ్రీశాస్త్రిగారు ఇందు 164వ పేజీలో నివేదించుటను విబు ధేంద్రులు గమనింతురు గాక!

ఇందు శ్రీ కంఠభాష్యము పరమప్రాచీనమనియు, రామానుజ భాష్యాదులు అర్వాచీనములనియు, శ్రీకంఠుని కర్మజ్ఞాన సముచ్చయ

మును, భక్తి ప్రాధాన్యమును, సాయుజ్యమే ముక్తి యనుటను, అర్చిరాదిగతిప్రాముఖ్యమును, జగజ్జీవనిత్యత్వమును, పరమాత్మయొక్క దివ్యమంగళ విగ్రహవత్త్వమును, జ్ఞానము ఉపాసనాత్మకమనుటను, అవసానకాలమున ఈశ్వరానుగ్రహమువలన ప్రకాశించు మూర్ధన్యనాడీద్వారా నిష్క్రమించు జీవాత్మకు పునరావృత్తి రహితమైన పరమపదము లభించుటను, పుణ్యపాపక్షయముతో కలుగు చిత్తశుద్ధిని బాహ్యాభ్యంతర పూజాజపధ్యానములతో సంపూర్ణశివానుగ్రహసంభవాదులను- ఇతర భాష్యకర్తలందరు- అవశతః- ప్రతిపాదింపవలసివచ్చెననియు శ్రీ శాస్త్రిగారు సంస్కృత సముల్లేఖనముఁగావింపగా- యథామతి నవ్వాని ననువదించితిని.

దీని నోపికతో రెండు మూడు తడవలు చదివినచో-వేద వేదాంతములు వ్యాససూత్రదులు నిరూపించిన శివాద్వైతము అర్థమగును. ప్రపంచమే పరమావధి యని భావింపక-ప్రతిదినము ఒక గంటకాలమునైనను పరమార్థమునకు ఉపయోగించుట-ప్రతి ఆస్తిక మానవుని కర్తవ్యము. శైవాంధ్ర గ్రంథములఁగూడ పఠింపనివారు స్వమతాభిజ్ఞత లేనివారై పరదైవములను ఇతరమతముల నాశ్రయించుట కూడదని సంకల్పించిన వదాన్యులు లోకారాధ్యులు నగు శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారు-వయోఽతిశయమున అశక్తుఁడనగు నన్ను ప్రోత్సహించి శ్రీ నాగలింగ శాస్త్రిగారి గ్రంథములలో ముఖ్యములగు వాని నాంధ్రీకరింపఁజేయుచు శైవలోక కల్యాణము నొనఁగూర్చుట- ఆదుర్యులైన శైవులకు ఆదర్శమై ప్రశంసనీయమైనది.

ఇది-ఇన్ని విషయములతో ప్రథమభాగమైనది. ఇఁక శ్రీ శాస్త్రిగారు-బ్రహ్మపథ ద్వితీయభాగముగా వ్రాసినట్టి-వేదాంతార్థపరిష్కారసారహారము నాంధ్రీకరించి-ముద్రింపఁజేయవలసియున్నది.

దీనిని-లోకారాధ్య-శివలెంక సుబ్బారావు (నందివెలుగు) గారి ప్రోత్సాహమున బ్ర॥శ్రీ॥ మున్నంగి పున్నయపంతులు గారు తెనుగించిరి. కాని అందు స్వమతఛాయలను జూపించుట-సూక్ష్మదర్శులకు స్ఫురించుచున్నందున-అయ్యది ఆరాధ్యశైవులకు ఉపయుక్తము కాదని తోచెడిని. కథమపి పంతులుగారు శ్రీ శాస్త్రిగారి పాండిత్య ప్రతిభ నవగాహనఁ జేసికొని దాని నామూలాగ్రము ననువదించుట మెప్పుఁబడసినది.

శివానుగ్రహమువలన సదవకాశము లభించినచో వేదాంతార్థ పరిష్కారతారహరమును మరియు "శ్రౌతమేవ హి ధారణం లింగస్య" "శిష్టా స్సర్వే శివం ప్రపన్నాః" ఇత్యాది నాగలింగశాస్త్రీయ గ్రంథముల ననువదింపవలెనని మనస్సులో కలదు. ఇందుకు శివుఁడు-అన్నదేవర సుబ్బారావు రూపమున నన్ను ప్రోత్సహింపనున్నవాడని విశ్వసించుచున్నాను.

ఈ అనువాదము మూలానుసారి యగునో కాదో-మూలమును పఠించి అర్థముఁజేసికొను పండితప్రకాండులు-గుర్తింపఁగలుఁగుదురు. మిడిమిడి జ్ఞానముతో- శ్రుతిసూత్రాది విరుద్ధములైన శైవమతాంశములను వ్రాసిన విబుధులు ప్రామాణికులు కాజాలరు. ఊహాపోహలతో అప్రసిద్ధ ప్రమాణముల నుదాహరించుచు సభలలో ఆర్భాటముఁజేయువారు, అప్రస్తుతార్థములఁజూపి తమ భాషాకోవిదత్వమును ప్రదర్శించు మహామహులును ఈ యథార్థ గ్రంథ బహిష్కృతులగుదురు.

ఈ యనువాదగతములైన ప్రమాదములను- యథార్థపరులైన పండితులు సవరించుకొనగలరని కోరుచున్నాను.

అల మతి విస్తరేణ

నిర్మల శంకరశాస్త్రి.

శ్రీరస్తు

# విషయసూచిక

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# బ్రహ్మపథము

## శాంకరీయ-శైవనందినీ వ్యాఖ్యాసమన్వితము

ప్రార్థన-

శ్లో॥ విఘ్నేశ్వరం విశాలాక్షం—వక్రతుండం మహాతనుం।
పార్వతీనందనం వందే-నిర్విఘ్నం సుసమాప్తయే॥
సర్వలోకగురుం వందే-దక్షిణామూర్తిమవ్యయం।
వటచ్ఛాయాసమాసీనం—మేధాప్రజ్ఞాభివృద్ధయే॥
సరస్వతీ మహం వందే-వాక్కౌశల్యప్రదాయినీం।
గ్రంథార్థగ్రహణా దాశు-విద్వదామోదకారిణీమ్॥
పార్వతీరాజరాజేశౌ-భూకైలాసనివాసినౌ।
లక్ష్మీగణేశసంయుక్తౌ-నమామీష్టార్థసిద్ధయే॥
భద్రకాళీ వీరభద్రౌ-శత్రుసంహారకారకౌ।
చౌదాసీన్యనివృత్త్యర్థం-వందేఽహం కరుణామయౌ॥
సద్యోజాతం వామదేవ-మఘోరం పురుషం తథా।
ఈశానం ప్రణమే సద్యః-సంకటానాం నివృత్తయే॥

"మంగళాదీని శాస్త్రాణి" అను అభియుక్తోక్తి ననుసరించి-వస్తు

నిర్దేశరూపమగు మంగళమును వ్రాయుచు అభినవముగా ప్రతిపాదింపఁబడు బ్రహ్మపథము-విద్వాంసులచే విశ్వసింపఁబడదను ఆశంకను దిగువ శ్లోకముతో నిరాకరించుచున్నవారు.

శ్లో॥ సర్వానుగ్రహతత్పరేణ జగతా మీశేన సంశ్రావితో ।
వేదవ్యాసముఖై స్తతో మునివరైః సమ్యక్ ప్రతిష్ఠాపితః॥
ధారాశ్రుతిసూత్రసూక్తిమయ సవ్యాసవ్యభాగోజ్జ్వలః ।
శ్రీమాన్ బ్రహ్మపథఃసదావిజయతే శ్రీకంఠకంఠోదితః॥

బ్రహ్మపథమును-జీవాత్మలందరి సేనాటికైన ననుగ్రహించుటలో ఆసక్తి కలిగియుండు పరమేశ్వరుఁడు మొదట బ్రహ్మాదులకు వినుపించెను. ఆ పిదప వేదవ్యాసుఁడు మొదలగు మునివరులద్దానిని బాగుగా స్థిరపఱచిరి. అట్టి బ్రహ్మపథము (పరశివుఁజేరుటకు వలయు మార్గము) స్పష్టములగు శ్రుతులచేతను సూత్రములచేతను సూక్తులచేతను నిండినదై-ఎడమ కుడి భాగములతో ప్రకాశించుచున్నదై శ్రీకంఠుఁడను నామాంతరము (రెండవపేరు) గల నీలకంఠభగవత్పాదులచే కంఠోక్తిగా చెప్పఁబడినదియునై ఎల్లకాలము పెంపొందుచున్నయది.

వివరణము-

"ఈశానః సర్వవిద్యానాం" ఇత్యాది శ్రుతిచేతను- "అష్టాదశానామేతాసాం-విద్యానాం భిన్నవర్త్మనాం । ఆదికర్తా కవిస్సాక్షా-చ్ఛూలపాణిరితి శ్రుతిః" "భిన్నమార్గములు గల పదునెనిమిది విద్యలకు సర్వజ్ఞుడైన పరమేశ్వరుఁడు ఆదికర్త యగునని శ్రుతి వక్కాణించినది" అను మహాభారతమునందు ఆనుశాసనిక పర్వమునందలి వచనము చేతను- "శాస్త్రయోనిత్వాత్" అను వ్యాససూత్రము చేతను

పరమేశ్వరుఁడు విద్యలనన్నిటిని ప్రప్రథమము ఉపదేశించుటచే ఆది గురువని తేటపడుచున్నది.

"స పూర్వేషా మపి గురుః కాలేనానవచ్ఛేదాత్" కాలముచేకట్టు బడనివాడగుటఁజేసి పరమేశ్వరుఁడు—పూర్వపూర్వులకు గూడ గురువగునని భగవానుఁడగు పతంజలి మహర్షి—సంభావించెను.

మరియు బ్రహ్మమీమాంసను రచించిన వేదవ్యాసుడు, వృత్త్యాదులను నిర్మించిన బోధాయనాది మహర్షి ప్రవరులు, నీలకంఠభగవత్పాదులును వివరించుటఁజేసి-బ్రహ్మపథము-పరమప్రాచీనమై "అభినవము" అను శంకను నిరాకరించుచున్నయది.

వస్తు నిర్దేశాత్మకమగు రెండవ మంగళము నుల్లేఖించినవారు

శ్లో॥ ఆచార్యైఃపరికర్మితంబహుమతైః కైశ్చిత్ పరామర్శితం।
వ్యాఖ్యాతం కతిభిశ్చిదౌపనిషదప్రామాణ్యబద్ధాదరైః॥
కైశ్చిత్స్వార్థపరైస్తథా కలుషితం సంచోరితార్థం పరైః।
శ్రుత్యంతార్థనికేతనంవిజయతే శ్రీకంఠభాష్యం పరమ్॥

వివరణము-శ్రీ హరదత్త భవదేవ మల్లికార్జునపండిత సోమనాథారాధ్యప్రభృతులగు ఆచార్యులచే పరిశీలింపఁబడినదై, శంకరాచార్యాదులచే నిర్విశేష నిరాకార బ్రహ్మపరముగా మార్పుచేయఁబడినదై, అభినవ నీలకంఠాచార్యాదులచే క్రియసారాది గ్రంథములయందు వ్యాఖ్యానింపఁబడినదై, పూర్ణప్రజ్ఞుఁడు మొదలగువారిచే కలుషితము చేయబడినదై, రామానుజాదులచే గ్రహింపఁబడిన అర్థముగలదై, అన్నిటికంటె పురాతనంబు సారతరార్థకంబు వేదాంతార్థములను విశదీకరించుటకు ఇల్లువంటిదియునగు నీలకంఠబాష్యము సర్వోత్కర్షముతో విరాజిల్లుచున్నయది.

గ్రంధకర్త యొక్కయు గ్రంధముయొక్కయు పేర్లు చెప్పుటరూపముగా తన చికీర్షితమును వెలిబుచ్చుచున్నవారు-

శ్లో॥ పరై ర్బ్రహ్మపథో మోక్షపథికాగోచరీకృత ।
సత్యావేదనకా మేన-నాగలింగేన ఖాస్యతే॥

బ్రహ్మపథమునందు వామభాగమగు

# వేద పథము

మొదట దిగువ శ్లోకముతో మంగళాచరణము నొనర్చుచున్నవారు.

శ్లో॥ మీమాంసాద్వయకల్పపాదపనయచ్ఛాయాఽపనీతశ్రమః
కర్మజ్ఞాన తురంగ భక్తిశకటారూఢాధ్వనీనవ్రజః॥
అశు బ్రహ్మపురంనయన్ పరిహరంస్తంత్రాటవీవర్త్మనః।
శ్రీకంఠప్రతిబోధితో విజయతే శ్రీ వేదమార్గః సదా॥

పూర్వోత్తర మీమాంసలనెడు కల్పవృక్షములయొక్క-నీడలు అనఁదగు మీమాంసల రెంటిలోని న్యాయములతో-వేదాంతములను విచారించుటలో కలుగు మోక్షమార్గానుయాయుల శ్రమను పోగొట్టునట్టి, కర్మ-జ్ఞానము అను అశ్వములు గల భక్తియనెడు రథముపై పరమపదముఁదగు బాటసారుల సమూహము గలిగినట్టి, తంత్రములు అను అరణ్యమార్గములను నిరాకరించి బ్రహ్మపురమును త్వరలో చెందించునట్టి, శ్రీ నీలకంఠాచార్యులచే బోధింపఁబడినట్టి శ్రీ వేద మార్గము నిరంతరము విజయము నొందుచున్నయది.

వివరణము— మహర్షులు కల్పించుటచే పాదములు గలవగుటఁ

జేసియు రెండు మీమాంసలు-కల్పవృక్షములఁ బోలినవనియు, అవ్వానిలోని న్యాయములు జిజ్ఞాసువుల సంశయములు అను బాధల దీర్చునవి గాన- చెట్టునీడలు—బాటసారుల బడలికఁదీర్చునట్లు వృక్షచ్ఛాయలకు సరిపడుననియు, భక్తి-రథమనుచో-భక్తియేశివసాయుజ్యరూపమైన పరముక్తికి సాధనమగుననియు, కర్మజ్ఞానములు తురంగములు అనునెడ-భక్తికి కర్మజ్ఞానములు సాధనములగుననియు విదితమైనది.

ఇందువలననే గీతాచార్యుఁడు-

"నాహం వేదై ర్న తపసా-న దానేన నచేజ్యయా-
భక్త్యాత్వనన్యయా పార్థ"

"వేదాధ్యయనము తపస్సు దానములు యజ్ఞములు అనువానితో పరమాత్మ లభింపడు. కింతు- అనన్యభక్తిచే లభ్యుండగు" నని వాక్రుచ్చెను.

మరియు భగవానుఁడైన భాష్యకర్తయు "న వయం ధర్మబ్రహ్మవిచారరూపయోః శాస్త్రయో రత్యంతభేదవాదినః, కింత్వేకత్వవాదినః, ధర్మబ్రహ్మణో రారాధనారాధ్యభూతయోః ప్రతిపాదకం "అథాతో ధర్మ జిజ్ఞాసే త్యారభ్య "అనావృత్తిః శబ్దా" దిత్యేవావత్సర్యంత్ర మేకమేవ శాస్త్రమ్" "ధర్మమును బ్రహ్మమును విచారించు శాస్త్రములకు మిక్కిలి భేదమును మేము చెప్పువారము కాము. ఏకత్వమును ప్రత్యేకించి నిరూపించువారము. ఆరాధనమగు ధర్మమును ఆరాధ్యమగు బ్రహ్మమును ప్రతిపాదించు "అథాతో ధర్మజిజ్ఞాసా" అను సూత్రము మొదలుకొని "అనావృత్తిః శబ్దాత్" అను సూత్రమువరకు గల శాస్త్రము ఒకటే నని ప్రారంభించి- "యావదుత్పద్యతే జ్ఞానం తావదనుష్ఠేయాని కర్మాణి" "జ్ఞానము కలుగువరకు నిత్యనైమిత్తిక

కర్మల ననుష్ఠింపవలె" నని ప్రతిపాదించియు జ్ఞానేచ్ఛ-పురుషార్థము కానిదని "కర్మలు జిజ్ఞాసకు సాధనములు" అను వాదమును నిరాకరించియు "విద్యాంచావిద్యంచ యస్తద్వేదోభయగ్ం సహతేనైతి బ్రహ్మవిత్ పుణ్యకృచ్ఛ సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్" "జ్ఞాన (శివోపాసన)మును నిత్యనైమిత్తిక కర్మ అను రెంటి నేకకాలమున నాచరించుటచేత, సత్యము, శివపంచాక్షరీజపరూపమైన తపస్సు, రుద్రాధ్యాయాది వేద పఠనము, నిగమాగమాది శాస్త్ర పరిజ్ఞానము, అనువానివలనను పుణ్య కర్మలను లోకకల్యాణార్థము అచరించు శివోపాసకునకు—ఇష్టప్రాణ భావలింగాత్మకుఁడు పరంజ్యోతిఃస్వరూపుఁడు నగు పరశివుఁడు-లభించును. అనఁగా పునరావృత్తిరహితమగు శాశ్వత శివసాయుజ్యము చేకూరునని భావము" ఇత్యాది జ్ఞానకర్మ సముచ్చయ ప్రతిపాదక శ్రుతి యుండుటఁజేసి- కర్మజ్ఞానములు-మోక్షము—అను ఒకే ఫలితము నొదవఁజేయునవగునవని కర్మజ్ఞానవిచారములకు క్రమ నియమము యుక్తంబని-కర్మజ్ఞానపరమగు వేదము ఏకమేనని-ప్రతిపాదించినవారు.

వస్తుతః— పరాభక్తి-జ్ఞానస్వరూపమైనను- "యావదుత్పద్యతే జ్ఞానమ్" ఇత్యాదిని గల జ్ఞానశబ్దము—అపరోక్ష (శివసాక్షాత్కార) జ్ఞానమును చెప్పునదనియు, కర్మజ్ఞానతురంగ భక్తిశకటారూఢాధ్వనీన వ్రజః" అనుచో గల జ్ఞానశబ్దము-పరోక్ష (శాస్త్రార్థ) జ్ఞానమును తెలుపునదనియు, కర్మచేతను పరోక్షజ్ఞానముచేతను శివభక్తి కలుగుననియు గ్రహింపవలెను.

"సన్న్యస్య శ్రవణం కుర్యాత్" "సన్న్యసించి వేదాంతశ్రవణముఁజేయవలె"నని- జ్ఞానకాండము యతులకు మాత్రము తగుననియు, గృహస్థులు-కర్మకాండాధికారులు మాత్రమనియు వక్కా-

ణించి- పూర్వోత్తరమీమాంసలు-వేరువేరు అధికారులు కలవని నిరూపించియు "పరమేశ్వరుఁడు మాయాకల్పిత స్వరూపుఁడు" అని అంగీకరించుటచే భక్తియోగము ముక్తి సాధనము కాదని స్ఫురింపఁజేయుచున్నందున పరులవాదము-సర్వశ్రుతి సామరస్యము లేని ద్వైవేదపథ విపరీతంబగుచున్న యది.

మరియు

"శ్రీకంఠ ప్రతిబోధితః" అనుటచే శ్రీ నీలకంఠభగవత్పాదాచార్యులచే చూపెట్టఁబడిన శివాద్వైతమునకు-భిన్నములైన శుద్ధాద్వైత విష్ణు సంబంధి విశిష్టాద్వైతాదులు—వేదపథ విరుద్ధంబులగునని ధ్వనింపఁజేయఁబడినది.

## వేద పథమున

# శ్రీ శివాద్వైత పథ విధి-ప్రారంభము

గ్రంథారంభమును సమర్థించుచున్నవారు.

ఎట్లనఁగా?

శ్లో॥ సర్వశ్రుత్యంత ముఖ్యాశయ సమధిగత శ్రీ శివాద్వైత ఏవ-
ప్రాజ్ఞా! భాభాతి విశ్వోత్తర పరమపదప్రాపకో రాజమార్గః।
అప్యేవం హంత! తిష్యోదితకుపథ సుసందిగ్ధచిత్తాధ్వగాశ్శ-
సంవృత్తస్తద్వ్యథావత్సుగమయితు మిహోద్యాస్యతే వాక్ప్రదీప్త్యా॥

శ్రీ శివాద్వైత సిద్ధాంతమే-వేదాంతములయందలి ముఖ్యాశయ ముతో సమర్థింపఁ బడుచు విశ్వోత్తరమగు పరమపదమును చెందించు రాజమార్గముగ ప్రకాశించుచున్నను, ప్రాజ్ఞులారా! కలియుగమున దుష్టసిద్ధాంతముల ప్రభావముచే మోక్షపదమార్గానుయాయులు సందిగ్ధ చిత్తులగుచున్నవారు. ఆశ్చర్యము! అట్టి శివాద్వైతసిద్ధాంతము అను రాజమార్గము సర్వప్రమాణవచస్సులనెడు పరమకాంతితో-ఉన్న దున్నట్లు-అవగాహనఁజేసికొనుటకు మాచే ప్రకాశింపఁజేయఁబడు చున్నది.

కలి కలుషిత మతములను నిరాకరించి శివాద్వైతమును సమ ర్థించుచున్నామని భావము.

అభిమతమైన శివాద్వైతమును విశదీకరించుచున్నవారు.

శ్లో॥ విస్ఫూర్జచ్చిదచిన్మయాఖిల జగద్రూప స్వశక్త్యాయుతో-
విశ్వాత్మా విమలో లసచ్ఛుభగుణోఽద్విష్టే శివః కేవలః।
అత్రాంతర్గణికం విశేష మితరే కైవల్యదుష్యంతతో-
మన్వానా వివదంతి ముఖ్య మపరేదేవే విశిష్టేశ్రుతమ్॥

చిదచిద్రూపమైన సమస్త ప్రపంచముఁదగు ఆకారము గల పరా శక్తితో కూడియుండు శివుఁడే-జగమునంతయు శాసించువాడు.

"శివ ఏవ కేవలః" "ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే" ఇత్యాదిశ్రుతులు అద్వితీయుఁడైన శివుఁడే జగత్కారణమని చెప్పుటచే శివాద్వైతమే-శ్రుతి సమ్మతంబగునని తెలియుచున్నది.

ప్రశ్న:- "శివ ఏవ కేవలః" "ఏక ఏవ రుద్రః" ఇత్యాదిని గల "ఏవ" శబ్దముతో విశేషముల నన్నిటిని నిరాకరించుటచే-శివా ద్వైతము సవిశేష (శక్తి విశిష్ట)ము కాదని తోచెడిని.

ఉత్తరము- "కేవలః" ఇత్యాది పదములు- సదసత్తులయొక్క- శివునికంటె వేరుండుటను నిషేధించుటచే- నిర్విశేషత్వము ప్రతి పాదింపఁబడిపదని- భావింపరాదు. అట్లు కానిచో "మాయాం తు ప్రకృతిం విద్యా-న్మాయినంతు మహేశ్వరం" ఇత్యాదిని నిరూపింపఁ బడినట్టి- చిదచిత్ప్రపంచాకార యగు మాయాశక్తితో నిరంతరము కూడియుండువాడు మహేశ్వరుఁడు" అను ముఖ్యాంశము భంగ పడును.

ప్రశ్న:- మాయ-సదసదనిర్వచనీయ యని భావించుటచే కల్పితంబగుటఁజేసి-మాయావైశిష్ట్యము నిర్విశేషత్వమునే బోధించును గదా!

ఉత్తరము:- "తస్యైవ శక్తి ర్వివిధైవ శ్రూయతే- స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" పరమేశ్వరుని శక్తియే-అనేక రూపములుగలదై పరమేశ్వరు నెప్పుడు నెడబాయనిదై సహజసిద్ధయై ఇచ్ఛాజ్ఞాన క్రియలు కలిగియుండునని వినఁబడుచున్న యది" ఇత్యాదిని- పరమేశ్వరుని శక్తి-నిత్యమనీ తెలియుటచే "మాయ-కల్పితము" అని సంభావించుట-యుక్తము కాజాలదు.

ప్రశ్న:- జగత్తు మిథ్య యగుటచే-అనిత్యమగు జగత్తునకు నిత్యమగు బ్రహ్మము కారణమగుననుట-ఆవశ్యకము కాదుగదా!

ఉత్తరము:- "జగత్తు మిథ్య" అనువాదము-విజ్ఞానవాదులైన బౌద్ధులయభిమతమగుటచే-జగన్మిథ్యాత్వము-అంగీకార్యముకాజాలదు

ప్రశ్న:- కూటస్థమగు బ్రహ్మము జగద్రూపముగా పరిణమించు ననునెడ బ్రహ్మము వికారముగలదిగా సంభవించుటఁజేసి-బ్రహ్మము నిత్యము కాదని తేటపడును గదా!

ఉత్తరము:- నామరూపములను విభజింప వలనుపడనట్టి సూక్ష్మ

చిదచిచ్ఛక్తితోకూడిన బ్రహ్మము కారణమనియు, నామరూపములను విభాగింపనదనుగలయట్టి స్థూలచిదచిచ్ఛక్తితో కూడిన బ్రహ్మము కార్యమనియు ప్రతిపాదించు మాకు "బ్రహ్మము సవికారమై అనిత్యంబగు'' నను ప్రసక్తియే రాజాలదు. అట్లు కానిచో "యతో వా ఇమాని భూతాని జాయంతే-యేనజాతాని జీవంతి-యత్ప్రయంత్యభి సంవిశంతి'' ''ఎద్దాని వలన నీ ప్రాణులు పుట్టుచున్నవో' జన్మించిన ప్రాణులు ఎద్దానివలన జీవించుచున్నవో, చివర నెద్దానిఁ బ్రవేశించి విశ్రాంతిఁజెందుచున్నవో, అద్ది బ్రహ్మము" ఇత్యాదినిగల"జాయంతే" ''జీవంతి'' ''ప్రయంతి'' ''సంవిశంతి'' అను పదములు వ్యర్థములగుటచే-"బ్రహ్మము-మిథ్యయగు జగత్తునకు కారణముకాదు'' అను వాదము-సర్వశ్రుతి విరుద్ధంబగుచున్నయది.

ఇంతియేగాక పరమేశ్వరుఁడు శక్తి విశిష్టుడు కాడనునెడ-"యస్య బ్రహ్మచక్షత్రంచ ఉభే భవత ఓదనః మృత్యుర్యస్యోపసేచనమ్" ''యస్య = ఏ పరమాత్మకు, బ్రహ్మచక్షత్రంచ = బ్రాహ్మణులు క్షత్రియులు, ఉభే = ఈ రెండు (ముఖ్యముగా గల జగత్తు), ఓదనః = అన్నకబళము. భవతః=అగుచున్నవో, యస్య=ఏ పరమాత్మకు మృత్యుః = వ్యాధి కాల యయాది మృత్యుదేవత, ఉపసేచనం = అన్నకబళభక్షణమున వ్యంజనము (పచ్చడి), భవతి=అగుచున్నదో అట్టి పరమేశ్వరుని మహిమ నెవఁడు గుర్తించును?

"తస్మై దుపసంహర్త్రే మహాగ్రాసాయ వై నమః"ప్రళయమున ప్రపంచము నుపహరించునట్టి, గొప్ప కబళము (బుక్క) గలయట్టి పరమేశ్వరునకు నమస్కారము."య ఇమా విశ్వాభువనాని జుహ్వత్" ''యః = ఏ పరమాత్మ, ఇమాః = ఈ, విశ్వాభువనాని = లోకములనన్నింటిని, జుహ్వత్=ఆత్మాగ్నియందు వ్రేల్చునో" ఇత్యాది శ్రుతి

వాక్యములయందు వినఁబడునట్టి-మృత్యూపసేచనముతో కూడినట్టి బ్రహ్మక్షత్రోపలక్షితనిఖిలచిదచిత్ప్రపంచకబళ భోక్తృత్వము-విరోధించును.

ఇట్లు తనకన్న వేరైన చరాచరచిదచిత్ప్రపంచమునంతయు తనలో ప్రళయకాలమున పదిలపఱచియుండునపుడు-ఇదియంతయు చంద్రసూర్యాది ప్రకాశములేనిదై రాత్రిదినాదికాల విభాగములేనిదై నామరూపాది విశేషములు లేనిదగుటఁజేసి- స్థూలమగు దేవమనుష్యాది వ్యవహారము లేనిదై తమోమాత్రముగ నుండును.

అట్టితఱి- ఒకే పరమేశ్వరుఁడు- స్వయంప్రకాశమానుడై-తనలోని చరాచర సూక్ష్మజీవాత్మలందరి నూఅడించువానివలె సర్వసాక్షియునై మిగిలియుండును.

ఇందుకు శ్రుతిప్రమాణమును దిగువ గాననగును.

"యదా తమస్తన్న దివా న రాత్రి ర్న సన్నచాసచ్ఛివ ఏవ కేవలః" "యదా = ఏ మహాప్రళయ సమయమున, దివా = పగలు, న = ఉండదో, రాత్రిః = రేయి, న = లేదో, సత్ = నామరూపవిభాగమునకుఁ దగిన చేతనవర్గము, అసత్ = నామరూప విభాగార్హమైన స్థూలజగత్తు, నచ=ఉండుజాలవో (తదా=ఆకాలమునందు తమస్సు ఏర్పడును గాన) కేవలః = తనకన్న వేరుగా చిదచిత్ ప్రపంచము లేనట్టి, శివఏవ = శివుఁడే నుండువాడు"

తమస్సనఁగా- సమస్త కార్యములను విరమించియుండు మహావస్థయగు సుషుప్తి (జీవాత్మల-గాఢనిద్ర)యే తమస్సనఁబడును-

ఇందుకు స్మృతి- "ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్" "ఈ ప్రపంచమంతయు ప్రళయమున-నామరహితమగుటచే

అప్రజ్ఞాతంబు, రూపరహితమగుటచే అలక్షణంబునై తమోమాత్ర ముగ నుండె'' నని-స్మృత్యర్థము.

మహాప్రళయమున శివుఁడు నామరూప విభాగము లేనట్టి సూక్ష్మములైన జీవజగత్తులతో కూడియుండు వాఁడగుటచే-కేవలుఁడని చెప్పఁబడెను. అట్టి శివుఁడు-మరల-సృష్టికాలమున తన సంకల్పము చేతనే- తన నుండి మొదటి శక్తి- స్ఫురించుటతో-పూర్వసృష్టి గత నామరూపములు గల సమస్తమైన జీవజగదుభయమును ఆవిర్భ వింపఁజేయునని తెలియుచున్నది. ఇందుకు దిగువ అభియుక్త సూక్తిని- ప్రోద్బలకముగ గాననగును.

శ్లో॥ చిదాత్మైవ హి దేవోఽంతఃస్థిత మిచ్ఛావశా ద్బహిః ।
యోగీవ నిరుపాదాన-మర్థజాతం ప్రకాశయేత్॥

"పరిపూర్ణ జ్ఞానము గల పరమేశ్వరుఁడు - తనలో దాగి విశ్ర మించుచున్న జీవజగత్తులను తన ఇష్టముతో- యోగి పురుషుఁడు ఎట్టి సాధనము లేకయే వస్తువులఁ బుట్టించునట్లు - సృష్టికాలమున ప్రకా శింపఁజేయును."

ప్రశ్న : మాయాం తు ప్రకృతిం విద్యాత్ - మాయినం తు మహేశ్వరమ్" "మాయ జగత్తునకు ఉపాదాన కారణమనియు, అట్టి మాయతో కూడిన పురుషుఁడు - మహేశ్వరుఁ డనఁబడుఁగు ననియు గుర్తింపవలెను." "తస్మా ద్విరాడజాయత'' "పురుషునివలన విరాట్ అనఁబడు ప్రపంచము ఉదయించెను'' ఇత్యాది శ్రుతులు - మాయా పురుషులుభయులు జగత్తునకు ఉపాదానకారణములగునని చెప్పుచుం డగా- పరమేశ్వరుఁడు-ఎట్టి ఉపాదానము లేకయే జగత్తును పుట్టించు ననుట- పొసగునెట్లు?

ఉత్తరము : ఘటమును నిర్మించుటకు కులాలుఁడు (కుమ్మరి) ఎట్లు వేరుగా నుండునో, ఘటమునకు మృత్తిక ఎట్లు ఉపాదానమగునో, అట్లుగాక - పరమేశ్వరుఁడే మాయాపురుషరూపములతో ప్రపంచమును నిర్మించుటఁజేసి - "పరమేశ్వరుఁడు - యోగివలె తనకంటె వేరగు ఉపాదానము లేకయే జగన్నిర్మాతయగు'' ననుటలో విరోధమేమియు లేదు. స్వరూపమునకు వేరు లేనట్టి మాయా పురుషరూపములు గల పరమేశ్వరుఁడే జగదుపానమగుచున్నవాడని సారాంశము.

ఇందుకు ప్రోద్బలకముగా - అథర్వశిఖోపనిషద్వాక్యమును దిగువ గాననగును.

"ధ్యాయీ తేశానం ప్రధ్యాయితవ్యం। సర్వమిదం బ్రహ్మ విష్ణు రుద్రేంద్రా స్సంప్రసూయంతే, సర్వాణి చేంద్రియాణి, సహభూతై, ర్న కారణం కారణానాం। ధాతా ధ్యాతా। కారణం తు ధ్యేయః - సర్వైశ్వర్య సంపన్న స్సర్వేశ్వర శ్శంభు రాకాశమధ్యే"

"విశేష ఆసక్తితో- ధ్యానింపఁదగిన పరమేశ్వరుని ధ్యానింపవలెను. బ్రహ్మవిష్ణురుద్ర మహేశ్వలు మొదలగు ఈ ప్రపంచమంతయు ఇంద్రియములన్నియు పృథివ్యాది పంచమహా భూతములును పరమేశ్వరుని వలననే జన్మించునట్టివి. సర్వకారణమగు సదాశివ బ్రహ్మము- ఎద్దానివలనను జన్మించునది కాదు. జగత్కారణమగు సదాశివుఁడు - జగము నెట్లు నిర్మింపవలెనో మొదట బాగుగా ఆలోచించును. జగన్మూలకారణమగు సదాశివుని-సర్వైశ్వర్యసంపన్నునిగాను, సర్వేశ్వరునిగాను సాధకుఁడు (శాంభవదీక్షితుఁడు) హృదయాకాశమున (హృదయ స్థానీయమగు భావలింగమును హృదయ బాహ్యధృతమగు ఇష్టలింగము నందును) ధ్యానింప(చింతింప)వలెను."

ఇందువలన తేటపడినదేమనఁగా?

మహాప్రళయమున- ప్రాణులందురు దేనివలన నుపసంహరింపఁబడుదురో దానినుండియే జన్మింతురనియు, ప్రళయముండునంత వరకు ప్రాణులందరు - అనంత శక్తిమంతుఁడగు పరమేశ్వరునందే విశ్రమింతురనియు, అందువలన శివుఁడే సర్వసంహర్తగా సర్వోత్పాదకుఁడుగా బ్రహ్మ శబ్దాభిధేయుఁడగువాడనియు సర్వజగదుపాదానమగుననియు విదితమైనది.

"సంహారము హింసారూపమగుటచే హింసించుటకు వలయు క్రోధము మున్నగు అనర్థగుణములతో సంబంధము బ్రహ్మమునకు సంభవించు'' ననుట- విచారములేక ప్రలపించు నంశమగునది-

ఎట్లనఁగా ?

క్రోధాదులకు మూలమగు తమోగుణము- ప్రాకృత ధర్మమగుటచే అట్టి తమోగుణము పరమేశ్వరునకు ఉండదని - దిగువ శ్రుతి- నిరూపించుచున్నయది.

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం-త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్। ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం- సమస్తసాక్షిం తమసః పరస్తాత్"

**అర్థము** : మునిః = మననమనఃదగు పూజా జపాద్యుపాసనము నొనర్చు శాంభవ దీక్షితుఁడు; పరమేశ్వరుని- పార్వతీ ప్రాణనాథుని గాను, త్రిలోచనుని గాను, నీలకంఠునిగాను, ప్రశాంతునిగాను ధ్యానించినచో- ప్రాణులందరి యుత్పత్తిస్థానము, జీవాత్మలందరి సుకృత దుష్కృతముల సాక్షియు, తమస్సు నతిక్రమించువాడు నగు పరమేశ్వరుని పొందును."

అను శ్రుతి- పరమేశ్వరుఁడు తమోఽతతుఁడనుటకు-పరమ ప్రమాణ మగుచున్నయది.

మఱియు—

శ్లో॥ జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం-తప స్సత్యం క్షమా ధృతిః।
స్రష్టృత్వ మాత్మసంబోధో - హ్యధిష్ఠాతృత్వ మేవ చ॥
అవ్యయాని దశైతాని-నిత్యం తిష్ఠంతి శంకరే॥

సూక్ష్మస్థూల (ద్వివిధ) ప్రపంచమును కనిపెట్టు తెలివి; (జ్ఞానము) ప్రాకృతములగు కామక్రోధాదుల సంబంధము లేనట్టి విరక్తి; (వైరాగ్యము) చేతనాచేతన వర్గమును శాసించు ఈశ్వరభావ (ఐశ్వర్య)ము; జగమును నిర్మించుటకు వలయు నుపాయముల ననపాయముగ నాలోచించు తపస్సు; తన సంకల్పమును సిద్ధింపఁజేయు యథార్థస్థితియనఁదగు సత్యము; భక్తుల అపరాధములను సహించు ఓర్పు; (క్షమ) మహాప్రళయమున నొంటరిగా నుండుటకు వలయు ధైర్యము (ధృతి) క్షమ గలవాడైనను ఉదాసీనుఁడుగాక - జగమును నవనవోన్మేషముగ పుట్టించుటయు, (స్రష్టృత్వము) కించిజ్ఞుఁడైన జీవాత్మ- ప్రాకృతసుఖములకు మఱఁగి నిజరూపమును మఱచునట్లుగాక- సృష్టి స్థితిసంహారముల నొనర్చుచు గూడ తానెట్టి నిరామయుఁడో గుర్తించియుండుట, (ఆత్మసంబోధము తాను సృష్టించిన ప్రపంచము నధిష్ఠించి ఇతరసహాయాపేక్ష లేకుండుటయు; (అధిష్ఠాతృత్వము ఈ పది సద్గుణములు- తఱుగులేనివై - శంకరునందు ఎల్లకాలము నెలకొని యుండును.'' అను పురాణపఙ్క్తి-పరమేశ్వరుఁడు తమసః పరుఁడని-ధృవపఱచినది.

ఇంతియే గాక-

శ్లో॥ అశేవిషయోమోఘ-శుద్ధ బుద్ధి విజృంభణః।
ఆత్మశక్త్యమృతాస్వాద-ప్రమోదరసికో యువా॥

"పరమేశ్వరుఁడు- ప్రాకృత అప్రాకృత సర్వవిధ అంశముల యందు ఉపయోగించునట్టి నిర్మలమైన జ్ఞానముయొక్క వికాసము గలవాడు; తన శక్తియునఁదగు అమృతము నాస్వాదించుటవలన కలుగు ఆనందముఁదగు అభిరుచి గలవాడు; నిత్యనూతన యౌవనముతో దివ్యశరీరుఁడుగ నుండువాడును"

ఇఁట-తమోగుణము వలన కలుగు మోహాదులను తొలగించు జ్ఞానాది దివ్యగుణములతో పరమేశ్వరునకు ఎడతెగని సంబంధముండు నని-విదితమైనది.

మార్పు తగ్గింపు లేనట్టి పరమేశ్వరుఁడు - "సోఽకామయత బహుస్యామ్" విశాల ప్రపంచమగుటకు - తన మాయారూపమగు ఇచ్ఛాశక్తి ద్వారా అపేక్షించును. "స తపోఽతప్యత" తపః స్వరూపిణియగు జ్ఞానశక్తితో - పూర్వసృష్టిని జీవులు ఆచరించిన సుకృత దుష్కృత కర్మలకు అనుకరాలమైన ఆ యా దేవ మానవ పశు పక్ష్యాది శరీరస్థామగ్రి నాలోచించును. ఆలోచన సమనంతరమే సమ స్తమును నిర్మించు నేర్పు గల క్రియాశక్తిద్వారా. "ఇదం సర్వ మసృజత" ఈ ప్రపంచమునంతయు పుట్టించును. ఇచ్ఛాశక్తి యనెడు గోడపై జగచ్చిత్రమునంతయు ప్రకాశింపఁజేయునని భావము.

"తత్సృష్ట్వా - తదేవానుప్రావిశత్" ప్రపంచమును పుట్టించి జీవాత్మ ననుసరించి పరమాత్మ-ప్రపంచమునఁ బ్రవేశించెను. చేతనాచేతనములలో జొఁతిఁబడి- ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తుల సంబంధముతో సత్త్వరజస్తమోగుణ సంబంధముగల-బ్రహ్మ విష్ణు రుద్రాదుల నావిర్భవింపఁజేసియు ప్రపంచరూపముగా పరిణమించెను.

దీనింబట్టి-సర్వవిధసామర్థ్యము గలయట్టి సర్వజ్ఞుఁడునైన శివుని మహిమ-ఎవనికిని తెలియరానిదని-తేటపడినది.

ప్రశ్న: జగత్తు మిథ్య యనుటయే సమంజసమైనది. ఎందు కనఁగా? జగత్తు-ఈశ్వరుని కార్యమని నిరూపించినచో-జగత్తు సత్యమగును. గాన-పరమేశ్వరుఁడు-జగత్తునకు నిమిత్తకారణమైనట్లు-ఉపాదానకారణమగుట-పొసగమి జగత్తును పుట్టించుట సంభవింపదు గదా? ఉపాదానకారణము గూడ నగునని చెప్పునెడ-వికారాస్పదం బగు జగత్తుగా పరమేశ్వరుఁడు (మృత్తిక-ఘటాదులవలె) పరిణమించుట-అనర్థంబగునని (ప్రశ్నసారాంశము).

ఉత్తరము: పరమేశ్వరుఁడు-జగత్తునకు-నిమిత్తఉపాదానోభయ కారణంబగుట-శ్రుత్యాది ప్రమాణసమ్మతంబగుటఁజేసి-ఉపపన్నం బగుచున్నయది.

ప్రశ్న: నిమిత్తకారణమగు కులాలాదికము. ఉపాదానకారణమగు మృత్పిండాదిరూపముగలది కాకుండుటయు, ఉపాదానకారణమగు మృత్పిండాదికము-కులాలాదిరూపము గలది కాకుండుటయు లోకప్రసిద్ధమగుటఁజేసి పరమేశ్వరుడు-జగత్తునకు-నిమిత్తము ఉపాదానంబు నగుట-పొసఁగు నెట్లు?

ఉత్తరము: పరమేశ్వరునకు జగదుభయకారణత్వము శ్రుతిప్రతిపాదిత మగుచున్నయది. ఎట్లనఁగా?

"స్తబ్ధోఽస్యుత తమాదేశ మప్రాక్ష్యో-యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతమ్" శ్రుతి.

యేన=ఏ ఆదేశించువానిచేత, అశ్రుతం=వినఁబడనిది, శ్రుతం భవతి=వినఁబడునదగునో, అమతం=ఇష్టముకానిది, మతంభవతి

= ఇష్టమగునో, అవిజ్ఞాతం= తెలియనిది, విజ్ఞాతం భవతి= తెలియునదగునో, తం= అట్టి, ఆదేశం= చరాచరము నాజ్ఞాపించువానిఁ గూర్చి, అప్రాక్ష్యః= ప్రశ్నించితివి, స్తబ్ధోస్యత= స్తంభించి (చేష్టారహితుడవై) నావెందుకు?

ఇఁట— ఆదేష్ట్ర బ్రహ్మమును తెలిసికొనినచో చిదచిద్రూపమగు జగత్తంతయు తెలియునని శ్రుతి వక్కాణించుటయే గాక "మట్టిముద్ద నొకదానిని గుర్తించినచో-మట్టి వస్తువులన్నియు గుర్తింపఁబడు"నను మృత్పిండదృష్టాంతము— శ్రుతిప్రోక్తమగుటఁజేసియు— బ్రహ్మము నిమిత్తమాత్రమగునని చెప్పునెడ- బ్రహ్మమును తెలిసికొనినచో- సమస్త ప్రపంచము తెలియుట-సంభవింపదు. ఎట్లనఁగా? కుమ్మరిని గుర్తించినచో ఘటాదికార్యము తెలియదు. కాని ఉపాదానంబగు మృత్పిండమును గుర్తించినయెడల—ఘటాదికార్యము విజ్ఞాతంబగును. ఇట్లు చెప్పుటవలన—జగన్నిమిత్తంబగు బ్రహ్మము—జగత్తునకు ఉపాదానమగునెడ— బ్రహ్మజ్ఞానముతో ప్రపంచజ్ఞానము కలుగుట—ఉపపన్నంబగునని—తేటపడినది.

మరియు

"యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చ-తదాత్మానగ్ం స్వయమకురుత"

"సాలెపురుగు-తనలోనుండి దారములను పుట్టించి— లోనికి తీసికొనునట్లు బ్రహ్మము తానే ప్రపంచమును నిర్మించెను" శ్రుతి.

ఇఁట బ్రహ్మమే జగదాకారముగ పరిణమించెనని తెలియుట వలననే పరమేశ్వరుఁడే ప్రపంచమునకు నిమిత్తము ఉపాదానంబు నగునని—నిర్ధారింపఁబడినది.

ప్రశ్న: దోష కళంకములు బొత్తుగా లేనట్టి అవధిలేని మంగళ గుణములు నిండుగా గలిగియుండుటలో అనాధజలముగల సముద్రునిఁ బోలినట్టియు, నిరంకుశము నిత్యసిద్ధంబు నగు వైభవము గలవాడు నగు పరమేశ్వరుఁడు- అజ్ఞానవికారాస్పదము హేయంబునగు ప్రపంచమునకు నుపాదానకారణముగా నెట్లు వర్తించును?

ఉత్తరము: నిత్యము నిర్మలమునగు ఆనందము గలవాడు, (దేనికన్న గొప్పది లేదో, అది నిరతిశయమనఁబడును) నిరతిశయ మగు మంగళము నొసఁగు తన యునికి (స్వభావము) గలవాడు, జగన్నిమిత్తంబునగు శివుఁడు ప్రకృతిగా జగదాకారమగుట-యుక్తంబేను, చిదచిదాకారముగ శివుని పరిణామము సమంజసంబగునని తెలియవలెను.

ప్రశ్న: పరిణామమనఁగా కారణరూపమునకు వికారము సంభవించుట గదా! పూర్వరూపమును పరిత్యజించి రెండవ రూపముఁ దాల్చుటయు పరిణామమనఁబఱఁగును. అందువలన పరమేశ్వరుఁడు తుచ్ఛమగు జగత్తుగా పరిణమించి-అనర్థ ధర్మముచే తిరస్కృతుండగు నని- భావింపవలెను గదా!

ఉత్తరము: నిమిత్తము ఉపాదానమైనను వికారాస్పదముకాకుండునట్లు పరిణామము సంభవించును. ఈ అపూర్వపరిణామము ఎట్టిదో వివరించినచో వినుటకు కుతూహలము కలిగియున్నామని అడిగితివేని వినుము! వివరించుచున్నాము.

"యదా తమ న్న దివా న రాత్రి ర్న సన్నచాసచ్ఛివ ఏవ కేవలః, తదక్షరం తత్సవితు ర్వరేణ్యం-ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ"

"సూర్యచంద్రాదులు లేకుండుటచే దివారాత్రి విభాగము లేనట్టి, నామరూప విభాగము లేనందున సూక్ష్మస్థూలచిదచిద్వస్తువకు అవకాశములేనట్టి సమయమున-నిదియంతయు తమస్సుగా నుండు తఱి- అద్వితీయుఁడైన శివుఁడే విరాజిల్లుచుండెను. తననుండి వేఱుపడని చిదచిచ్ఛక్తి గలవాడై స్వప్రకాశుఁడునై మిగిలియుండెను.

అట్టి శివుఁడు- మహాప్రళయకాలమందైనను వినాశములేని వాడగుటచే అక్షరమనఁ బఱఁగుచున్నవాడు. ఆ శివుఁడే సూర్యునకు పూర్వము తేజస్సు నొసగుటచే సూర్యాంతర్వర్తియై సూర్యునికన్న శ్రేష్ఠుఁడుగా నుండువాడు. సూర్యునిలోనుండు తేజస్సుగూడ శివుఁడేను. తనలో దాగియున్నట్టి-తనకంటె వేరగనట్టియు ప్రపంచము గల శివునినుండి-నిత్యసిద్ధయగు, తత్కాలమున గల తమస్సును తొలగించునట్టి మహాస్ఫురణరూపమైనట్టి ఉత్కృష్టంబు నగు జ్ఞానశక్తి (ప్రజ్ఞ) ప్రవర్తించునది. అటుపిమ్మట "సోఽకామయత-బహుస్యామ్" అను శ్రుతివాక్యము ననుసరించి-నామరూపవిభాగములేనట్టి సూక్ష్మములైన చిదచిద్వస్తువులు శరీరముగ గలవాడగు కారణదశతో కూడియుండు పరమేశ్వరుఁడు- తననుండి తన ఇష్టముచే వేఱుపడునట్టి నామరూపములు గల చిదచిద్వస్తువులు శరీరముగా గలవాడనగుదునని సంకల్పించెననియు, అటుపిమ్మట- ఇదం సర్వ మసృజత- యదిదం కించ"అను శ్రుతివాక్యముఁబట్టి-తన శరీరమగు సూక్ష్మచిదచిత్తులను తననుండి వేఱుపఱచి స్థూలచిదచిత్తులు గలవాడగుననియు, "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుతి యాధారముగా-ఈ జగత్తునంతయు పుట్టించి- అందు ప్రవేశించెననియు, "సచ్చ త్యచ్చాభవత్" అను వేదవాక్కు నవలంబించి-నానావిధ సదసత్ప్రపంచరూపముగా అనేకరీతుల పరిణమించెననియు. "పురుషునకు బాల్యయౌవనాదులవలె" దశాభేదముచే కారణము కార్యంబు నగుననియు విదితమైనవి.

"మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరం- తస్యావయవభూతేన వ్యాప్తం సర్వమిదం జగత్" అనుచో-మాయాశక్తి-జగత్తునకు ప్రకృతి (ఉత్పత్తిస్థానము) కాగా-మాయాశక్తి విశిష్టుఁడు-అనఁగా మాయ నెప్పుడు నెడబాయనివాఁడు-మహేశ్వరుఁడనియు, మహేశ్వరుని అంశమగు పురుషునిచే ఈ జగత్తంతయు వ్యాపింపఁబడినదనియు, శ్రూయమాణంబగుచున్నయది. కేవల శరీరమునుండిగాని, కేవల జీవాత్మనుండిగాని కేశనఖాదులు ఉద్భవింపక- శరీర విశిష్టుఁడైన జీవాత్మనుండియే కేశనఖాదులు జన్మించునట్లు- కేవల మాయనుండి లేక- కేవల మహేశ్వరునుండి గాక- మాయావిశిష్టుఁడైన మహేశ్వరునుండియే సమస్త చేతనాచేతన ప్రకృతియగు పురుషుఁడు- అభివ్యక్తుఁడగును. పురుషస్వరూపుఁడగు పరమేశ్వరునుండి-అవ్యక్తము చతుర్ముఖుఁడు మొదలగు వాని యుదయము సంభవించుచున్నది.

అందువలన- చిదచిద్విశిష్టుఁడైన పరమేశ్వరుఁడు అవస్థావిశేషమునఁజేసి-కారణము కార్యంబు నగుట-సముచితంబని-తెలియవలెను. ఇందువలననే "ఉమాసహాయం" ఇత్యాదిశ్రుతి-పరమేశ్వరుఁడు భూతయోని (సమస్త ప్రాణుల యుత్పత్తిస్థానము) అని పేర్కొనినది. "తత్త్వమసి" ఇత్యాదిని పరమేశ్వరుఁడు చేతనాంతర్యామియని నిర్ధారింపవలెను. అట్లుకానిచో-"అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్-తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" "మాయావిశిష్టుఁడైన మహేశ్వరుఁడు-ఈ విశ్వమునంతయు సృజింపగా- అందు మహేశ్వరభిన్నుఁడైన మరియొకఁడు (జీవాత్మ) ప్రవేశించి మాయాబంధములో చిక్కుకొనెను." ఇత్యాదిశ్రుతులు వ్యాకోపించును. "యో విజ్ఞానే తిష్ఠన్" ఇత్యాదిశ్రుతులు- జీవాంతర్యామి పరమేశ్వరుఁడని విశదపఱచుచున్నందున "ఐతదాత్మ్యమిదగ్ం సర్వమ్" ఇదంతయు

పరమేశ్వరుఁడంతర్యామిగా కలఁడి" గాన "తత్త్వమసి" పరమేశ్వరుఁడంతర్యామిగా గలవాడవు నీవు అవి బహుపర్యాయములు- శ్రుతి అభ్యసించెనని తెలియవలెను.

మఱియు "ద్వాసుపర్ణా సయుజా సఖాయా" "జ్ఞాజ్ఞౌ ద్వా వజావీశానీశా" "నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా-మేకో బహూనాం యో విదధాతి కామాన్"

"మంచి రెక్కలు గలవి, కూడియుండు మిత్రత్వము గలవియునగు రెండు పక్షులు (జీవపరమాత్మలు) ఒకే శరీరవృక్షము నాశ్రయించి యుండునవి, ఆ రెంటిలో నొకపక్షి (జీవాత్మ) కర్మఫలమునను భవించుచుండును. మరియొక పక్షి (పరమాత్మ) కర్మఫలానుభవము లేనిదై సాక్షిమాత్రముగ ప్రకాశించుచుండును" "ఒకఁడు సర్వజ్ఞుఁడు మరియొకఁడు- కించిజ్ఞుఁడు, ఒకడు-స్వతంత్రుఁడు, మరియొకఁడు-పరతంత్రుఁడు. ఇట్లు జీవేశ్వరులు జన్మజరామరణాదులు లేనివారై నిత్యులుగా నుందురు" "నిత్యులలో నిత్యుఁడు, చేతనులలో చేతనుఁడు నగు పరమాత్మ యొకఁడే-శరీరేంద్రియధారులైన అనేక జీవాత్మలయొక్క ఐహికాముష్మికకామితముల నొసఁగుచున్నవాడు".

ఇత్యాది శ్రుతులయందు జీవేశ్వరభేదము నిరూపింపఁబడుటచే "ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్" "స ఆత్మా తత్త్వమసి" ఇత్యాదిశ్రుతివాక్యార్థములు- జీవేశ్వర భేదప్రతిపాదకములని విదితమగుచున్నది.

"అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్య" ఇత్యాదిని- "ఈ జీవాత్మననుసరించి పరమాత్మ ప్రవేశించి" అను నర్థము- "అను" ఉపసర్గఁదగు బలమువలన నేర్పడుటచేతను, "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే" "కర్మాశ్రయమగు శరీరమునందు హృదయగుహలోని పరమాకాశమునందు ప్రవేశించిన

ఇద్దరిలో ఒకఁడు (జీవుఁడు) కర్మఫలము ననుభవించుచుండును. మరియొకఁడు (దేవుఁడు) సర్వజ్ఞత్వాది ఐశ్వర్యానందము నాస్వాదించుచుండును''. ఇత్యాదిని జీవేశ్వర భేదము స్పష్టమగుటఁజేసియు, పరమాత్మయే జీవాత్మయై శరీరముఁ బ్రవేశించుననుట- శ్రుతివిరుద్ధమగుచున్నయది.

"నిత్యో నిత్యానాం" ఇత్యాదిని- నిత్యత్వ చేతనత్వములచే జీవేశ్వరులకు సమానత్వము కనుపడుచున్నను-అనాదికాలమునుండి మలసంబంధము. అనాదికాలమలాసంభవము అనువానితో జీవేశ్వరులకు భేదమే పొడగట్టుచున్నయది.

జీవేశ్వరులు ఒకే శరీరము నధిష్ఠించియున్నను స్వాతంత్ర్యపారతంత్ర్య భేదముచే శరీరగత సుఖదుఃఖానుభవము-పరతంత్రుఁడైన జీవాత్మకు ఉండుననియు, స్వతంత్రుఁడైన పరమాత్మకు ఉండదనియు, దిగువ శ్రుతి వాక్యము నొక్కి చెప్పుచున్నయది.

"సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః-జుష్టం యదా పశ్యత్యన్య మీశ-మస్య మహిమాన మితి వీతశోకః"

ఇద్దానికి-సాంప్రదాయికార్థము-ఉల్లేఖింపఁబడుచున్నది. (ఇయ్యది పండితంమ్మన్యుల అవగాహనకు దూరమగునేమో)

"ఈ జీవాత్మ- అనాదియగు కర్మయను సంకెల (గొలుసు)చే కట్టఁబడినవాడై ఆయా కర్మలయొక్క ఫలముల ననుభవింప ననువులగు మాయామయములైన బహుశరీరములఁ బ్రవేశించి-దుర్వారతాపసంఘాతము ననుభవించుచు-పరతంత్రతవలన పరవశుఁడునై-తాపసంఘాతానుభవమును పోగొట్టకొన నలవిఁగానివాడునై అసమర్థుఁడయ్యే-మాయామోహముఁ జెందియు బాధపడుచుండును. మరియు మహామోహమువలన నేర్పడు దుఃఖసముద్రమున మునుగుచుండును.

ఇ(క తనను ప్రేరేపించువానిగాను సర్వానుగ్రాహకు(డైనఉమా సహితుని గాను పరమాత్మను- శాంభవదీక్షా స్వీకార పురస్సరముగ ఇష్టప్రాణభావ లింగానుసంధానముతో- సాక్షాత్కరింప(జేసికొనునట్టి జీవాత్మ- పరశివానుగ్రహముతో పరమేశ్వరుని- నిరతిశయము శోక రహితము నగు మహిమను పొందువాడగును"

ఇందువలన_అనాదిముక్తు(డగు పరమేశ్వరునకు_శరీరసంబంధ మున్నను-జీవాత్మకు వలె-శరీరగత సుఖదుఃఖానుభవము ఉండదని తేటపడినది.

శాంకరభాష్యమునందు తదభిమతమగు కేవలాద్వైతమునందును పరతత్త్వము నామరహితముగ ప్రతిపాదింప(బడుటచే_బ్రహ్మము- శివనామ సంజ్ఞకమని చెప్పుట పొసగదు గాన కేవలాద్వైతము_శివాద్వైతమనం జెల్లదు. అందువలన నీలకంఠాచార్యులను నామాంతరము గల శ్రీ కంఠాచార్య శివయోగులవారిచే రచింప(బడిన భాష్యములో నిర్ణయింప(బడినట్టి విశిష్టాద్వైతమే శివాద్వైతశబ్దముచే నిర్వచింప( బడునని- గ్రహింపవలెను.

ఇదంతయు శ్రీకంఠ భాష్యవ్యాఖ్యానమున-బాగుగా-సమర్థింప( బడినందున నిట మరల నిద్దాని విస్తారము నుదహరింపలేదు.

వలయువారు అందుచూడనగును.

శ్రీ అప్పయదీక్షితేంద్రులు - తమ విరచితమగు శివాద్వైత నిర్ణయమునందు "శ్రీకంఠ శివాచార్యులు రచించిన భాష్యచ్ఛాయలను పరామర్శించినచో- శ్రీవారికి - శుద్ధాద్వైతమునందే తాత్పర్యము కల దని-తోచెడిని. మందాధికారులు- ఉపాసనామార్గమున శివునారాధించి జ్ఞానులు కాగలుగుదురు" అని ప్రతిపాదించిన యంశము సరికాదు. ఎందుకన(గా? విశిష్ట బ్రహ్మమును నిరూపించు సమస్త వాఙ్మయము

అనెడు గొప్ప మేడను మ్రింగుటకు కడంగిన దీక్షితేంద్రులకు- శ్రీకంఠ భాష్యగతములైన విశిష్టాద్వైతాంశములు అను చిన్న చిన్న ఇండ్లను కూల్చివేయుట - అంత భారము కాదు. అదంతయు స్వామ తాభిమాన మూలమైనది.

శ్రీకంఠాచార్యులు - తమ భాష్యమున - అనేక అధికరణముల యందు - శుద్ధాద్వైతము ననువదించి కంఠరవముతోనే నిరాకరించిరి గాన దీక్షితులు గావించిన భాష్యచ్ఛాయా పరామర్శము - విపరీతార్థ బోధకమగుటచే - అంగీకార్యము కాదని శైవమహాజనులు గమనిం తురు గాక!

ఎట్లనఁగా ?

ఆరంభణాధికరణమునందు- బ్రహ్మమునకు ప్రపంచమునకును ఘటపటములకు వలె మిక్కిలి భేదమును చెప్పువారము కాము. అట్లగుచో - బ్రహ్మప్రపంచములు పృథక్ సిద్ధములు కావని నిరూ పించు శ్రుతులు విరోధించును. ఇఁక నత్యంత అభేద (వస్త్వైక్య) మును వక్కాణించువారము గూడ కాము. శుక్తిరజతములకు వలె నేదేనొక దానికి మిథ్యాత్వమును నిరూపించువారము కాము. అట్లైనచో స్వాభావిక గుణములను బ్రహ్మమునకు ప్రతిపాదించు శ్రుతులు విరో ధించును. ఐతే శరీరశరీరులకు వలె- గుణగుణిలకు వలె-విశిష్టాద్వైత మును నిర్ణయించువారము. ఈక్షత్యధికరణమునందు- శుద్ధాద్వైతము- ప్రశ్నోత్తరములతో నిరాకరింపఁబడినది.

ఎట్లనఁగా ?

ప్రశ్న : "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్. ఏకమేవాద్వితీయం" "సౌమ్యుఁడా! ఈ ప్రపంచము సృష్టికి మున్ను సత్తుగానే ఉండెను." అనుచో గల ఏవకారముచే బ్రహ్మము-రెండవది లేనిదిగా నిర్విశేష

మని చెప్పవలెను గదా! బ్రహ్మము కారణావస్థముగా-సూక్ష్మ చిదచి ద్విశిష్ట మెట్లగును? "ఏకమేవాద్వితీయం" అనునదెట్లు సమర్థింపఁ బడును ?

ఉత్తరము :- "సదేవ" అనుచో గల అవధారణ (ఏవకార)ము రెండవ వస్తువును నిషేధింపక-అసత్కారణత్వమును నివారించునది. "సదేవ" ఇత్యాదిని "ఆసీత్" అను క్రియా విశేషము, "అగ్రే" అను కాలవిశేషము, "ఏకమేవ" అను అవధారణము-రెండవ అధిష్ఠాతను నిషేధించుటయు, "అద్వితీయము" అనుచో జగదుపాదాన కారణము మరియొకటి కాదనుటయు గమనింపఁదగినవి.

ఇందువలననే- బ్రహ్మము - సర్వజ్ఞము, అనంత శక్తివిశిష్టంబు నని పేర్కొనఁబడినది. సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వములు అను విశేషములు లేనిది - బ్రహ్మము- జగత్తునకు ఉపాదానకారణము నిమిత్త కారణము నెట్లగును?

మఱియు "సత్" "బ్రహ్మ" అను పదములను గురించి విచారించుటవలన నదే అధికరణమునందు విశిష్టాద్వైతము సమర్థింపఁ బడినది. సత్ పదము ప్రకృతి ప్రత్యయాత్మకమగుటచే - ఏకవస్తువును చెప్పునది కాదు. ఎట్లనఁగా?

శ్లో॥ శక్తిః శివశ్చ సచ్ఛబ్ద-ప్రకృతి ప్రత్యయోదితౌ।
తౌ బ్రహ్మ సామరస్యేన-సమస్త జగదాత్మకౌ॥

అభియుక్తసూక్తి.

"సచ్ఛబ్దమునకు గల ప్రకృతి ప్రత్యయములచే శక్తి శివులు - చెప్పఁబడుదురు. ఆ ఇరువురు సమరసభావము (ఎల్లకాలము కూడియుండుట)తో బ్రహ్మమగుచు. సమస్త జగద్రూపముగ పరిణమించు

వారు" స్థూలము సూక్ష్మమునగు చిదచిత్ ప్రపంచముఁదగు రూపము గల శక్తితోకూడియుండు పరమేశ్వరుఁడే- కార్యకారణ రూపమున- సత్పదవాచ్యుండగునని తెలియవలెను. ఇఁట "బ్రహ్మ" అను ఏక వచనము - శక్తి శివులలో ఏ ఒకరికిని సంపూర్ణసామర్థ్యము సంభవింపదని తెలుపునదియు, శక్తి విశిష్టశివునకే సృష్టిస్థితిలయాదికము చెల్లుననియు విదితమైనది.

ఇంకను భాష్యమున- ఉభయలింగాధికరణమున- బ్రహ్మముఁదగు స్వరూపము - నిర్దోషములైన కల్యాణగుణములతో కూడినది, ప్రపంచసహితం బగుననియు, నిర్విశేషము కాదనియు ప్రతిపాదింపఁబడినది. మఱియు "ఉపస్థితేఽత స్తద్వచనాత్'' అను యధికరణమున - నిత్యనిర్మల గుణసంపన్నమగు దివ్యవిగ్రహము గల శివుఁడుగా నుండు బ్రహ్మమే ముక్తప్రాప్యంబగుననియు; నిర్విశేషము నీరూపంబు నగు బ్రహ్మము ఉండదనియు నిర్ణయింపఁబడినది.

"ఉపస్థితే = దహరపుండరీకాదులయందు తన నుపాసించుటచే- శివరూపము సమీపించుచుండగా; అతః = శివప్రాప్త్యనంతరము రాబోవు స్వరూపము ఆవిష్కరించుటయను కారణమువలన, తద్వచనాత్ = తస్య-జక్షణాది విహారముయొక్క; వచనాత్ = శ్రుతియందు చెప్పుటవలన; అని సూత్రార్థము.

పూర్వోక్తస్వరూపము గల శివుఁడే - పరబ్రహ్మమనియు; శివసాదృశ్యము లభించుటయే పరమముక్తి యనియు నిట విదితమగుచున్నయది.

"ఏష సంప్రసాదోఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే- 'స ఉత్తమః

పురుషః, స తత్ర పర్యేతి- జక్షన్ క్రీడన్ రమమాణః స్త్రీభి ర్వా యానైర్వా, జ్ఞాతిభిర్వా"

"ఈ జీవాత్మ- ఈ శరీరమునుండి లేచి - పరంజ్యోతి నాశ్రయించియు నిజరూపావిష్కారము గల వాడగును. అట్టివాడు-ఉత్తమ పురుషుఁడనఁబడుఁగును. ఆ పరమపదమున నాతఁడు స్థిరనివాసముఁ జెంది - అమృతమయమగు ఆహారమును భక్షించును. ఆటలాడుకొనును. దివ్యతరుణులతో విహరించును. విమానములఁ బర్యటించును. దివ్యరూపధారులైన జ్ఞాతులతో కాలక్షేపము నొనర్చును" ఇత్యాది శ్రుతులు- శివసామ్యమే పరమముక్తియని-నిర్ధారించినవి.

"నిరంజనః పరమంసామ్యముపైతి"అను శ్రుతివాక్యమున-అంజన మనఁబడు మలమును పోగొట్టుకొనిన ముక్తపురుషుఁడు - శివునితో నత్యంత సమానత్వమును పొందు"నని విశదమగుచున్నయది

రూపమును గుణములను నిషేధించు శ్రుతులయొక్క తాత్పర్యము - ప్రాకృత రూప గుణములను నివారించుటయందు కలదని తెలియవలెను. "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అను శ్రుతులలోగల ఏవకారమునకు "వినాశమేవాపీతి" అను సుషుప్తి వాక్యమున- జీవాత్మ-గాఢనిద్రలో వినాశమును పొందినవాని వలె నగు"నని - ఏవకారమునకు ఇవార్థము ఆచార్య మహాపురుషులందరిచే అంగీకరింపఁబడినట్లు- ఇవార్థమును- సామ్య శ్రుతుల ననుసరించి యంగీకరింపవలసినదేను.

ఇట్లు చెప్పుటవలన-సగుణము, విగ్రహవంతము, సప్రపంచము సవిశేషంబు నగు శివస్వరూపమే - బ్రహ్మంబనియు, నిర్విశేషము బ్రహ్మము కాదనియు. తాము భాష్యమున ననేక సందర్భముల యందు ప్రతిపాదించుటచే విశిష్టాద్వైతమే పరమసిద్ధాంతమని నిరూ

పించినట్టి శ్రీకంఠాచార్యుల యభిమతము శుద్ధాద్వైతపరము కాదని విశదమైనందున - దీక్షితుల పరామర్శమునకు ఎంతమాత్రము అవకాశము లేదని గ్రహింపవలెను.

"శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" ఇత్యాది సూత్రముల యందు గల శివతాదాత్మ్యము - ఆరోపితమగు అభేదమును సూచించును. అనఁగా- శ్రీకృష్ణాదులు "శివుఁడే నేను" అను భావము నారోపించుకొని - అర్జునాదులకు దివ్య నేత్రాదుల నొసఁగుటయు, విశ్వామిత్రుఁడు-రెండవ స్వర్గమును నిర్మించుటయు, అగస్త్యుఁడు-సముద్ర జలముఁద్రాగుటయు ఉపపన్నములగునవి.

ఇందుకు శ్రీసుదర్శనాచార్యులు-తాత్పర్య సంగ్రహమున-

శ్లో॥ బ్రహ్మోచ్యతే పర మసౌ పరమం చ తత్త్వం-
జ్యోతిఃపరం చ పరమేశ్వర! పద్మనాభః।
త్వద్భావనైకరసిక స్త్వదనన్యభావాత్-
మంత్రీ యథా గరుడభావనయా గరుత్మాన్॥

"పరమేశ్వరా! ఈ పద్మనాభుఁడు- నిన్ను ధ్యానించుటలో నిమగ్నుఁడై నీతో నభేదమును భావించుటచే- గరుత్మన్మంత్రోపాసకుఁడు- సర్పమునకు గరుడునివలె కనుపడునట్లు-పరబ్రహ్మమనియు; పరమతత్త్వమనియు, పరంజ్యోతి యనియు పేర్కొనఁబడుచున్నవాడు. వస్తుతః పరబ్రహ్మము కాదని ఇందు-పరమార్థము." ఇదియే గాక-

శ్లో॥ అద్వైత మాగమశిరోభి రుపాసనాయా।
ముక్తం తదేవ పరమార్థతయా న వాచ్యమ్॥

"ఉపాసనయందు జీవేశ్వరులకు ఐక్యమును వేదాంతములు నిత్యా

పెంచినను అట్టి అభేదమే పరమార్థమని భావింపరాదు'' అనియు నుడివిరి. ఇట్లే శ్రీకంఠాచార్యులుగూడ - అద్వైతము నుపాసనయందు అంగీకరించినంతమాత్రమున శ్రీవారికి అద్వైతమునందు తాత్పర్యము గలదని యూహించుట-యుక్తము కాదు.

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

మహోపాధ్యాయ-శివయోగి-ముదిగొండ-నాగలింగశాస్త్రివరేణ్యకృతమగు

బ్రహ్మపథమున- వేదపథమునందు

# శివాద్వైతపథవిధిని-శివతత్త్వ నిరూపణము

స్వేచ్ఛాఽఽంధ్రానువాదము-ఆచార్య-శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్ర్యారాధ్యులు.

ప్రశ్న: ఓయీ! శ్రీ కంఠాచార్యాది ప్రోక్తము -విశిష్టాద్వైతమే యగుగాక! శివాద్వైతశబ్దము గల విశిష్టమైన తత్త్వము-శివాభిధేయము అనుటకు ప్రమాణము కలదా?

ఉత్తరము: "అహ మేకః ప్రథమ మాసం-వర్తామిచ భవిష్యామి చ నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్తః"

"అమరులు కైలాసమున నీవెవరని ప్రశ్నింపగా "నేను సృష్టికి మున్ను ఉంటిని. సృష్టిలో గూడ నుండువాడను. ప్రళయమునందు నుండగలను. నాకంటె వేరైన మరియొకఁడెవఁడును భూతభవిష్యత్

వర్తమానకాలములయందు ఏకరూపముతో నుండ(జాలడు" అని పరమేశ్వరు(డు వ్రాక్కుచ్చెను.

"ఏకో హి రుద్రో-న ద్వితీయాయ తస్థే"

"రుద్రు(డొక(డేను. రెండవవాడు అను పదముచే చెప(బడుటకు నెవ(డును లేకుండెను.

"యో దేవానాం ప్రథమశ్చోద్భవశ్చ-విశ్వాధికో రుద్రో మహర్షిః"

"ఎవ(డు దేవతలలో మొదటివాడుగా- ఆవిర్భవించెనో-అత(డే విశ్వాధికు(డు సర్వజ్ఞు(డునగు రుద్రు(డగును."

"మాయాం తు ప్రకృతిం విద్యాత్-మాయినం తు మహేశ్వరమ్"

మాయాశక్తి-జగద్యోని కాగా-మహేశ్వరు(డు-మాయనధిష్ఠించి మాయాశక్తితో నిరంతరము కూడియుండువాడని-తెలియవలెను.

"భూయః సృష్ట్వా పతయ స్తథేశో- విశ్వాధిపత్యం కురుతే మహాత్మా"

"పరమేశ్వరు(డు- విష్ణుబ్రహ్మాది లోకాధిపతులను పుట్టించి- చరాచర ప్రపంచమును శాసించు అధికారము కలిగియుండును"

"ధ్యాయీతేశానం- సర్వైశ్వర్యసంపన్నః సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే"

సమస్త చరాచర ప్రపంచమును శాసించు ఐశ్వర్యము గలవానిగాను, జీవాత్మలందరియొక్క ప్రభువుగాను పరమేశ్వరుని హృదయాకాశములో ధ్యానింపవలెను."

"శివ ఏకో ధ్యేయః, శివంకరః సర్వమన్యత్ పరిత్యాజ్య"

"అన్యదేవతలను అన్యమంత్రములను విడనాడి—మోక్షాపేక్ష గల వాడు– శివు నొకనినే ధ్యానింపవలెను".

ఇత్యాది శ్రుతి వచనముల చేతను, తద్గతములైనట్టి, ఇతర దేవతా వాచకములు కానివియునగు శివ–ఈశాన–ఈశ్వర మహేశ్వ రాదిశబ్దములతో చెప్పఁబడునది. నిఖిలజగజ్జన్మాదికారణంబు బ్రహ్మ విష్ణ్వాదిసురబృందములచే గంధర్వమునిమానవాదులచేత నుపా సింపఁబడునదియు నగు పరబ్రహ్మము–శివుఁడేనని—స్పష్టమగుచున్న యది.

"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్"

"బ్రహ్మ హవా ఇదమేకఏవాగ్ర ఆసీత్"

ఇత్యాది శ్రుతివాక్యములయందు వినఁబడు "సత్" మొదలగు సామాన్యపదములకు "ఛాగోవా మంత్రవర్ణాత్"అను న్యాయము నను సరించి–శివుఁడను నర్థముఁ జెప్పుట—సమంజసంబగును.

"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే"

"ఏకో హ వై నారాయణ ఆసీత్" ఇత్యాదిని వినంబడు

జగజ్జన్మాదికారణత్వము– మూర్తిద్వయజనకముగా సమర్థింపఁ దగినది. "బ్రహ్మవిష్ణురుద్రేంద్రా స్సంప్రసూయంతే" ఇత్యాదిని శివు నకు త్రిమూర్తి కారణత్వము చెప్పఁబడుటచే–నిఖిలజగజ్జన్మాది కార ణము శివుఁడేనని– విదితమగుచున్నయది.

ఇట్లే మహాభారతమున—రాజధర్మీయ—దుర్గాతితరణాధ్యాయము నందు–

శ్లో॥ యం విష్ణుః రింద్ర శ్శంభుశ్చ బ్రహ్మా లోకపితామహః।
స్తువంతి వివిధైః స్తోత్రైః ర్దేవదేవం మహేశ్వరమ్॥
తమర్చయంతి యే శశ్వత్ దుర్గాణ్యతితరంతి తే॥

"విష్ణుమూర్తి, దేవేంద్రుడు, రుద్రుఁడు, లోకపితామహుఁడగు బ్రహ్మదేవుఁడు- దేవదేవుఁడగు ఏ మహేశ్వరు ననేకస్తోత్రములతో ప్రార్థించుచుందురో – అట్టి పరమేశ్వరు నెల్లకాలము (ప్రత్యహము) ఆరాధించువారు–దుర్గ (పోగొట్టుకొన నలవిగాని ఇడు) ములను తొలగించుకొనఁజాలుదురు'' అని యుల్లేఖింపఁబడినది.

మరియు అనుశాసనికీయ ఉపమన్యూపాఖ్యానము నందు

శ్లో॥ సోఽసృజ ద్దక్షిణా దంగాత్-బ్రహ్మాణం లోకసంభవం।
వామపార్శ్వాత్తథా విష్ణుం-లోకరక్షార్థ మీశ్వరః॥
యుగాంతే చైవ సంప్రాప్తే-రుద్రం ప్రభు రథాసృజత్॥

"పరమేశ్వరుఁడు – తన కుడివైపు నుండి– లోకసృష్టికారకుఁడగు బ్రహ్మదేవుని పుట్టించెను. అట్లే–తన ఎడమవైపు నుండి– లోకములను కాపాడుటకు విష్ణుమూర్తి నావిర్భవింపఁజేసెను– ప్రళయము తారసిల్లగా రుద్రభగవానుని జన్మింపఁజేసెను" అని ప్రతిపాదింపఁబడిన యంశము—పరమేశ్వరుఁడు – మూర్తిత్రయకారణ మగుటను ధృవీకరించుచున్నది.

శ్లో॥ ఈశ్వర శ్చేతనః కర్తా-పురుషః కారణం శివః।
విష్ణుర్బ్రహ్మా తథా సూర్యో-దేవతా శ్చైవ సాన్వయాః॥
సృజతే గ్రసతే చైవ -తమోభూతమిదం యదా।
అప్రజ్ఞాత మిదం సర్వం- తదా హ్యేకో మహేశ్వరః॥

పై శ్లోకములు–వసుహోమ మాంధాతృసంవాదమునందు గలవు.

3)

"ఈశ్వరుఁడు, చేతనుఁడు, జగత్కర్త, పురుషుఁడు, జగత్కారణము, నగు శివుఁడు—విష్ణు బ్రహ్మలను సూర్య చంద్రాదులను వరివార సహితులైన దేవతలను–సృష్టికాలమున.పుట్టించును. ఇదంతయు తమస్సు (గాఢాంధకారము)చే నిండినపుఁడు–చరాచరము నంతయు మ్రింగి తనలో దాచియుంచును. అట్టి తఱి–ప్రపంచమంతయు నామ రూపరహితమగు సూక్ష్మస్థితిఁజెంది– శూన్యప్రాయమగును. ఆ సమయమున మహేశ్వరుఁడొకఁడే స్వప్రకాశమానుఁడై యుండును.''

ఇత్యాది సందర్భమువలన– శివుఁడు–విష్ణు బ్రహ్మ రుద్రజనకుఁడుగా నాలుగవవాడని–విదితమైనది.

ఇందువలననే "శివ మద్వైతం చతుర్థం మన్యంతే – స ఆత్మా స విజ్ఞేయః', ''తనకంటె వేరైనది లేనట్టి శివుని – నాలుగవవానిగా భావించుచున్నారు అట్టివాడే పరమాత్మ – ఉపాస్యుఁడు నగువాడు. ఇత్యాది శ్రుతిజాతము– సుసంగతంబగుచున్నయది.

కొందరైతెనో– సత్త్వ రజస్తమోగుణములు గల విష్ణు బ్రహ్మ రుద్రులను మించినట్టి – మరియొక తత్త్వములేదని చెప్పుదురు. మరి కొందరు పరతత్త్వమునకు దివ్యశరీరముగూడ ఉండదని ప్రతిపాదింతురు. ఈ రెండు మతములు– వేదప్రతిపాద్యములు కావు. ఎట్లనఁగా? బ్రహ్మోపనిషత్తునందు "జాగరితే బ్రహ్మ-స్వప్నే విష్ణుః– సుషుప్తే రుద్ర స్తురీయ మక్షర మాదిత్యో విష్ణుశ్చేశ్వరశ్చేతి''.

"జీవాత్మయొక్క–జాగ్రదవస్థయందు బ్రహ్మదేవుఁడు: స్వప్నా(నిద్రా)వస్థయందు–విష్ణుమూర్తి; సుషుప్తి (గాఢనిద్ర)యందు– రుద్రదేవుఁడు, నాలుగవ తత్త్వము– అక్షరంబనియు గొప్ప దేవత (ఆదిత్యుఁడు) అనియు, సర్వవ్యాపకము (విష్ణువు) అనియు, పరమేశ్వరుఁడు (ఈశ్వరుఁడు) అనియు భావింపఁదగినవారు''

తాపనీయోపనిషత్తునందు-"అకారం బ్రహ్మాణం నాభౌ-ఉకారం విష్ణుం హృదయే-మకారం రుద్రం భ్రూమధ్యే-ఓంకారం సర్వేశ్వరం ద్వాదశాంతే".

ఓంకారమునకు గల- అకార ఉకార మకారములలో - అకారమును బ్రహ్మదేవునిగా నాభియందును, ఉకారమును విష్ణుమూర్తిగా హృదయమందును, మకారమును రుద్రదేవునిగా - కనుబొమల నడుమను, అకార ఉకార మకారాత్మక సమష్టి ప్రణవమును పరమేశ్వరునిగా-శిరోమధ్యగత - సహస్రారచక్రమందును భావింపవలెను."

మైత్రేయోపనిషత్తునందు "తమోవా ఇదిమేక మాస- తత్పరేణేరితం విషమత్వం ప్రయాతి- తస్య ప్రోక్తా అగ్ర్యాస్తనవో - బ్రహ్మ రుద్రో విష్ణురితి"

"ఇదంతయు తమోమయమగు ప్రకృతిగా నుండెను. అయ్యది పరమేశ్వరునిచే ప్రేరేపింపబడినదై - వ్యత్యాసముఁజెందును. అట్టి తఱి-పరమేశ్వరుని మొదటి దివ్యశరీరములు గలవారై-విష్ణు బ్రహ్మ రుద్రులు-ఆవిర్భవింతురు "

మాండూక్యోపనిషత్తునందు-"శివ మద్వైతం చతుర్థం మన్యంతే" ఇత్యాది వాక్యములచే- బ్రహ్మ విష్ణు రుద్రులకన్న వేరైన- నాలుగవ తత్త్వము గలదని అవగతమగుచున్నయది.

మఱియు "అక్షరత్రయ మేతత్తు-కారణత్రయ మిష్యతే-త్రయాణాంకారణం బ్రహ్మ - భారూపం సర్వకారణమ్" "జగత్తునకు- బ్రహ్మ విష్ణు రుద్రులు - అవాంతర కారణములు కాగా - త్రిమూర్తులకు కారణము, సమస్త చరాచరజనకమునగు నాలుగవ తత్త్వము-

పరంజ్యోతిః స్వరూపము నగునది.'' ఇట్లు - యోగయాజ్ఞవల్క్యుని వచనమును గాననగును.

"ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ - పురుషం కృష్ణ పింగళమ్."

"మనోవికారము లేనిది(ఋతగ్ం) వాగ్వికారము లేనిది(సత్యం) యు నగు పర్రబహ్మము- నలుపు గోరుజనము వన్నెగలిగి-పరిపూర్ణ ముగ నుండునది.'' ఇట- పర్రబహ్మము- అర్ధనారీశ్వర స్వరూప మని తేటపడినది.

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం - త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్"

ఇత్యాది శ్రుతివాక్యముల ననుసరించి పరతత్త్వము- ఉమాసహా యత్వాది- విశిష్టవిగ్రహము కలదని విదితమగుటచేతను ఉమాపతి, ఉమాకాంతాది పదములను గ్రంథములయందు లోక వ్యవహారము నందును తఱచుగా ప్రయోగించుట వలనను, అట్టి ఉమాసహాయుఁ డైన పరమేశ్వరుఁడే-నాలుగవ తత్త్వమని ఉపనిషత్తులందు పూరాణ ములయందును కీర్తింపఁబడినదని సారాంశము.

"ఇంతవరకు ఉదహరింపఁబడిన వేదాంత వాక్యములు, శివ పురాణములును త్రిమూర్త్యంతర్గతుఁడైన రుద్రునే ప్రతిపాదించు చున్నవనుట-సరి కాదు. అవ్వానిలో నంతటను బ్రహ్మనారాయణుల వలె- గుణి రుద్రుఁడును పరమశివుని విభూతిలో చేరినవాడగుట- గమనింపఁదగియున్నది.

గుణిరుద్రుని యంశగా సంభవించు సామాన్యరుద్రుఁడు - శివ విభూతియని భావించుటయు కూడదు.

బ్రహ్మ విష్ణ్వాదిశబ్దములతో సహ ప్రయోగము కనఁబడుటఁజేసి త్రిమూర్త్యంతర్గత రుద్రుఁడే శివవిభూతిలో చేరినవాఁడని - స్పష్టమగును.

"శివ ఏవ కేవలః" ఇత్యాది శ్రుతివచస్సులు-నాలుగవ తత్త్వమగు శివుఁడే- జగత్ కారణమగునని - తెలుపుటచే "కారణం తు ధ్యేయః" "శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్ పరిత్యజ్య" అను శ్రుతి మొదలగువాని నవలంబించి శివునికంటె వేరైన దాని నంతయు పరిత్యజించి శివునినే యుపాసింపవలె"నని సమర్థించుట-మున్నగు నంశములు వైష్ణవపథ ప్రతిషేధమున నుల్లేఖింపబడినందున-సర్వవిద్యోపాస్యుఁడుగా - శివుఁడే ముముక్షువులందరిచే నుపాస్యుఁడగునని విదితమైనది.

"అంతరిచ్ఛంతి తం జనే - రుద్రం పరో మనీషయా-గృణ్ణంతి జిహ్వయా రసం" "నిత్యం త్రిసంధ్యం శివలింగ మభ్యర్చ్యమ్"

"జనే = ఏ జనులు; పరోరుద్రం = సర్వాతీతుఁడగు పరమేశ్వరుని; మనీషయా = బుద్ధిపూర్వకముగ, అంతః = మనస్సులో, ఇచ్ఛంతి = భోక్తగా నపేక్షింతురో; (తే = అట్టివారు,) జిహ్వయా = నాలుకచేత, రసం = అమృతమయమగు ఆహార రుచిని, గృణ్ణంతి = ఆస్వాదింతురు" శ్రుతి

అత ఏవ = ఇందువలననే;

"శివలింగమును ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములయందు పూజింపవలె"నని నిగమోక్తులు విధించుచున్నవి.

"ఇట్టి నిగమవాక్యములు - శివారాధనము నిత్యమని తెలుపుచు

లేవు" అని శంకింపఁగూడదు. "అంతరిచ్ఛంతి"అను మంత్రము. శివు నర్చింపక, భుజించుటను నిందించుటచే- నిందచే సంభవించు నిషేధ విధితో శివారాధనము నిత్యమని స్పష్టమగుచున్నయది.

శ్లో॥ అంతరిచ్ఛంతి యే రుద్రం-సదా వంద్యం మనీషయా।
గృహ్ణంతి జిహ్వయా తే హి-రసపూర్ణామృతోదకమ్॥

శ్లో॥ అంత ర్నేచ్ఛంతి యే రుద్రం-సాంబం సంసారభేషజం।
పురీషమేవ గృహ్ణంతి-జిహ్వయా తే న సంశయః॥

"భక్తులచే ఎల్లకాలము నమస్కరింపఁబడు రుద్రుని- బుద్ధిపూర్వకముగా-ఆహారమును లోన స్వీకరించువానిగా భావించుచు నపేక్షించువారు-నాలుకచే- రుచినిండిన అమృతముఁబోలిన ఆహారము నుదకమును గ్రహించువారగుదురు, సంసారము అను మహావ్యాధిఁబోగొట్టు ఘన ఔషధము-శక్తి విశిష్టుఁడు నగు పరమేశ్వరుని - మనస్సులో భావింపక భోజ్యమునంతయు సమర్పింపనివారు - నాలుక (రసన)చే మలమునే భక్షించువారగుదురు" ఇందెంతమాత్రము సంశయము లేదు.

ఇట్లు పరాశరమహర్షి-పై శ్రుతి వాక్యము ననువదించెను.

ఇంతియేగాక - యోగయాజ్ఞవల్క్యుఁడు - బ్రహ్మవిష్ణురుద్రుల ధ్యానమును నిరూపించి - హృదయాకాశమున అకారమును హకారముతో (అహం) నెలకొలిపి - ఉమార్ధదేహుఁడు, వరదుఁడు, (చరాచర సమస్తమున కవాంతర జనకులుగా కారణులగు బ్రహ్మవిష్ణు మహేశ్వరులను పుట్టించునట్టి) సర్వకారణ కారణుఁడు నగు శివుని- ముహూర్త (12 క్షణముల) కాలమైనను ధ్యానింపవలెను. అట్టివాడే ముక్తుఁడగును" అని నిర్వచించెను.

ఇత్యాది సందర్భము - శివధ్యానము- మోక్షహేతు వరచినది.

మఱియు

"తవ శ్రియే మరుతో మర్జయంత-రుద్ర యత్తే జని-
చారు చిత్రం।
పదం యద్విష్ణో రుపమం నిధాయి—తేన పాసి గుహ్యం
నామ గోనామ్॥"

అను ఋక్ సంహితామంత్రము గూడ- దేవతలుగూడ ఆచరించుటఁ జేసి - శివలింగారాధనము అవశ్య కర్తవ్యమని - తేటపఱచినది. మంత్రార్థమును గమనించినచో పై యంశము-మీకే అవగతమగును.

ఎట్లనఁగా ?

హే రుద్ర!=ఓ రుద్రుఁడా! మరుతః=బ్రహ్మాది దేవతలు-చారు =మనోహరము, చిత్రం= ఆకస్మికముగా సాక్షాత్కారము గల దగుటచే ఆశ్చర్యకరము నగు; యత్ = ఏ, తే=నీయొక్క; జనిమ =ప్రాదుర్భావ (జనన)ము గలదో, అట్టి జ్యోతిర్లింగమును, తవ శ్రియే = నీ సంపత్తగు శివత్వము లభించుటకై, అణిమాద్యష్టైశ్వ ర్యము చేకూరుటకైనను, మర్జయంత = పూజించుచున్నారు, యత్= ఎందువలన ననఁగా? ఉప = సమీపమునందు, మా = లక్ష్మీదేవి గల యట్టి (ఉపమం) పదం = స్థాన (వైకుంఠ)ము, విష్ణోః = నారాయ ణునకు, నిధాయి = నీచే నీయఁబడినది, తేన = విష్ణువునకు అఖండై శ్వర్య సంపన్నమగు వైకుంఠము నొసఁగిన కారణముచే, దేవతలు= తమకుగూడ అట్టి ఉన్నతపదవి లభింపవలెనని — నిన్ను పూజించు చున్నారని యర్థము. మరియు భక్తులు జపించి తరించుటకై-గోనాం

= వేదవాక్కులలో, గుహ్యం = రహస్యమైన, నామ = ప్రణవాఖ్య నామమును, ప్రణవఘటిత శివ పంచాక్షరీ మహామంత్రనామమును, పాసి = వాచ్య వాచక సంబంధమున రక్షించుచున్నావు, శాంభవ దీక్షితులై వామకరతలమున భస్మాసనముపై ఇష్టలింగముఁ గాంచుచు జపించువారి శ్రేయస్సునకై అద్దాని సర్వారి ముఖోద్గత మగునట్లు స్ఫురింపఁజేయుచుదువని భావార్థము.

ఇఁక సన్యార్థముల యుక్తాయుక్తత్వములను గమనింతము.

"హే రుద్ర? = ఓ రుద్రుఁడా! యత్ = ఎందువలన, తే జనిమ = నీ జననము, చారు చిత్రం = మనోహరము చిత్రంబునైనదో, అందువలన (త్వాం = నిన్ను,) తవ శ్రియే = నీ సంబంధమైన సంపత్తు లభించుటకై, మరుతో మర్జయంత = దేవతలు పూజించుచున్నారు. నీ జననము చారు చిత్రమైనదెందు కనఁగా - విష్ణోః పదం = విష్ణువు యొక్క పాదము, ఉపమం = బుద్ధిసమీపమున, నిదాయి = నీ (రుద్రుని)చే ఉంచబడినది. తేన = హృదయములో విష్ణుపదమును ధ్యానించుటచే, గోనాం = విష్ణునామములలో, గుహ్యం = రహస్యమగు, నామ = రామనామమును, పాసి = జపించుటతో రక్షించుచున్నావు."

ఈ యర్థము— "త్వాం" "రుద్రేణ" అనునవి - అధ్యాహృతము లగుటచే రుద్రునకు చారుచిత్ర జనిమ నొసఁగు విష్ణువే మరుత్పూజ్యుఁ డగుటవలనను "త్వాం = నిన్ను" అను ద్వితీయా ప్రయోగము పొసఁగనందుచేతను, గోశబ్దమునకు విష్ణునామార్థమును చెప్పుటలో లక్షణాపత్తి యగుటఁజేసియు ఉదహరింపఁబడిన ఉపబృంహణములు విరోధించుటవలనను - అవైదికపటాటోపముగ పరిగ్రాహ్యము కాకున్నది.

"హే రుద్ర! = ఓ రుద్రుడా!

ఎందువలన నీ జననము చారుచిత్రమైనదో, అందువలన నీ సంపత్తు కొరకు దేవతలు–భూమిపై (ఉపమం) ఉంచఁబడిన పద (విష్ణుపాద)మును, కుర్ఘయంత = కడిగిరి. ఆ పుణ్యమైన జన్మతో (తేన)గోనాం–వాక్యములలో–అనఁగా–విష్ణునామములలో రహస్యమైన తారకనామమును. పాసి = అనుసంధానముతో కాపాడుచున్నావు!"

ఈ యర్థము ఏ విధమైనదో విచారింతము.

రుద్రుని సంపత్తు లభింటుటకై దేవతలు విష్ణుపాదమును కడుగుట సాధకము కాదు. ఒకరిని పూజించినవారికి మరియొకరి వైభవము లభించుట లోకమునందు శాస్త్రమునందును గానంబడదని సువిదితమే గదా! రుద్రుని సంపత్తు లభించుటకై అమరులు రుద్రు నారాధించుచున్నారనుటలో-దేవతలకు శివత్వము లభించుట–అసంభవము గాన రుద్రుని సంపత్తుతో సమానమైన సంపద లభించుటకు దేవతలు రుద్రుని పూజింతురను లక్షణాపత్తి అనివార్యమగునది.

"తేన–అమరులు విష్ణుపాదమును కడుగుటయను పుణ్యముచేత" అనుట– ఉత్తరవాక్యమగు "పాసి గుహ్యం నామ గోనాం" అను దానితో సంగతము కాకుండును. ఈ శ్రుతియందు లేని పుణ్యమును కల్పించుట యుక్తముకాదు– పైగా ఇందు రుద్రుఁడు విష్ణువు నర్చించుట చెప్పఁబడనందున నీ వివరణము-కేవల తాంత్రికప్రోక్తముగా–అనుపాదేయమగునది.

మఱియు–

"తముష్టుహి యస్స్విషు స్సుధన్వా యో విశ్వస్యక్షయతి భేషజస్య–

యక్ష్వా మహే సౌమనసాయ రుద్రం-నమోభి ర్దేవ
మసురం దువస్య"

అర్థము: యః = ఎవడు, స్వీషుః = (సుష్ఠు ఇషుః = స్వీషుః) విష్ణుసోమాగ్నిమయ బాణము గలవాడో "చింతయిత్వాహరిం విష్ణు-మవ్యయం యజ్ఞవాహనం-శరం ప్రకల్పయాంచక్రే-విశ్వకర్మామహా మనాః" "గొప్ప మనస్సు గల విశ్వకర్మ-అవ్యయుఁడు యజ్ఞవాహనుఁడు విష్ణువునగు శ్రీహరిని(చింతించి) బాణమును కల్పించెను" అను మహాభారతాంతర్గత కర్ణపర్వమునందలి ప్రమాణము ఇందుకు ఆధారము. సుధన్వా = మేరు పర్వతము ధనుస్సుగా గలవాడో; ఇందుకు ప్రోద్బలకముగా లింగమహాపురాణవాక్యములఁ గాననగును. "శైలేంద్ర కార్ముక శ్చాపి-జ్యాభుంగాధిపః స్వయమ్" మేరువు ధనుస్సుగా సర్పాధిరాజు అల్లెత్రాడు గాగలవాడై"అథవా-సంవత్సరము ధనుస్సుగా గలవాడని_దిగువ కర్ణపర్వగత ప్రమాణముఁబట్టి చెప్పవచ్చును.

"విచిత్రం ఋతుభి ష్షడ్భిః-కృత్వా సంవత్సరం ధనుః"

"ఆరు ఋతువులతో విచిత్రమగు సంవత్సరమును ధనుస్సుగా నమర్చుకొని" అథవా-ఓంకారము ధనుస్సుగా కలవాడు సుధన్వయని "స కృత్వా దనురోంకారం.సావిత్రీం జ్యాం మహేశ్వరః" "మహేశ్వరుఁడు-ఓంకారమును ధనుస్సుగా, గాయత్రి నల్లెత్రాడుగా నొనర్చి" అను ప్రమాణము_చాటుచున్నది. విశ్వస్య = సంసారము అను మహా వ్యాధికి, భేషజస్య = నివారకమైన ఉపాసనాత్మక జ్ఞానమనఁదగు గొప్ప ఔషధమును, క్షయతి = ఒనఁగూర్చువాడో, తమేవ = = అట్టి పరమేశ్వరునే (హే అంతరాత్మన్) స్తుహి = నుతింపుము! ఇట్లు చెప్పుటచే-వాచిక పూజనము సంభావ్యమగుచున్న

యది. సౌమనసాయ = సౌమనస్యముకొఱకు, మహే = దీక్షాంగమైన పండుగయనఁదగు సుసమయమున, తమేవ రుద్రం = ఆ పరమేశ్వరునిఁగూర్చియే, యక్ష్వ! = యజించుము! ద్రవ్యత్యాగముఁజేయుమని యర్థము. ఇట్లు వక్కాణించుటవలన మానసికారాధనము ఏర్పడుచున్నయది. యాగమనఁగా = ద్రవ్యత్యాగము. అద్దానికి మనస్సే ముఖ్యసాధనము, అసుం = ప్రాణమును, రాతి = ఒసగుచున్నవాడు గాన- ప్రాణదాతయగు, తమేవ దేవం = అట్టి మహాదేవునే, నమోభిః = ప్రణామములచేత, దువస్వ = సేవింపుము, ఇట్లు వాక్రుచ్చుటవలన శరీరకర్తవ్యమగు సేవారూపమైన పూజనము సంభవించుచున్నయది.

వాఙ్మానసకాయకర్తవ్యమగు ఆరాధనమునకు మహేశ్వరుఁడే సమర్థుఁడని పై మంత్రము ఉద్ఘాటించినదని గ్రహింతురుగాక!

ఇంతియేగాక -

"త్వం దేవేషు బ్రాహ్మణోఽస్యహం మనుష్యేషు- బ్రాహ్మణో వై బ్రాహ్మణ ముపధావతి ఉపత్వాధావామి"

"దేవతలలో నీవు బ్రాహ్మణుఁడవు! నేను మానవులలో బ్రాహ్మణుఁడను, బ్రాహ్మణుఁడు-బ్రాహ్మణునాశ్రయించుట-న్యాయమగుటచే నిన్ను సమీపింప వడి నేతెంచువాడను"

ఉపసంహారమునందు "విరూపాక్షోఽసి" అనుచో విరూపాక్ష పదము వినఁబడుటచే-శివుఁడు బ్రాహ్మణులకు శరణ్యుఁడుఁగా ఆశ్రయింపఁదగినవాడై- ఆరాధనీయుఁడగుచున్నవాడు. అట్లు కానిచో "యో వై స్వాం దేవతా మతియజతే ప్రస్వాయై దేవతాయై చ్యవతే న పరాం ప్రాప్నోతి-పాపీయాన్ భవతి" "ఎవఁడు తన కులదేవతను విడనాడి ఇతరదేవత నారాధింపఁబూనునో, అట్టివాడు తన కుల

దేవతకు దూరమగుటయే గాక ఇతర దైవమునకు గూడ సన్నిహితుఁడు కాకుండును" అను శ్రుతియందుగల ఉభయభ్రష్టత్వము సంభవించును. మరియు వైష్ణవపథప్రతిషేధమునందు చూపఁబడు ప్రమాణములతో— నిఖిలజగజ్జన్మాధికారణమైన శివుఁడొకఁడే సమస్త వేదవేద్యుఁడుగా— తెలియఁదగినవాడు, ధ్యానింపఁదగినవాడు, పూజింపఁదగినవాడు నని—విదితమగుచున్నయది.

ఇట్లు అర్చనాదిరూపమగు పరమేశ్వరోపాసనము—పాశుపత వ్రతానుష్ఠాన పూర్వకముగానే ఆచరింపఁదగినదని- వేదాంత వాక్యములవలన అవగతమగుచున్నయది.

ఎట్లనఁగా?

## శాంభవదీక్షా విధి

శ్లో॥ ధృత్వా పాశుపతవ్రతోక్తవిధినా లింగస్వరూపం శివం।
యేఽశ్రాంతం సముపాసతే శ్రుతిగణై శ్శృత్వా చ
మత్వా ముహుః ॥

ఛిత్వా పాశగణం దురంతభవ శోకాంబుధేః కారణం।
ముక్తిం తేఽశ్నువతే శివస్య పరమాం సాయుజ్యరూపాం
బుధాః ॥

ఎవరు— పాశుపతవ్రతప్రక్రియలో చెప్పఁబడిన విధానముగా

లింగస్వరూపుఁడైన శివుని-శరీరముఁదగు ఉత్తమాంగమునందు ధరించి-వేదవాక్యముల సమూహముల నాలకించి-మాటిమాటికి తలచుకొనియు-ప్రతిదినము నియమిత సత్సమయములయందు- ఎడతెగక నుపాసింతురో, అట్టివారు-నిరవధిక సంసార సముద్రనిమగ్నత నాపాదించు పాశసముదాయమును త్రెంచుకొని- ముక్తులలో శ్రేష్ఠమైన శివసాయుజ్యముఁ జెందురురు. విజ్ఞులారా! అవధరింపుడు!

"వ్రతమేతత్ పాశుపతం-తత్సమాచ రేన్ముముక్షురపునర్భవాయ"

"వ్రతమేతచ్ఛాంభవం-తత్సమాచరేత్"

"ఇయ్యది-పాశుపతవ్రతమనఁబడును. ముముక్షువు జన్మరాహిత్యమునకై పాశుపతవ్రతము నాచరింపవలెను"

"ఇద్ది శాంభవవ్రతంబని చెప్పఁబడును. అద్దాని నవశ్యమాచరింపవలెను" ఇంతియే గాక-

"తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత-శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్" అను శ్రుతి-విధియుక్తముగా పాశుపతవ్రతము నాచరించిన వారికే బ్రహ్మవిద్యయందు అధికారము ననుశాసించినది. ఇందువలననే-

శ్లో॥ వ్రతం పాశుపతం చీర్ణం-యై ర్ద్విజై రాదరేణ తు।
తేషామేవోపదేష్టవ్య-మితి వేదానుశాసనమ్॥

"ఆసక్తితో పాశుపతవ్రతము నాచరించినవారికే-బ్రహ్మవిద్య నుపదేశింపవలెను అని వేదానుశాసనము కలదు" అను సూతసంహితా వచనము-ప్రకృతమైన శ్రుత్యర్థము నుపబృంహించినది.

"శిరోవ్రతమనఁబడు పాశుపతవ్రతము-బ్రహ్మవిద్యాశ్రోతలందరికి సాధారణమైనది" అని మాధవాచార్యులు-సూత సంహితావచనమును వ్యాఖ్యానించిరి. మరియు- శ్రీకంఠభగవత్పాదులు-బ్రహ్మసూత్రభాష్యమున "అంగావబద్ధాస్త్వితి" అను అధికరణమునందు-బ్రహ్మోపాసకులందరును పాశుపతవ్రత ధర్మములగు భస్మోద్ధూళనాదులను సర్వవిధ ఉపాసనములయందు తప్పనిసరిగా ఆచరింపవలెను" అని సమర్థించినవారు.

ప్రశ్న: ఓయీ! మోక్షము సాధ్యమనుట కూడదు-ఎందుకనఁగా? మోక్షము సిద్ధముగాని సాధ్యముకాదు. సాధ్యమగుచో "ఎద్ది సాధ్యమో అయ్యది అనిత్యము"అనువ్యాప్తి చే-మోక్షము అనిత్యమని తేటపడును గదా!

ఉత్తరము: మోక్షము సిద్ధమైనను అద్ది-అభివ్యక్తము కాదు గాన నభివ్యక్తమగుటకు వలయుసాధనము అపేక్షితమగుటఁ జేసి-మోక్షము సాధ్యముగ వ్యవహరింపఁబడుచున్నయది. ఎట్లు స్వర్గము సిద్ధమైనను ఆ యా జీవాత్మలు అపేక్షించు దివ్యసుఖముల ప్రాప్తికై యాగాది సాధనములనవలంబించుట కారణముగా సాధ్యమగునో అట్లే మోక్షము సాధ్యమగునది. ఒకవేళ మోక్షము వస్తుతః సాధ్యమని వాదించినను (మోక్షము) అనిత్యము కాజాలదు ఎట్లనఁగా? ఘటాదుల యొక్క-(ధ్వంసము) అభావము నిత్యమని అంగీకృతమగుటచే "యత్కృతకం తదనిత్యం" అను వ్యాప్తి కిచట భంగమేర్పడునని తెలియవలెను.

"యదిహాప్యనేవంవిత్ మహత్పుణ్యం కరోతి-తద్ధాస్యాం తతః క్షీయత ఏవ-ఆత్మానమేవ లోకముపాసీత-సయ ఆత్మానమేవ లోకముపాస్తే-నాస్య కర్మక్షీయతే" "బ్రహ్మము సుపాసింపనివాడు గావించిన పుణ్యము-ఎంత గొప్పదైనను అతఁడు భూలోకమున స్వర్గాదు

లందు ననుభవించుటతోఁడనే-క్షీణించును. అందువలన పరమాత్మనే ఉపాసింపవలెను-పరమేశ్వరునారాధించువాని పుణ్యము క్షీణింపదు" అను శ్రుతియాదారముగా- బ్రహ్మవిత్కృతకర్మము- అక్షయమగునని విదితమగుచున్నందున-మీరు చూపిన- కృతకన్యాయము-శ్రుతిచే బాధింపఁబడినదని తేలినది.

"నాస్త్యకృతః కృతేన" కృతేన = కర్మచే, అకృతః= మోక్షము నాస్తి = లభింపదు అను శ్రుతివాక్యము ననుసరించి- మోక్షము కర్మసాధ్యము కాదు- అని చెప్పఁగూడదు.

ఈ వాక్యమున ''కృతేన'' ''కేవలకర్మచేత లభించు స్వర్గాదికము నాస్తి = నిత్యముకాదు'' అను నర్థముఁ జెప్పవలెను. జ్ఞానసహకారియగు కర్మచే సాధింపఁబడు మోక్షమునకు నిత్యత్వము అనివార్యంబగును. అట్లు కానియెడల "విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయగ్ం సహ" అను శ్రుతి-జ్ఞానమునకు కర్మసాహచర్యమును బోధించుట-విరోధించును.

"విద్యాం చావిద్యాం చ'' అనుచో ''విద్యాశబ్దము-ఉపాసనను బోధించును గాన కర్మతో కూడియుండుట- ఉపాసనకే గాని జ్ఞానమునకు కాదు'' అని భావింపరాదు.

వేదాంతములయందు నిరూపింపఁబడిన జ్ఞానము. ఉపాసనారూపమగుటఁజేసి-అనుభవరూపమైన జ్ఞానము- వేదాంతతాత్పర్యమునకు విషయము కాకుండును.

ఇందువలననే శ్రీకంఠ భగవత్పాదులు-సూత్రభాష్యమున "సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్'' అను సూత్రాధికరణమునందు ''రథమును నడుపుటకు దక్షిణాశ్వము- వామాశ్వముయొక్క

సహకారము నపేక్షించునట్లు- కర్మసహకృతమైన ఉపాసనాత్మక జ్ఞానము మోక్షహేతువు" అని ప్రతిపాదించిరి. మరియు

''అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్'' అనుచో ''జ్ఞానము మోక్షకారణమైనట్లు అగ్నిహోత్రాదికమగు వైదికనిత్యకర్మ గూడ—మోక్షసాధనమగునని నిరూపించిరి.

అందువలన— కృతకన్యాయము శ్రుతిబాధితమగుటయేగాక సూత్ర నిషిద్ధంబగుటచే మోక్షము సాధ్యమైనను అక్షయమగుట- పొసగుచున్నయది.

ప్రశ్న: పాశుపత వ్రతమునకు మోక్షము ఫలమగునెడ-పాశుపత వ్రతము-కామ్యమగును గదా!

ఉత్తరము: ఇంద్రియసుఖము నిహపరలోకములయందునొదవం జేయు కర్మయే కామ్యమని-నిర్ధారితమగుటంజేసి- మోక్షఫలకమగు పాశుపతవ్రతము కామ్యము కానేరదు.

అట్లు కాదందురేని-కామ్యములు కానట్టి నిత్యకర్మలు మోక్షము ఫలముగా గలవని ఆచార్యులందరంగీకరించుటవలన- మోక్ష ఫలము నొసంగు కర్మలుగూడ- కామ్యములగునని భావించునెడ-నిత్య కర్మలుగూడ విడువందగినవి యగును. అందువలన మోక్షావహము లగు కర్మలకు కామ్యత్వప్రసక్తియే అసంగగమగుచున్నయది.

ప్రశ్న: "అగ్ని రిత్యాభి భిర్వి మృజ్యాంగాని సంస్పృశేత్— వ్రతమేతత్ పాశుపతమ్" ''అగ్నిరితి భస్మ'' ఇత్యాది మంత్రముల నుచ్చరించుచు. భస్మను శరీరావయముల నలందవలెను. ఇద్ది పాశుపతవ్రతమనంబడును." అను జాబాలాగ్నిరుద్రోపనిషద్వాక్యమువలన పాశుపతవ్రతము—భస్మధారణాత్మకమేనన్ని ఊహింపందగినదై భస్మ రుద్రాక్ష శివలింగధారణాత్మకము కాద్నని తెలియుచున్నది గదా!

ఉత్తరము. మరియొక ఉపనిషత్తులయందు శ్వేతాశ్వతరాది కల్పములయందు, దివ్యాగమములయందును పాశుపతవ్రతము-భస్మ రుద్రాక్ష శివలింగ ధారణాత్మకము, భస్మరుద్రాక్ష ధారణాత్మకము. భస్మధారణాత్మకము నని - ముత్త్రివిధములుగా చెప్పఁబడినది. అవ్వా నిలో మొదటిది ముఖ్యము, రెండవది మధ్యమము, మూడవది కనిష్ఠంబు నని ప్రోక్తమగుటచే- కాలాగ్ని రుద్రోపనిషద్వచస్సు వలన- పాశుపతము భస్మధారణాత్మకమే నని-నిశ్చయింపరాదు.

ఇందువలననే ఉపనిషత్తులలోని భస్మరుద్రాక్ష శివలింగధారణ విధి వచనములు-చరితార్థములగుచున్నవి.

ఎట్లనఁగా ?

"సర్వలింగగ్గ్ స్థాపయతి" ఇత్యాది వాక్యము- శివలింగధారణమును విధించుచున్నయది. "సర్వస్వరూపుఁడైన శివుని యధికరణమగు లింగమును....... "సర్వరూపం భవం జ్ఞాత్వా - లింగేఽర్చయతి యః ప్రభుమ్" అనుచో-సర్వరూపుఁడగు శివుని యధికరణము లింగమని-స్మరింపఁబడినది. లేక శివుని ప్రకటించు స్థానము లింగమని- "సర్వో హ్యేష రుద్రః, అను శ్రుతి వలన "లీయతే గమ్యతే యస్మిన్ - యతః సర్వం చరాచరమ్" అను స్మృతివలనను నిర్ణయింపవచ్చును. అథవా- "సర్వస్య - చరాచరాత్మక ప్రపంచము యొక్క, లింగం = సృష్టిలయ స్థానమెద్దియో" అనియు, యద్వా "నిధనపతయే నమః" ఇత్యాదిని-ప్రతిపాదింపఁబడిన దశవిధరూపములను స్ఫురింపఁజేయునట్టి- శివలింగమును-సమీపవర్తియగు శరీరమునందు నెలకొలుపవలెను," ఇట్లు చెప్పుటచే- లింగధారణము శరీరమునందేనని విదితమైనది.

ప్రశ్న: "సర్వలింగగ్గ్ స్థాపయతి" అను శ్రుతివచనము-

భూమియందు శివలింగమును ప్రతిష్ఠింపవలె''నని విధించునది కాదా!

ప్రశ్న: "పాణినా=హస్తముచే, మననాత్=పూజించుటవలన, త్రాయత ఇతి=రక్షించునుగాన" అను తృతీయా సమాసార్థముతో- పాణిమంత్రపదము- సార్థకమగును గదా!

ఉత్తరము: "దేవాన్యజేత" "దేవతలను పూజింపవలెను" ఇత్యాదిని- సామాన్యపూజనముఁ గూర్చి- హస్తాదికము సాధనమగుట- ఉచితము గాన- ప్రత్యేకముగ పాణిమంత్రపదముఁ బ్రయోగించుట- సార్థకము కాజాలదు.

ప్రశ్న: "మననాత్ త్రాయతే" అనుటలో- మనస్సు మొదలగునవి సాధనములగునని ఏర్పడుటవలన- మనఃప్రవృత్తులకు ప్రాముఖ్యమును నిరాకరించుటకు పాణిమంత్రపదము ఉపయుక్తంబైనదని చెప్పవచ్చును గదా!

ఉత్తరము: "శివ పూజాదికం కార్యం — మనోవాక్కాయ కర్మభిః" అను అభియుక్తోక్తివలన- మానసాదులు - శివపూజనమునకు సాధనములగుట - సర్వసమ్మతంబగుటయే గాక సుకృతమునంతటికిని- మనః సమాధానము అవశ్యకమగుటచే ''పాణినైవ" "హస్తము చేతనే" అని మానసాదులను నివారించుట- అపసిద్ధాంతమగును.

ప్రశ్న: ఓయీ! సర్వలింగ వాక్యమునకు లింగధారణ ప్రతిపాదకత్వము- ప్రకరణవిరుద్ధంబగును గదా!

ఉత్తరము: సర్వలింగ వాక్యము - లింగధారణరూపమగు అర్థము గలదని చెప్పుటయే ప్రకరణానుకూలమైనది.

ఎట్లనఁగా ?

''నిధనపతయే నమః" అనునది మొదలుకొని- ''ఏతత్సోమస్య

సూర్యస్య" అనునది వరకు- సర్వలింగవాక్యము సన్నిహితమగుటచే- లింగధారణమునకు "నిధనతపయే నమః" ఇత్యాది వాక్యములు— అర్థవాదమగుచున్నవి. ధరింపఁబడు శివలింగమును -నమోఽంతము లగు "నిధనపతయే" ఇత్యాది వాక్యములు ప్రశంసించుచు శివలింగ పరిజ్ఞానమును కలిగించుటయే గాక - నిధన పతిత్యాది లక్షణములు గల లింగములకు _ ధార్యమాణ శివలింగమునకు అభేదమును ప్రతి పాదించుచున్నవని తెలియవలెను.

ప్రశ్న : "నిధనపతయే నమః" ఇత్యాది పురోవాదము ననుస రించి-సర్వలింగ వాక్యము—లింగధారణ విధాయకమని- నిరూపింప రాదు. ఎందుకనఁగా? "నిధనపతయే నమః" ఇత్యాది వాక్యములకంటె ముందు "దహ్రం విపాప్మం" ఇత్యాదిని- దహ్రవిద్య- ప్రతిపాదింపఁ బడినది. అందువలన-నిధనపతయే నమః ఇత్యాది వాక్యములు—సర్వ లింగ వాక్యంబును దహ్రవిద్యకు అర్థవాదములుగా _ దహ్రవిద్య ననుపదించినవని చెప్పుట- సమంజసమగును గదా!

ఉత్తరము : "దహ్రం విపాప్మం" ఇత్యాది పురోవాదముఁబట్టియు సర్వలింగవాక్యము- లింగధారణ పరమగుట- అసమంజసము కాదు. ఎట్లనఁగా? దహరవిద్య—పరమేశ్వరుని సంబంధము గలదగుటచేతను ప్రాణలింగోపాసనారూపమగుటను - ఇష్టప్రాణలింగోపాసనలు రెండును ముక్తిఫలసాధకములగుటఁ జేసియు- సర్వలింగవాక్యము- లింగధారణమును విధించునని వక్కాణించుట-ప్రకరణ విరుద్ధంబని నిరూపింప వలనుపడదని గుర్తింపవలెను.

ప్రశ్న : దహరవిద్య-పరమేశ్వరుఁజెందినదైనను ప్రాణలింగో పాసనాపరమని చెప్పుటకు అధారమెద్ది?

ఉత్తరము : "ప్రాణేష్వంత ర్మనసో లింగ మాహుః- యస్మిన్ క్రోధో యా చ తృష్ణా క్షమా చ - తృష్ణాం ఛిత్వా హేతుజాలస్య మూలం—బుద్ధ్యా సంచింత్య—స్థాపయిత్వాఽథ రుద్రే"

"పంచప్రాణములు మనస్సు అనువాని గ్రంధిగా- మధ్యన శివ లింగమును శివయోగులు భావింతురు. క్రోధము, ఆశ, క్షమ ఇత్యాది గుణములు మనస్సున సంభవించునట్టివి. బుద్ధిబలముచే-సంసారకారణ ములగు రాగ ద్వేషాదులకు మూలమగు తృష్ణ (ఆశ)ను విసర్జించి- మనస్సును శివునందు నెలకొలిపియు"

"గాలి లేనిచో కదలని దీపమువంటివాడు, అంగుష్ఠమాత్రుఁడు, ఓంకార వాచ్యుఁడు నగు పరమేశ్వరుని-హృదయ పద్మకర్ణికయందు ధ్యానింపవలె" నని ధ్యానబిందూపనిషత్తు- ప్రతిపాదించుటయే గాక- శివుఁడు హృదయాంతర్వర్తిగా-లింగరూపుడనియు, జీవాత్మయొక్క గాఢనిద్ర "లింగే సుషుప్తిః" శివలింగమునందు సంభవించునని యు హంసోపనిషత్తు-నిరూపించినది.

అందువలన- దహరవిద్య - ప్రాణలింగోపాసనను ప్రతిపాదిం చుటయే గాక- ఇష్టలింగోపాసనఁ గూడ సమర్థించినదని - సువిదిత మైనది.

ప్రశ్న : అంతర్లింగధారణముతోడనే మోక్షము సిద్ధించును గాన- బాహ్యలింగధారణము అనావశ్యకమని తోచెడివి.

ఉత్తరము : బాహ్యలింగధారణము - నిరర్థకంబందురేని — ఏ మగునో అవధరింపుఁడు! బ్రహ్మసూత్ర (యజ్ఞోపవీత)మును ధరిం చుట- వ్యర్థంబగును. ఎట్లనఁగా ?

శ్లో॥ హృదిస్థా దేవతాస్సర్వే-హృదిప్రాణాః ప్రతిష్ఠితాః-
హృది ప్రాణాశ్చ జ్యోతిశ్చ-త్రివృత్సూత్రం చ
తద్విదుః।

యదక్షరం పరంబ్రహ్మ-తత్సూత్రమితి ధారయేత్-
సూచనా త్సూత్ర మిత్యాహుః-సూత్రం నామ
పరంపదమ్॥

తత్సూత్రం విదితం యేన-స విప్రో వేదపారగః॥

''దేతలందరు హృదయములో నుండువారు. పంచప్రాణము లును హృదయము నాశ్రయించునవి. కర్మజ్ఞానేంద్రియ సూక్ష్మాంశ ములు- మనోగతములైనవి. హృదయాకాశగతమగు అక్షరమైన పర బ్రహ్మమును- మూడు వరుసలుగల సూత్రముగా బాహ్యమున ధరింప వలెను. అంతఃస్థితమగు పరమాత్మను సూచించును గాన నుపవీతము సూత్రమనఁ బఱఁగుచున్నయది. అట్టి సూత్రము నెఱఁగువాడే- వేద పారగుఁడైన విప్రుండుగా చెప్పఁబడును."

ఇవ్విధము బ్రహ్మోపనిషత్తు - నిరూపించుటచే - బాహ్యసూత్ర ధారణము బ్రహ్మభావనను దృఢపఱచునట్లు-బాహ్యలింగధారణము- అంతర్లింగభావనను బలపఱచునదని- మీరు మేము నంగీకరించుట- అనివార్యంబగును. ఇందువలననే-

"అప్రతీకాలంబనాస్తు తే-యే విశ్వాధికం బ్రహ్మ-సాక్షా దుపాసతే - సాక్షాదుపాసకాన్ పురుష స్సాక్షాద్బ్రహ్మైవ గమయతి."

"చేతనుని గాని అచేతనమును గాని యుపాసింపక - ఎవరు విశ్వాధికమైన బ్రహ్మమును హృదయాకాశమున సాక్షాదుపాసింతురో,

వారు - అప్రతీకాలంబనులనంబడుదురు. బ్రహ్మమును పరంజ్యోతి స్స్వరూపముగా నుపాసించు ముముక్షువుల సమానవుఁడైన దివ్యపురుషుఁడు - బ్రహ్మమును- పరమపదమున ననుపదమే చేర్చు"నని శ్రీ ఆద్యశంకరాచార్యులు ప్రతిపాదించిరి.

శ్రీ నీలకంఠ భగవత్పాదులును-

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం-
త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం।
ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం-
సమస్తసాక్షిం తమసః పరస్తాత్ ॥"

"పరమేశ్వరుని-ఉమాసహాయునిగాను, ప్రభువుగాను, త్రిలోచనునిగాను, నీలకంఠునిగాను, ప్రశాంతునిగాను, మనన శీలుఁడైన మహాపురుషుఁడు- పూజా జప ధ్యానముల నుపాసించినయెడల- చరాచర జీవప్రేరకుఁడు, సమస్త ప్రాణుల యుత్పత్తిస్థానము, తమసః (మూలప్రకృతి కంటె) పరుఁడు నగు పరమాత్మ యొక్క ప్రాప్తి - చేకూరును." ఇత్యాది శ్రుతుల-యాధారముగా బ్రహ్మమును పరంజ్యోతిర్లింగముగ నుపాసించు మాహేశ్వరులు- శరీర పాతానంతరమే శివసాయుజ్యముఁ జెందుదురు" అని నిరూపించిరి.

ఇవ్విధము దహ్రోపాసనమనఁ దగు ప్రాణలింగోపాసనము— సాక్షాత్ బ్రహ్మోపాసనమే యగునని స్పష్టము చేయఁబడినది.

"అణో రణీయాన్" ఇత్యాదిని- పరమాత్మ - అపరిచ్ఛిన్నుఁడైనను-అణ్వాది పరిమాణకమగు లింగరూపము గలవాడగునని- చెప్పఁబడుటచే- లింగోపాసనము బ్రహ్మోపాసనమే యగునది.

అట్లు కాదందురేని- కాశీవిశ్వేశ్వరాది లింగోపాసనములుఁగూడ

సాక్షాత్ బ్రహ్మోపాసనములు కానందున - నాస్తికత్వము - సమకూరును.

అందువలన- ఆంతరము బాహ్యంబు నగు శివలింగోపాసనము- సాక్షాత్ బ్రహ్మోపాసనమే యగునని భావించుట - సమంజసంబగుచున్న యది.

ప్రశ్న : అయ్యా ! మీ సమర్థనము వలన బాహ్యలింగోపాసనము- ఆవశ్యకమని అంగీకరించితిను- శరీరము అపవిత్రమగుటచే- శరీరమునందు లింగధారణము ప్రశస్తము కాదని తోచెడిని. ఏమందురు ?

ఉత్తరము : శరీరము పరిశుద్ధము కాదు గావుననే - శాంభవదీక్షయందు చేయఁబడు షడధ్వశోధనమువలన పవిత్రత చేకూరును గాన శరీరమునందు లింగధారణము ప్రశస్తమగునని గుర్తింపవలెను.

ప్రశ్న : షడధ్వశోధనాదులచే శరీరము పవిత్రమైనను - మలవిసర్జనాదులచే నపవిత్రమగుట- తప్పనిసరి గాన- శరీరమున లింగధారణము యుక్తము కాదు గదా!

ఉత్తరము : మలవిసర్జనాద్యనంతరము శాస్త్రమునందు చెప్పఁబడిన శౌచవిధి-శరీరముఁదగు అపవిత్రతను పోగొట్టునదగుటఁ జేసి- ఆస్తికులు అట్టి అపావిత్ర్యమును శంకింపరాదు.

ఇంతియే గాక-

"సర్వా వై దేవతా వేదవిది బ్రాహ్మణే వసంతి" ఇత్యాదిశ్రుతిని "దేవతలందరు వేదవేత్తయైన బ్రాహ్మణునందు వసింతురు" అని చెప్పఁబడుటచే బ్రాహ్మణుఁడు నిత్యశుచి యని విశదమగుచున్నం

దున-అట్టి బ్రాహ్మణుడే-బాహ్యలింగధారణమునందు అధికారము కల వాడగునని తేటపడినది. ఇట్లు శౌచవిధికి-శ్రుతిప్రామాణ్యము ఉన్నను శరీరము అపవిత్రమనియే భావించువాడు - బాహ్యలింగధారణమున నధికారము లేనివాడని తెలియవలెను.

ఇట్టి దిగువవిధము పరమార్థము గ్రాహ్యమగుచున్నయది.

పరముక్తి - శివ సాయుజ్యరూపమైనదని - వేదాంతార్థ పరిష్కారమునందు మేము నిర్ణయించినాము గానను, సాయుజ్యమైతేనో "సహబ్రహ్మణా" ఇత్యాది శ్రుతి ననుసరించి - శివునితో కూడియుండుట యగుటవలనను, శరీర పాతసమనంతరమే సంభవించు శివ సాహచర్యమును సూచించునట్టి శివలింగధారణ మనఁదగు పాశుపత వ్రతము- మోక్షాధికారమును సాధించునదిగా "వ్రతమేతచ్ఛాంభవం-తత్సమాచరే న్ముముక్షు రపునర్భవాయ" ఇత్యాది శ్రుతి నవలంబించి- విహితంబగుచున్నయది.

మఱియు

అంత్యకాలమున - జీవాత్మ - సూక్ష్మశరీరముతో సహ -శరీర హృదయగతమునైన ఏకోత్తర శతనాడులలో శిరస్సువరకు గల (మూర్ధన్య) నాడిద్వారా-స్థూలశరీరమునుండి బయలుదేరుట- పరమ పదగతమైన శివసాయుజ్య (అమృతత్వ)ముఁ జెందించునదగుట చేతను; మూర్ధన్యనాడి ద్వారా నిష్క్రమణము హృదయగతుఁడగు పరమాత్మ యనుగ్రహమువలన - సిద్ధించునదగుటచేతను, హార్ద బ్రహ్మము- "లింగే సుషుప్తిః" "ప్రాణేష్వంత ర్మనసో లింగమాహుః" ఇత్యాది ప్రమాణములఁబట్టి - ప్రాణలింగ స్వరూపమని తేటపడుట చేను, ప్రాణలింగము నుపాసించుట- బాహ్య లింగధారణముఁ జేసి

కొని ఇష్టలింగమును శివాగమోక్తరీతి నారాధించుటచే సాధ్యమగుట వలనను, బ్రహ్మవిద్యాంగమగు భస్మరుద్రాక్ష శివలింగ ధారణాత్మకమగు పాశుపతవ్రతము ప్రామాణికమై శిష్టజనాదృతముగా విరాజిల్లుచున్నయది.

ప్రశ్న : ఓయీ ! ఇవ్విధము లింగధారణ ప్రాముఖ్యము గల వ్రతమును బసవేశ్వరుఁడు పరిగ్రహించి వర్ణాశ్రమాచారమును నిరసించుటచే-మీరును అట్టివారేగనుక అవైదికత్వము తారసిల్లుచున్నది గదా !

ఉత్తరము : సావధానముగ వినుము ! బసవేశ్వరునికంటె ముందు- శ్రీ శంకరాచార్యులు _ అద్వైత సిద్ధాంతము నవలంబించి_ శైవ శాక్తేయ వైష్ణవాది మతములవారి విరోధములను పోగొట్టి-సంఘైకమత్యమును సంపాదించిన యంశమును బసవేశ్వరుఁడు గమనించి-తాను గూడ నద్వైత భావనతో కులభేదమును నిరాకరించి - భక్తి ప్రాధాన్యముగ సంఘీభావమును సంపాదించెను. బసవమతమున వర్ణాశ్రమాచారనిరాకరణ మున్నందున నయ్యది- వైదికశైవముగా పరిగణింపఁబడలేదు. వైదికులైన ఆరాధ్యశైవులు అట్లుగాక - వర్ణాశ్రమాచారమును పాటించుచు నిగమాగమాంతోపాదితమగు ఇష్టప్రాణభావ లింగోపాసనముఁ జేయుచు శ్రీ నీలకంఠాచార్యాది ప్రతిపాదిత కర్మసముచ్చిత జ్ఞానావలంబన సిద్ధాంతమును ప్రవర్తింపఁ జేయుచున్నవారు.

వర్ణామ్రాశ్రమాచారమును శివ శాసనముగా భావించి-విడువరాదనియు, అద్దానిని విసర్జించువారు శివాపచారులై శిక్షార్హులగుదురనియు_స్కాందమహాపురాణాంతర్గత-శంకర సంహితాదులయందు ప్రతిపాదింపఁబడుటచే - వర్ణాశ్రమాచార పూర్వకముగ శాంభవదీక్షా

స్వీకారము- పరశివునందు ఏకాగ్ర భక్తిగలిగి శరణంగతులైనవారికే శివానుగ్రహము వలన-లభించుటతో- మోక్షలక్ష్మీ ప్రాప్తి సమకూరు. నని వివేకము.

ఇయ్యది-మహోపాధ్యాయ- ముదిగొండ నాగలింగశాస్త్రి కృతమగు
బ్రహ్మపథమున- శివాద్వైత సిద్ధాంతములోని
శాంభవ దీక్షావిధి ప్రాశస్త్యము
శాంకరీయ శైవనందినీ ఆంధ్రవ్యాఖ్యతో సమాప్తము.

ఓమ్

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

శ్రీ మహా సరస్వత్యై నమః

బ్రహ్మపథమున వేదపథమునందు

# కేవలాద్వైతపథ ప్రతిషేధ సంగ్రహము

కేవలాద్వైత సిద్ధాంతప్రక్రియ-ఎట్లనఁగా ?

ఎట్టి విశేష (భేద)ము లేనట్టి ఒకే వస్తువు- ఉన్నప్పటికీ- వ్యవహారము సిద్ధించుటకై-మాయ అంగీకరింపఁబడి- అట్టి మాయ-శుద్ధసత్త్వ, మలినసత్త్వ అను భేదముతో రెండువిధములై — జీవేశులను ఆభాసింపఁజేయుచున్నది. అందువలన శాస్త్రలోక వ్యవహారమంతయు ఉపపన్నంబగుచున్నయది.

"మాయా చావిద్యా చ స్వయమేవ భవతి"అను శ్రుతి-ఇందుకు ఆధారము.

శ్లో॥ చిదానందమయం బ్రహ్మ-ప్రతిబింబ సమన్వితా।
తమోరజస్సత్త్వగుణా-ప్రకృతి ర్ద్వివిధా చ సా।
సత్త్వశుద్ధ్యశుద్ధిభ్యాం-మాయాఽవిద్యే చ తే మతే।
మాయాబింబో వశీకృత్య-తాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః॥
అవిద్యావశగ స్త్వన్య- స్తద్వైచిత్ర్యా దనేకధా॥

"చిదానందమయమగు బ్రహ్మము యొక్క ప్రతిబింబముతో కూడినది, సత్త్వరజస్తమోగుణములు గలదియు నగు ప్రకృతి-పలు రకములు గలదగును సత్త్వశుద్ధి సత్త్వాశుద్ధి అనువానితో- ప్రకృతి-మాయ యనియు అవిద్యయనియు పేర్కొనఁబడును. మాయకు బింబమగు ఈశ్వరుఁడు-మాయను వశపఱచుకొని- సర్వజ్ఞుఁడగును. జీవుఁడు అవిద్యకు లోబడియుండును. మాయయొక్క నానావిధస్థితులచే-ప్రపంచము-అనేక భంగిమలు కలదిగా కనుపడుచుండును."

ఈ ప్రక్రియ-ఆపాతరమణీయమైనను విమర్శింపగా- అంగీకార్యము కాదు. ఎట్లనఁగా? నిర్విశేషమైన వస్తువున్నదని చెప్పుటకు-ప్రమాణము లేనందున బ్రహ్మము సవిశేషమనియే ప్రమాణము లన్నిటిఁబట్టి-చెప్పవలసివచ్చును.

ఇంతియే గాక-పరులంగీకరించిన మాయ-సదసదనిర్వచనీయ యగుటచే - లోకమునందు వేదమునందును ప్రసిద్ధము కానట్టిది. మరియు సత్తనిగాని అసత్తనిగాని చెప్పరానట్టి-మాయ-ఆస్తిక గ్రంథములందు ఎచ్చోటను చెప్పఁబడవేదు. మాయ రెండు విధములనుటయు సంభవింపదు. ద్వివిధయగుటకు కారణముగూడ కనఁబడుట

లేదు. "యా మా-సా మాయా" "ఏది లేదో అది మాయయనఁబడును" అను వ్యుత్పత్తిచే మాయకు ఒకానొకరూపము సిద్ధించుట లేదు "న విద్యత ఇత్యవిద్యా" అని పరులే మాయయొక్క అస్విత్వమునంగీకరింపరైరి. ఇందువలన నీ ప్రక్రియ - నిర్మూలమగునట్టిదని విదితమైనది.

బ్రహ్మమునకు మాయకు బింబ ప్రతిబింబ భావము మాయా బ్రహ్మములు నిజములగుచో-ఉపపన్నంబగును. బ్రహ్మము సత్యమనియు, మాయ-మిథ్యయనియు చెప్పునెడ-బింబ ప్రతిబింబభావము ఏర్పడదు గదా!

నిర్విశేషవాదమున చూపఁబడిన "ఆభాసా ఏవ" అనుయుక్తులను భగవానుఁడగు వేదవ్యాసుఁడు "ఏతాదృశయుక్తులు- ఆభాస మాత్రములని" నిరాకరించినవాడు. వ్యవహారమునందు జీవేశాది భేదమును నిరూపించుటకు పరులవలంబించిన మాయావిద్యలు-సదసదనిర్వచనీయములగుటచే అస్తివాస్తిత్వముల మధ్య త్రిశంకు స్వర్గముఁబోలిన వై-పరుల కేవలాద్వైత సిద్ధాంతమును సమర్థించునవని చెప్పుటయు ఆశ్చర్య జనకమగును. "మాయాఽఽభాసేన జీవేశౌ కరోతి. మాయా చావిద్యాచ స్వయమేవ భవతి"అను శ్రుతి-అష్టోత్తరశత (108) ఉపనిషత్తులందు వెందునను, అద్వైత మూలాచార్యులు ప్రస్థానత్రయ భాష్యములయందు ఎన్నోటను నుదహరింపనందునను కల్పితమై నిర్మూలమగుచున్నయది.

శ్రీ విద్యారణ్యులు - సమస్త వేదశాస్త్ర వ్యాఖ్యాతలయ్యు- కేవలాద్వైతమును సాధించుటకై-ఈ యుపనిషద్వాక్యమునకు మూలము నుదహరింపకయే-తమ గ్రంథమున నుల్లేఖించుటఁజేసి - "మాయా

ఉఽభాసేన" ఇత్యాది వాక్యము నిర్మూలంబని తెలియుచుండుటచే—పరపక్షము—దుఃస్థితి గలదని—విదితమగును.

మఱియు

ఆస్తికులు—జగత్కారణము, ఉపాస్యుఁడు, ముక్తప్రాప్యుండు నని ఈశ్వరునుద్దేశించి భావించువారు.

శాంకర భాష్యమున జన్మాధికరణమునందు-

"సృష్టి - సగుణబ్రహ్మకృతమని స్పష్టము గదా! అనియు, అద్వైత వేదాంతాచార్యులైన అప్పయ దీక్షితేంద్రులు- తమ-సిద్ధాంత లేశ సంగ్రహమునందు "జీవాత్మలందరికి మోక్షము సంభవించు వరకు సగుణ బ్రహ్మసాయుజ్యమే ఉండు"నని నిరూపించుటయు ఇఁట సమాధేయములగుచున్నవి.

ఎట్లనఁగా?

నిర్గుణబ్రహ్మము సృష్ట్యాదుల నొనర్పనర్హ ముకాదు. సర్వజీవాత్మలకు ముక్తి ఎట్లు అసంభవమో, అట్లే నిర్గుణబ్రహ్మైక్యము కూడ సంభవించునది కాదు.

అందువలన- నిర్గుణబ్రహ్మము నంగీకరించుట- నపుంసకుడైన భర్తఁజెందిన తరుణి యవస్థఁబోలినదని - తెలియవలెను.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా" "జ్ఞాజ్ఞౌ ద్వా వజౌ వీశానీశౌ" "సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః" "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా"

ఇత్యాది శ్రుతులు-"జీవ పరమాత్మలలో- జీవాత్మ-కించిజ్ఞుఁడు

పరతంత్రుఁడు వృక్షముఁబోలిన సంసారము నందు ఆసక్తుఁడై అస్వాతంత్ర్యముచే మోహముఁజెంది దుఃఖించువాడు ననియు, పరమాత్మ-సర్వజ్ఞుఁడు, స్వతంత్రుఁడు, జీవభోగమునకు సాక్షిమాత్రుఁడు ననియు, ఉభయులు జన్మాదులు లేనివారగుటచే నిత్యులనియు, జీవాత్మ - పరమాత్మను తనను ప్రేరేపించువానిగా నుపాసించినచో ముక్తుఁడగుననియు నిరూపించినవి.

ఇట్లు చెప్పుటచే-జీవేశ్వరులకు గల అత్యంతభేదము-స్వాభావికమైనదని-తేటపడినది.

మరియొకటి-

పరమతమున-సృష్టి అనిర్వచనీయమైనదనియు, జగత్తు భ్రాంతిసిద్ధమనియు ప్రతిపాదింపఁబడినందున - దిగువ శ్రుత్యాదులు విరోధించుచున్నవి.

"సోఽకామయత-బహుస్యాం ప్రజాయేయ" "స ఈక్షత లోకాన్ను సృజా".

"పరమాత్మ- అనేకమును పుట్టించి విస్తరించెదను" "లోకములను నిర్మింప మహాదేవుఁడు - ఆలోచించెను'' ఇవి మొదలగు వేదవాక్యములు "జగత్సృష్టి - మహేశుని సంకల్పముచే సంభవించునని విశదీకరించుచుండగా- జగత్తు- జీవాత్మయొక్క భ్రాంతిచే ఏర్పడునను పరుల వాదము - శ్రుతుల ఆశయమునకు విపరీతమైనదనుటకు ఎట్టి సంశయము లేదు.

మరియు

శుద్ధాద్వైతమున-మోక్షము ఈ లోకముననే సంభవించుననియు, జ్ఞానికి-అర్చిరాదిగతి లేదనియు పేర్కొనఁబడినది.

శ్రుతు లైతేనో "తేఽర్చిష మభిసంభవంతి" "ముక్తపురుషులు-మొదట అర్చియనుదాని అధిష్ఠానదేవతఁ జేరుదురు" "య ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య- స్వేన రూపేణాఽభి నిష్పద్యతే" "శమదమాది సంపత్తితో శాంభవదీక్షఁ బరిగ్రహించి ఇష్టప్రాణభావలింగముల నుపాసించి మనః ప్రసాదమును చూఱగొన్నట్టి జీవాత్మ-ఈ ప్రారబ్ధ శరీరమునుండి-మూర్ధన్యనాడీద్వారా- నిష్క్రమించి పరంజ్యోతిః స్వరూపుఁడగు పరశివునిఁ జేరియు- ఇతఃపూర్వము-తన-భ్రమప్రమాదములచే పోగొట్టుకొనిన-నిజ (సచ్చిదానందమయ) రూపము నావిష్కరింపఁ జేసికొనును" ఇత్యాదివాక్యములచే "మోక్షము - అర్చిరాదిగతి లభ్యమగునని నిర్ణయించినవి.

మఱియు "యః సర్వజ్ఞ స్సర్వవిత్" ఇత్యాది శ్రుతులు- "పరమేశ్వరుఁడు - అనంతమాంగళ్యగుణరత్నాకరుఁడు" అని విశదీకరించినవి.

అద్వైతమున-చెప్పఁబడిన బ్రహ్మము గుణములు లేనిది-ఇత్యాద్యంశములు-శ్రుతి విరుద్ధములగుటఁజేసి - కేవలాద్వైతము- బ్రహ్మపథ వ్యతిరిక్తమైనదని విదితమైనది.

ప్రశ్న : "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యములు-"రెండవది లేనట్టి ఒకే బ్రహ్మము కలదు" అని శుద్ధాద్వైతమునే ప్రతిపాదించుచున్నవి గదా!

ఉత్తరము : మీరు చెప్పెడి అర్థము - ఆపాతరమణీయముగా కనుపడినను సర్వశ్రుతి తాత్పర్యసిద్ధము కానిదని-విదితమగు చున్నయది.

అట్లు కానిచో "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" "అన్నము-పార్థివమగుటచే - అన్నముననగా దేహమును బ్రహ్మముగా గుర్తింపవలె" నను దేహాత్మవాదము- శ్రుతి తాత్పర్యసిద్ధంబగుననుట- అనివార్యంబగునుగదా ? మరియు - బ్రహ్మమునకు నిర్విశేషత్వమును సాధించుటకై-పరబ్రహ్మ శబ్దమునకు లక్ష్యము సిద్ధింపదని పరులంగీకరించుటయు విచిత్రముగా నున్నది.

శబ్దమునకు శూన్యంబు లక్ష్యమే గాన నిర్విశేషము లక్ష్యము కావలెనని రాజాజ్ఞ లేదుగదా ! అందువలన పరుల పద్ధతిని శబ్దలక్ష్యమగు శూన్యాద్వైతంబు నేర్పడుటచే-కేవలాద్వైతము శబ్దాది ప్రమాణరహితమని తేటపడుచున్నయది.

ఇట్లు సామాన్యముగ పరమతము శ్రుతివిరుద్ధంబని నిరూపించి-విశేషించి సర్వశ్రుతి విరుద్ధమగుటను ప్రతిపాదించుచున్నాము.

శాస్త్రమునకు జీవబ్రహ్మైక్యమే విషయమగునెడ "పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా" "తనను భోక్తగాను పరమాత్మను ప్రేరకునిగాను భావించినచో జీవాత్మ ముక్తుండగును" ఇత్యాది శ్రుతులకు విరోధము సంభవించును "

"వేదాంతములన్నియు ఆత్మైక్యమును ప్రతిపాదించునవి యగుటచే-జీవబ్రహ్మభేదమును సూచించు వేదవాక్యములు - కల్పితమైన భేదమును చెప్పునవి యని సమర్థింపవలె"ననుట-సరి కాదు.

ఈశావాస్యాద్యుపనిషత్తులన్నియు సవిశేష శివాద్వైతమునే ప్రతిపాదించునని నిరూపించుచున్నాము.

---

శివజ్ఞానలహరి-ధార్మిక సంస్థ: రిజిస్టర్డ్ హైదరాబాద్. అధ్యక్షులు-లోకారాధ్య, శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారి ప్రచురణము. (1996)

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

శ్రీ మహా సరస్వత్యై నమః

## బ్రహ్మపథమున-వ్యాసపథమునందు

# కేవలాద్వైతప్రతిషేధము

పీఠిక-

అనేక శాస్త్రములలో ఉత్తరమీమాంసాశాస్త్రము-పరమ పురుషార్థ నిదానముగుటచే మిన్నయని భావించుచున్నాము-

అందువలన నా శాస్త్రమునందే పరిశ్రమము సఫలంబగునని కేవలాద్వైత భాష్యముల(బఠించి- అయ్యవి- శ్రీహర్ష నాగేశభట్టాదులచే ఆమోదింప(బడుటచే సర్వ్వారియందు గల ప్రగాఢవిశ్వాసమున లఘువాసిష్ఠరామాయణాదుల నాంధ్రీకరించితిమి. ఆపిమ్మట-అద్వైత భాష్యములలో- మూలమునకు వ్యాఖ్యానములకును వ్యత్యాసము-(విమర్శించుకొలది) గమనింప(బడినందున- శ్రీకంఠీయభాష్యములయందు అవగతమైన యథార్థభావమును ప్రకటింప నుత్సాహాతిశయించుటచే- నీ వ్యాసపథమును సముల్లేఖింపవలసివచ్చినది.

వేదాంతములయందు కేవల్యాద్వైతమునకు అసామంజస్యము బహువాక్యములలో కనుపడినందున-బ్రహ్మపథాంతరతముగ వేద [illegible]

పథము వ్రాయఁబడినది. వేదపథ వ్యాసపథముల రెంటి కూడికయే-బ్రహ్మపథ మనంబఱఁగును.

ప్రస్తుతము ఉపలభ్యమానములగు బ్రహ్మసూత్రభాష్యములతో శ్రీకంఠీయము-ప్రాచీనమై సర్వాంగసుందరముగ- విరాజిల్లుచున్న యది. శ్రుతులను ప్రమాణములుగ నాశ్రయించుటచేతను, శ్రుతి సూత్రములకు సరియగు అర్థముండుటవలనను- యథార్థమైనదని నిర్ణయింపఁబడినది.

"ఆర్జవం ప్రతిపద్యస్వ- వినాశాయ హ్యనార్జవమ్" అను వ్యాస సూక్తి ననుసరించి-ఋజురీతిని అర్థము గల దానిని "సత్యమేవ జయతే నానృతమ్" అను వేదవాక్య- నవలంబించి యథార్థమగు దానిని ప్రకటింపవలెనని మా అంతఃకరణమునందు స్ఫురించుటచే దైవవశమున పురఃస్థితంబైన శ్రీకంఠీయభాష్యమును పురస్కరించు కొని యీ వ్యాసపథము- పండితుల మ్రోల సంఘటితంబొనర్ప నైనది.

"సూత్రభాష్యములనేకములు సువిదితములైనను శ్రీకంఠీయ సూత్రభాష్యము మాత్రము ఇంతవరకు వినఁబడనందున- నయ్యది అప్రసిద్ధమని భావింపరాదు.

శ్రీ అప్పయదీక్షితేంద్రులు - శ్రీకంఠీయసూత్రభాష్యమునకు- శివార్కమణి దీపిక-యను సంస్కృతవ్యాఖ్యానమును వ్రాసి-సుప్రసిద్ధమొనర్చినను- తమ శివాద్వైతనిర్ణయమునందు- శ్రీకంఠీయము మందాధికారుల నుద్దేశించి వ్రాయఁబడినదని- నిరూపించుట-శ్రీకంఠీయ వ్యాపకత్వము తెలుపుటచేతను, పరబ్రహ్మము కేవలాద్వైతమున సువిదితము గామిని, శ్రీకంఠీయ భాష్యముఁదగు యథార్థభావమును ప్రకటించుట - అత్యావసరమగుటఁజేసియు, శ్రుతిసూత్రార్థ

నిరూపణము-తదితర భాష్యార్థముల అసామంజస్యమును సూచించుట దగుటవలనను, శ్రీకంఠీయ భాష్యార్థసామంజస్యము నుల్లేఖించుట యందే తాత్పర్యము-కలిగి-ఇతర భాష్యములను దూషించుట-సముద్దిష్టము కాదని, ముద్రాస్ఖలితములను సహించి అవగాహనఁజేసికొనగలరనియు సహృదయుల నాకాంక్షించుచున్నాను.

కేవలాద్వైతమున-ఉత్తర మీమాంసా శాస్త్రముఁదగు ప్రారంభమునకు అవకాశము కనఁబడుటలేదు.

అందు విషయము ఎద్ది? బ్రహ్మమా? భేద మిథ్యాత్వమా? జీవబ్రహ్మైక్యమా? బ్రహ్మము వేద్యము కాదని యద్వైతులు ప్రతిపాదించినందున బ్రహ్మము విషయము కాదు. జగత్తు దృశ్యమై నిత్యమగుటచే-జగద్బ్రహ్మములకు గల భేదము సత్యమగుటను భేదమిథ్యాత్వము విషయము కాదు.

జీవబ్రహ్మములు నిత్యములైనను విభిన్నములని శాస్త్రము చెప్పుటచే జీవబ్రహ్మములకు ఐక్యము సంఘటింపనందున-జీవబ్రహ్మైక్యంబు విషయము కాదు. ఆత్మయొకటే అనునెడ-జీవబ్రహ్మైక్యము సిద్ధింపదు-ఎట్లనగా? ఘటము ఒకటే యనినయెడల-ఘటపటములకు ఏకత్వము సంభవింపదు.

ప్రయోజనముగూడ-ఘటింపదు. ఎట్లనఁగా?

శాస్త్రమునకు గల ప్రయోజనము-ఉపాయభూతము, పరమమునని రెండు విధములుగదా!

ఉపాయభూతమైన మహావాక్య జన్యజ్ఞానము-తొలగునది కాదనియు, వసిష్ఠ పరాశర కృష్ణద్వైపాయనాదులకు గూడ అపరోక్షజ్ఞానము-కలుగలేదనియు పరులంగీకరించుటచే ఉపాయమగు వాక్య

జ్ఞానమువలన బ్రహ్మసాక్షాత్కారము ఘటింపమి-ద్వివిధ ప్రయోజన శూన్యము-అద్వైత వేదాంతంబని తేటపడినది.

శాస్త్రశ్రవణాధికారము - జ్ఞప్తికి కలదనునెడ-జ్ఞప్తి (జ్ఞానము) శాస్త్రమును వినుటకు వలయు యోగ్యత లేనిది కాగా - జ్ఞాతకుండు ననుచో- జ్ఞాతయగు జీవాత్మ- తన వినాశము అపురుషార్థమగుటచే- శ్రవణాదులయందు-ప్రవర్తింప నిష్టపడువాడు కాడు.

ఇవ్విధము - విషయము, ప్రయోజనము, అధికారియు సరిపడ నందున కేవలాద్వైతమున శాస్త్రారంభము ఉపపన్నము కాకుండుట-ఋజువైనది.

మరియు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను మొదటి సూత్రమే తత్పక్షమున సంగతము కాదు. ఎట్లనఁగా ? జీవబ్రహ్మైక్యము-ఉత్తర మీమాంసాశాస్త్రవిషయమని పరు లంగీకరించుటచే - బ్రహ్మజిజ్ఞాసా పదము సమర్థనీయము కాదు. "బ్రహ్మజిజ్ఞాసా" అను శబ్దముచే "బ్రహ్మము జిజ్ఞాస్యంబని" అవగతమగును కాని జీవబ్రహ్మైక్యము జిజ్ఞాస్యంబని-అవగతము కాదు.

"అథాతో ధర్మజిజ్ఞాసా" అను జైమినీయ పూర్వమీమాంసా ప్రథమ సూత్రము - ధర్మము మాత్రము జిజ్ఞాస్యంబనియు, ధర్మాధర్మైక్యము జిజ్ఞాస్యము కాదని తెలిపినట్లు-బ్రహ్మజిజ్ఞాసా పదము నిర్వచింపఁదగినది.

రెండవసూత్రంబు-పరపక్షమున సంఘటించుటలేదు-బ్రహ్మము విశేషము లేనిదనునెడ- సర్వజ్ఞత్వాది గుణములుండవు గాన - సర్వజ్ఞత్వాదులు లేనిది-బ్రహ్మము-జగత్కారణమగుటకు సమర్థము కాదు.

మూడవసూత్రము - బ్రహ్మము నిర్విశేషమే అనుచో - జగ

త్కారణత్వముచే ఆకర్షింపఁబడు సర్వజ్ఞత్వాదులు సంఘటింపనందున-కేవలాద్వైతమున ఉపపన్నము కాదు.

"వేదాంత వాక్యములు-భ్రాంతిని తొలగించు జ్ఞానమును కలుగఁజేయుటచే సప్రయోజనములనుట" సరి కాదు. ఎందుకనఁగా? వాక్యార్థజ్ఞానమాత్రమున సంసారబంధము నివర్తించుట-శాస్త్రమునకు ప్రత్యక్షవిరుద్ధమగుటఁజేసి నాలుగవ సూత్రమున్ను-కేవలాద్వైతమున సంగతము కాకున్నయది.

మరియు

భ్రమ నివృత్తి ఎవరికి? జ్ఞప్తికా? చేతనునకా?

జ్ఞప్తి- అచేతనమగుటచే- భ్రాంతికి ఆశ్రయము కాజాలదు. చేతనునకు భ్రమనివృత్తియగుననునెడ -పరపక్షమున నివర్తింపఁదగినవానిలో చేతనుఁడు చేరినందున- స్వవినాశము పురుషార్థము కానందునను చేతనుఁడు-భ్రమనివృత్తికి తగినవాడు కాదని-విదితమైనది.

ఆత్మ, అనాత్మ (చేతనుఁడు, అచేతనము) చీకటి వెలుతురులవలె-విరుద్ధ ధర్మము కలవగుటచే-ఒకదానిపై మరియొకదాని నారోపించుట (ఇతరేతరాధ్యాసము)యు సంతితమగుట లేదు.

ఇత్యాది వివరణమున- కేవలాద్వైతము - శ్రుతివిరుద్ధమగుటయే గాక సూత్రవిరుద్ధంబు నగునని - తేటపడినది.

శైవాది షణ్మతములు ప్రసిద్ధములై తనరుచుండగా- పరస్పరవివాదకలహముల నవ్వారికి శమింపఁజేయుటకు- బౌద్ధాదిమతముల వారి నాస్తికవాదమును త్రోసివేసి-బౌద్ధమతాభీష్టమగు జగన్మిథ్యాత్వమును పరిగ్రహించి-స్వమతమున ఉపాస్యము శూన్యమగుటచే-బ్రహ్మమునకు సగుణత్వము నంగికరించి- కల్పితజీవుఁడు చేయువట్టి కర్మ

పాసనలు సగుణబ్రహ్మముఁ జేర్చునని అవశతః నిరూపించియు యథాకథంచిత్ - తాత్కాలిక సంధానమును సంపాదించియు శ్రీ ఆద్యశంకరాచార్యులు చరితార్థులైనారని చెప్పవచ్చును.

సమకాలికులలో కౌమార మతస్థులు లేనందున- శివ దేవీ విష్ణు విఘ్నేశ సూర్యులనారాధింపుడని పంచాయతన పూజనమును బోధింపగా-పారమ్య మెవరికని వివాదము చెలరేగినపుడు-ఏ దేవతయందు పరత్వభావన గలదో ఆ దేవతను నలుగురి నడుమ నునిచి పూజింపుడని బోధించి - తప్పుకొనిన శ్రీ శంకరాచార్యుల ప్రజ్ఞాపాటవము అపారమైనదని తోచెడిని.

ఆ ఐదుగురిలోను హరిహర పారమ్యము-"హరిర్వా హరోవా" అను వికల్పముచే ప్రచారములో నున్నతఱి - హరినా ? హరునా ? ఆరాధింపవలెనను ఆశంకకు-"హరిహరాత్మకో దేవః" "హరి హరులు కూడినవాడే దేవుఁడని" సమాధానము నొసఁగిరి.

హరిహరాత్మక దేవుని మూలనివాసమెద్దియో, హరిహరాత్మక దేవు నుపాసించువారికి లభించు స్థానమేదియో చెప్పరైరి.

హరుని లీలారూపములలో "త్రయోదశం హరే రర్ధం" హరి సమన్వితము పదిమూడవదని వాతూలాగమము నిరూపించుటయు, "హరిం హరంత మనుయాంతి దేవాః" అను మహోపనిషద్వాక్యము- నరసింహరూపమున మహోగ్రుఁడై యుండు శ్రీహరిని శరభరూపమున కాళ్ళతో పట్టుకొని పోవుచుండగా - శ్రీహరిని కరుణింపుమని అమరులు ప్రార్థించిరని తెలుపుటయు శ్రీ శంకాచార్యోక్తిని నిరోధించుచున్నవి. ఇందువలన- హరిహరాత్మక రూపము - ఉపాస్యము కాదనియు, శక్తి శివమయమగు శివలింగమే ధార్యమై ఉపాస్యంబుననియు తేటపడినది.

శైవాదిమతములు ప్రాచీనములు కావనునెడ — శంకర విజయ మున-శైవాది షణ్మతప్రత్యేకతను నిరాకరించి శివవిష్ణ్వాదుల సామ్య మును నిరూపించుటచే శంకరాచార్యులకు పూర్వమే శైవాదిమత ములు కలవని- విదితమగుచున్నయది.

కేవలాద్వైతమున గల జగన్మిథ్యాత్వము, జీవుని కల్పిత త్వము, బ్రహ్మము సర్వజ్ఞత్వాది గుణములు లేనిదై శూన్యప్రాయ మగుటయు, కర్మత్యాగము, వాక్యార్థజ్ఞానముచే భ్రమనివృత్తియు, సన్యాసాశ్రములకే మోక్షమనుటయు, అర్చిరాదిగతి — జ్ఞానికి ఉండ దనుటయు, ఈ శరీరమునందే మోక్షమనుటయు, జీవాత్మను ప్రేరే పించు పరమాత్మ- పృథక్ లేదనుటయు, సుకృతదుష్కృతములకు తదనుభవమునకును జీవాత్మ—బాధ్యుఁడు కాదనుటయు, జీవబ్రహ్మై క్యంబు, హరిహరాద్వైతంబును శ్రుతి సూత్రవిరుద్ధారకంబులగునని- ఇంతవరకు వ్రాయఁబడిన సందర్భమువలన-చదువరులు గ్రహింప వలెనని శాంకరీయ—శైవనందినీ వ్యాఖ్య-తేటతెల్లమొనర్చినది.

---

నాచే తెలుగు ననువదింపఁబడిన ఉపనిషత్ భాష్యము- ప్రథమ భాగమున - ఈశావాస్యాదిసప్త (7) ఉపనిషత్తులను, ద్వితీయ భాగ మున - తైత్తిరీయాది - బృహదారణ్యకాంతము పంచదశ (15) ఉపనిషత్తులను 423 పుటలలో చదువనగును. ప్ర॥ భా॥ రూ. 60/- ద్వి॥ భా॥ రూ. 90/-

నిర్మల శంకరశాస్త్రి.

దొరుకు స్థలము—

**శివశ్రీ॥ A.V S R. చంద్రశేఖర్**

కార్యదర్శి- శివజ్ఞానలహరి, (రిజిస్టర్డ్)

5-9-47/5, బషీర్‌బాగ్, హైదరాబాద్, 500029. (ఆం. ప్ర.)

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తియే నమః

# వేదపథమున-వైష్ణవపథ ప్రతిషేధము

## శాంకరీయ శైవనందినీ వ్యాఖ్యాసమేతము

పరమేశ్వరుఁడు - వేదములయందు బ్రహ్మంబని - నిర్దేశింపఁబడుచున్నవాడు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "సత్తావిశిష్టము, సర్వజ్ఞము అపరిచ్ఛిన్నంబు నగునది బ్రహ్మము" ఇత్యాది శ్రుతులందు చెప్పఁబడిన- ఉపపదము లేనట్టి బ్రహ్మశబ్దము శివునకే చెల్లునని- వ్యాపథమున నిరూపింపఁబడును. అట్లే ఈశపదము - ఈశాన మహేశ్వర సర్వేశ్వరాది పదములతో సమానమై ఈశుఁడనఁగా-పరమేశ్వరుఁడను నంశమును బోధించును.

"ఈశ స్సర్వస్య జగతః-ప్రభుః ప్రీణాతి విశ్వభుక్"

"సమస్త జగత్ప్రభువగు ఈశుఁడు - చరాచర విశ్వము నంతర్యామియై జీవాత్మద్వారా విశ్వముననుభవించుచు - తృప్తిఁజెందువాడు"

"ఈశానో భూతభవ్యస్య"

"భూతభవిష్య ద్వర్తమానకాలములయందు జగత్తును శాసించువాడు—ఈశానుఁడనఁబడును".

"మాయాం తు ప్రకృతిం విద్యాత్ - మాయినం తు మహేశ్వరమ్"

"మాయాశక్తిని జగత్తునకు ఉత్పత్తి స్థానముగా, మహేశ్వరుని మాయాశక్తి నధిష్ఠించి ప్రవర్తింపఁజేయువానిగాను గుర్తింపవలెను."

"కారణం తు ధ్యేయః, సర్వైశ్వర్య సంపన్న స్సర్వేశ్వర శ్శంభు రాకాశమధ్యే"

"హృదయాకాశమున జగత్కారణమగు పరమేశ్వరుని- సర్వైశ్వర్య సంపన్నునిగాను సర్వేశ్వరునిగాను ధ్యానింపవలెను."

ఇత్యాది విధివచన శ్రుతులలో కనఁబడు ఈశ, ఈశాన, మహేశ్వర, శంభుపదములు – యోగరూఢములైన పరమేశ్వరాభిధానంబులని–లోకవేదములలో నవగత మగుచున్నయది.

"ఈశాన స్సర్వవిద్యానా-మీశ్వర స్సర్వభూతానాం"
"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం"

ఇత్యాది మంత్రములు— ఈశ్వరుఁడు శివుఁడేనని – నిర్ధారించుచున్నవి.

"శివ ఏకో ధ్యేయః శివంకరః" ఇత్యాది శ్రుతులును శివోపాసనమును విధించుచున్నవి.

స్తుతిరూపమైన అర్థవాదముఁదగు గంధముగూడ లేనట్టి, లోకవేదములందు వ్యవహరింపఁబడునట్టి నిఘంటువచనములచేతను "యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయ శ్శబ్దో యథార్థాక్షరః" ఇత్యాది

అభియుక్తసూక్తులచేతను, ఈశ్వర శబ్దము-పరమశివునియందే రూఢమగునని తెలియుచున్నది.

"జగత్తు ఈశ్వరాధిష్ఠితము" అని అంగీకరింపనిచో నాస్తిక్యము ఏర్పడును. బ్రహ్మనారాయణాది దేవతలు -ఈశ్వర శబ్దవాచ్యులు-కాకుండుటఁజేసి - జగత్తు సేశ్వరము కాజాలదు. శివేతర దేవతలు జగత్కారణమని నిరూపించువారికి-శివేతరదేవతా భ్రాంతి కనఁబడుచున్నదని శ్రీ సుదర్శనాచార్యచరణులు - శ్రుతిసూక్తిమాలయందు నుల్లేఖించిరి.

మేముగూడ సిద్ధాంతసంగ్రహమునందు-

"యేషాం స్యా దీశ్వరో దేవ-స్సేశ్వరాస్తే ప్రకీర్తితాః,
యేషాం తు నేశ్వరో దేవః-కథితాస్తే నిరీశ్వరాః"

"ఈశ్వరుఁడు దేవుఁడని భావించువారు-సేశ్వరులు కాగా-ఈశ్వరుఁడు మాకు ఆరాధ్యదైవము కాదనువారు నిరీశ్వరులనఁబఱఁగుదురు"అని వ్రాయఁబడినది-

ఇట్లే ఉగ్రపదంబు - భీమపదము నాకర్షించునది. ఉగ్రభీమపదములు రెండును పరమేశ్వరునకు అసాధారణ అభిధానములగునని-నిఘంటుకారులు నిర్ణయించిరి.

ప్రశ్న : ఓయీ! ఉగ్రపదము-క్రూరత్వమును చెప్పుటచేతను, భీమపదము భయంకరత్వమునకు వాచకమగుటను - తామసత్వము ఆవహించుచుండుటఁజేసి-ఉగ్రభీమ పదవాచ్యుఁడైన పరమేశ్వరుఁడు తమోగుణపరిపూర్ణుఁడని-తేటపడును గదా!

ఉత్తరము: "ఉగ్రోస్యుగ్రో౽హం సంజాతయిషుర్భూయాసమ్"

"పరమేశ్వరా! నీవు ఉగ్రుఁడవగుటచే నేను ఉగ్రుఁడుగా జన్మింతుమగాక!" అను శ్రుతివాక్యమున – ఉగ్రశబ్దము–మిక్కిలి శ్రేష్ఠుఁడను నర్థము (ఉత్ గ్ర గమనవాన్) కలదికాగా–ముముక్షువుచే ఉగ్రత్వము ఆకాంక్షింపఁబడుటవలన – పరమేశ్వరుఁడు–సర్వోత్తరుఁడని ఉగ్రశబ్దము తెలుపుచున్నందున–క్రూరత్వార్థము లేనిదని విదితమగుచున్నయది.

ఇట్లే భీమపదము భయంకరత్వార్థము కలదైనను పరమేశ్వరునకు అత్యంతశ్రేష్ఠమైన గొప్పదనమును సూచించునది.

ఎట్లనఁగా ?

"యదిదం కించ జగత్సర్వం-ప్రాణ ఏజతి నిస్సృతం-
య ఏతద్విదు రమృతాస్తే భవంతి".

"భయాదింద్రశ్చాగ్నిశ్చ"

"ఈ చరాచరమంతయు ప్రాణశబ్దవాచ్యుఁడైన పరమేశ్వరుని శాసనమువలన ప్రవర్తించునదని భావించి ధ్యానించువారు ముక్తులగుదురు."

"పరమేశ్వరుఁడు శిక్షించునను భయమువలన – ఇంద్రుఁడు అగ్ని మొదలగు లోకపాలురు– తమ కర్తవ్యములను నిర్వహించుచున్నవారు." ఇత్యాది శ్రుతివచస్సులు పరమేశ్వరుఁడు సర్వనియంతగా పరబ్రహ్మంబగునని విశదీకరించినవి.

"ఏష భూతపతి రేష భూతపాలః" ఇత్యాది నిగమవాక్యములను పరిశీలింపగా– "భూతేశః ఖండపరశుః" ఇత్యాది నిఘంటువుల ననుసరించి భూతపతిత్యాది శబ్దములు – పరమేశ్వరునకు అసాధారణ అభిధానములగునని తేటపడుచున్నది.

మరియు గాయత్రీ మంత్రగతమైన భర్గపదము అకారాంతముగ "హరస్స్మరహరోభర్గః" ఇత్యాది నైఘంటక వాక్యములను పురస్కరించుకొని - శివపరంబగుననియు; సకారాంతమై తేజోవాచకము కాదనియు మున్ముందు నిరూపింపగలము.

రుద్రపదముగూడ - పరమేశ్వరుని అసాధారణ అభిధానమై జగత్కారణత్వమును సమర్థించునదని నిగమములయందు ప్రతిపాదింపఁబడినది.

ఎట్లనఁగా ?

"ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే"

"ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" ఇత్యాది వాక్యములు-సమానమైన అర్థము గలవగుటచే- రుద్రశబ్దము పరబ్రహ్మవాచకంబగునని తెలియుచున్నది. ఇట్లే శివశబ్దంబును "శివ ఏవకేవలః" "శివ ఏకో ధ్యేయః" "శివ మద్వైతం చతుర్థం మన్యంతే" ఇత్యాదులు శివుఁడే జగత్కారణమగునని నిర్ధారించుచున్నవి.

వేదములన్నిటియందు చెప్పఁబడుటచేతను, అమరులందరిలో శ్రేష్ఠత్వమును తెలుపుటవలనను- మహాదేవశబ్దంబు- శివునకు అసాధారణమైన అభిదానంబగుచున్నయది.

ఇవ్విధము సమస్త వేదవేదాంత ప్రతిపాద్యుఁడైన మహేశ్వరుని ద్వేషించువారి మార్గము- వేదపథము ననుసరించునది కాదని వేరు చెప్పనేల ?

# గాయత్రీ మంత్రార్థ నిర్ణయము

"ద్వే జన్మనీ ద్విజాతీనాం-మాతుస్స్యాత్ ప్రథమం తయోః,
ద్వితీయం ఛందసాం మాతు-ర్విధివత్ గ్రహణాత్ గురోః"

ద్విజులకు రెండు జన్మలు కలవు. అవ్వానిలో మొదటి జన్మ తల్లినుండి సంభవింపగా రెండవ జననము - వేదమాతయగు గాయత్రిని గురువునుండి యథావిధి గ్రహించుటవలన నేర్పడును. అను స్మృతివచనముతో; గాయత్రీమంత్రము ద్విజులందరిచే జపింపఁ దగినదని నిర్ధారింపఁబడుటవలనను, ఇయ్యది వేదములన్నిటికి తల్లి యగుటఁ జేసియు; గాయత్రీమంత్రమునందు ప్రతిపాదింపఁబడు తత్త్వమే సమస్త నిగమ నిరూప్యమాణమగుటచే వైదికద్విజులు ఆశ్రయింపఁదగినదై ఇతరదేవతల నాశ్రయించువారి మార్గము- వేద పథ విరుద్ధంబగుట- పర్వతమువలె కదల్పరానిది. ఎట్లనఁగా?

గాయత్రీ మంత్ర ప్రతిపాద్య తత్త్వము-శివుఁడేను;

"తత్సవితు ర్వరేణ్యం- భర్గో దేవస్య ధీమహి-
ధియో యో నః ప్రచోదయాత్"

అను గాయత్రీ ఋక్కు - వేదములన్నిటియందు వినంబడు చున్నయది.

ఇందు-శివాభిదానమగు భర్గపదముండుటచే నీ గాయత్రీమంత్రము ద్విజకులనియతమగు శివోపాసనమునే విశదీకరించుచున్నయది.

ప్రశ్న : ఈ మంత్రము-గాయత్రి యను పేరు గలదైనను- గాయత్రియను ఛందస్సుగల దగుటచేతను, సావిత్రియను సంజ్ఞయే వ్యవహార సిద్ధమగుటఁజేసియు, "సవితు దేవస్య భర్గో ధీమహి" అను

అన్వయమున "ధీమహి" ఉపాసించుచున్నాము. అను ఉపాసనక్రియకు సంబంధించి భర్గపదము - తేజోవాచకముగా - సకారాంతమగునని స్ఫురించుచు శివవాచకము గామి నియ్యది శివోపాసనమును ప్రతి పాదించుట లేదు గదా!

ఉత్తరము: భర్గపదము తేజోవాచకమగునెడ - భర్గపదము నపుంసక లింగమగుటచే- "ధియో యో నః ప్రచోదయాత్" అను వాక్యమున గల "యః" అనునది- పులింగమగుటవలన "యః = ఏ పురుషుఁడు" అను సమంజసమైన అర్థమున "పురుషుఁడు" అని స్ఫురించుటచే- ధీప్రేరకుఁడు శివుఁడనియే వ్యక్తమగుచున్నయది.

"తత్సవితుర్వరేణ్యమ్" అను ఉపక్రమవాక్యమున "తత్" అను నది - నపుంసక లింగముగానే నిర్దేశింపఁబడుటచే - ఉపక్రమము బలిష్ఠమగుటఁజేసియు- అనువాద వాక్యగతమగు పుంలింగ యచ్ఛ బ్దము ననుసరించి శివపరమగునని ఆకాంక్షింపరాదు" అని శంకింపఁ గూడదు. "ధియో యో నః" అనునదియే పురోవాదమగుటచే అందు పుంలింగము సిద్ధించుటవలన శివపరత్వము అక్షతంబగుచున్నయది.

"యో భర్గః నః ధియః ప్రచోదయాత్. తత్ ధీమహి"

"ఏ భర్గుఁడు మా బుద్ధులను ప్రేరేపించునో, అట్టి పరమేశ్వరు నుపాసించుచున్నాము." అనుచో అర్థక్రమము ప్రబలమగుటచే- "ధియో యో నః" అనునదియే పురోవాదమగుట_న్యాయ్యంబగును.

"బుద్ధయో వై ధియః స్తా యోఽస్మాకం ప్రచోదయాత్
ఇత్యాహు ర్బ్రహ్మవాదినోఽథ భర్గ ఇతి"

"ధియః అనఁగా-బుద్ధులు, అట్టి మా బుద్ధుల నెవఁడు ప్రేరే

పించునో, వాడు భర్గుఁడనఁబఱఁగునని బ్రహ్మవాదులు వక్కాణించు చున్నవారు."

"సూర్యునిలో నేత్రమునందును నెలకొనియున్నవాడు - భర్గుఁ డగును."

"యో హ వాఽస్మి న్నాదిత్యే నిహిత స్తారకేక్షిణి చైవ భర్గాఖ్యః"

"భాభి ర్గతి రస్య హీతి భర్గః" ఈతని గమనము కాంతులచే నుండుగాన భర్గుఁడనఁబఱఁగును. అని– మైత్రాయణీయాదులు ప్రతి పాదించుచున్నందున–"భర్గో దేవస్య ధీమహీత్యేవం వ్యాఖ్యాస్యామః" మొదలుకొని "భగవాన్ పరమేశ్వరో భర్గో దేవః" వరకును త్రిపుర తాపనము "సూర్యమండలాంతర్వర్తిగా గాయత్రీ మంత్రమున నుపా స్యుఁడు భర్గాఖ్య పరమేశ్వరుఁడేనని నిర్ధారించినది.

శ్రీ నీలకంఠ భగవత్పాదులు, శ్రీ సుదర్శనాచార్యులు, శ్రీమద ప్పయ దీక్షితేంద్రాదులగు అసంఖ్యాక పండిత ప్రకాండులును గాయత్రీ మంత్రగతమైన భర్గశబ్దము– అకారాంతమగునని వ్యాఖ్యా నించుటచే– సకారాంతముగా తేజోవాచకము కాదని తేటపడుచున్న యది.

అకారాంతమగు 'భర్గః' అను పదము శివునినే చెప్పును గాన సవితృమండలాంతర్వర్తిత్వము శివునకే చెల్లునని తెలియవలెను.

సూర్యమండలాంతర్వర్తి, హిరణ్మయుఁడునగు పురుషుఁడు శివుఁడని దిగువమంత్రము విశదీకరించినది.

"నమో హిరణ్యబాహవే, హిరణ్యవర్ణాయ, హిరణ్య

రూపాయ, హిరణ్యపతయే౽౦బికాపతయ ఉమాపతయే పశు పతయే నయో నమః"

"రుద్రుఁడే- సూర్యమండలాంతర్వర్తిగా సూర్యస్వామి యగు" నని- ఆరుణ కేతుకమునందు ప్రతిపాదింపఁబడినది. మఱియు

యజుస్సంహితలో చతుర్థకాండయందు శతరుద్రీయమున - అసౌ యస్తామ్రో" ఇత్యాది మంత్రము - సూర్యమండలమునకు శుభ శోభాప్రదుఁడు- ముగ్ధేందు చూడుఁడని వ్యవహరించినది. "కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" ఇత్యాది ఛాందోక్యవాక్యము-శ్రీహరికి సూర్య మండలాంతర్విత్తము మ నిరాకరించినది.

ఎట్లనఁగా ? కం = ఉదకం, పాతీతి కపిః, కపినా అసితం = వికసితం, పుండరీకం, ఇతివత్ అక్షిణీ = నేత్రద్వయం యస్య స పుండరీకాక్షః" అను వ్యుత్పత్తిచేతను "పుండరీకాక్షుఁడు నారాయణుఁడు" అను ప్రసిద్ధివలనను, ఛాందోగ్యము- సూర్యమండలాంత ర్వర్తి-నారాయణుఁడనఁజెల్లు" నని తెలిపినదని భావింపరాదు.

"కమలలోచనా నారీ, కమలనయనః పురుషః" ఇత్యాది వాక్య ములు లోకవ్యవహార సిద్ధములగుటచే - పుండరీకాక్ష పదము నారా యణునందే రూఢము కాఁజాలదు.

పరమేశ్వరుని లోచనద్వయము - వికసిత పుండరీకద్వయ సదృశంబనియు, తృతీయ ఫాలనేత్రము-ముకుళిత పుండరీక నిభం బనియు శ్రీ నీలకంఠ భగవత్పాదులు - బ్రహ్మసూత్ర భాష్యమున సమర్థించియుండుట గమనార్హము.

"అక్షిణీ" అని ద్వివచన ప్రయోగమాత్రమున- మూడవ కన్ను లేదనుట-పాడిగాదు.

ముగ్గురు కుమారులు గల బ్రాహ్మణుఁగూర్చి "నీ ఇద్దరు కొమరులు- అగ్నికల్పులు" అనునెడ మూడవ కొడుకు లేడను నర్థము స్ఫురింపదు గదా!

"య ఏషోఽంత రాదిత్యే హిరణ్మయః పురుషః" ఇత్యాదిని- తైత్తిరీయము "సూర్యునిలో హిరణ్మయ పురుషుఁడు నివసించు''నని నిర్ధారించినది.

"ఏకార్థాని పురాణాని-వేదాశ్చైకార్థ సంశ్రయాః''

"భిన్నభిన్నవ్యక్తి ప్రతిపాదకములైనను పురాణములన్నియు- ఒకేయర్థము కలవి కాగా-కర్మ భక్తి జ్ఞాన నిరూపకములైనను వేదములన్నియు ఏకార్థమునే నిర్ణయించునవి.''అను న్యాయము ననుసరించి- అంతరాదిత్య, దహర, వైశ్వానర, అక్షి విద్యాదులలో ఆదిత్యాదుల నంతర్యామిగా, రుద్ర భర్గ పదములతో సర్వాంతర్యామిగాను సర్వవిద్యోపాస్యుఁడు శివుడేనని నిర్ధారింపఁబడినది.

ఇట్లే మహోపనిషత్తునందు-

''ఆదిత్యో వా ఏష ఏతన్మండలం తపతి'' ఈ తపించుచున్న మండలము సూర్యుఁడేను'' ''య ఏష ఏతస్మిన్ మండలేఽర్చిషి పురుషః''ఈ ప్రకాశమాన మండలము నధివసించువాడు-పురుషుఁడు'' అనుచో-సూర్యమండలమును, మండలాభిమాని సూర్యుని ప్రస్తావించి ''య ఏషోఽంతరాదిత్యే హిర్మణయః పురుషః''అనుచో-ఆదిత్యునిలో నుండువాడు హిరణ్మయుఁడైన పురుషుడు'' అని పేర్కొనియు - ''ఏష పురుష ఏషి భూతానా మధిపతిః'' అనుచో-హిరణ్మయ పురుషుఁడు భూతపతియని నిర్దేశింపఁబడినది.

భూతపతి—"సర్వోవై రుద్రః" "నమో హిరణ్యబాహవే" ఇత్యాది వాక్యములయందు- పరమేశ్వరుఁడే నని విశదీకరింపఁబడినది.

"ఈశ్వర స్సర్వభూతానాం" ఇత్యాది వాక్యములు - ఇందుకు ప్రోద్బలకములగుచున్నవి. "నమో హిరణ్యబాహవే" ఇత్యాదిని- హిరణ్యశ్మశ్రు ర్హిరణ్యకేశః ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః" "బంగారు వెంట్రుకలు, గోరు మొదలుకొని ఒడలంతయు సువర్ణమయముగ గలవాఁడు" అని చాందోగ్యమునందలి హిరణ్యరూపత్వము ననువదించి- అట్టి వస్తువు పరమేశ్వరుఁడే నని- పశుపత్యాది శబ్దములతో నిర్ణయింపఁబడినది పంచాక్షరధ్యానమునందును శివుఁడు తత్కాలమున కరిగింపఁబడిన బంగారు వన్నె గలవాఁడని నిరూపింపఁబడినది. నారాయణాదులకు సువర్ణరూపత్వము శ్రుతులలో నెందును గానరానందున- సూర్యమండలస్వామిత్వము సంభవింపదు.

రుద్ర భర్గ ఈశాన పశుపతి అంబికాపతి ఉమాపత్యాది శబ్దబాహుళ్యముచే మా వాదము ప్రబలము కాగా- పరుల ప్రతిపాదనము దుర్బలమగుచున్నయది.

బుద్ధులఁ బ్రేరేపించువాఁడు పురుషుఁడే ననియు తేజస్సుకాదనియు గాయత్రీమంత్రగత భర్గశబ్దము పుంలింగ అకారాంతమనియు అట్టి భర్గశబ్దముచే శివుఁడే చెప్పఁబడుననియు దిగువ శ్రుతివాక్యముల ననుసరించి నిర్ణయింపనగును.

"స నో దేవ శ్శుభయా స్మృత్యా సంయునక్తు"
"తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశమ్"

ఇత్యాద్యుపనిషద్వాక్యములను గమనించినచో- ధీప్రేరకుఁడు- సదా శివుఁడే నని బోధపడును.

శివసంకల్పోపనిషత్తు "తన్మే మనః శివసంకల్పమస్తు" "నా మనస్సు పరమేశ్వరునివలన శుభసంకల్పము కలదియగు గాక!"అని పేర్కొనినది. కేనోపనిషత్తునందు హైమవతీ ప్రబోధితులైన ఇంద్రాద్యమరులు - పరమేశ్వరుని వలననే జయాపజయములు, సన్మార్గ బుద్ధిప్రేరణయు సంభవించునని గుర్తించి - పరబ్రహ్మము శివుఁడేనని భావించినట్లు- ప్రతిపాదింపఁబడినది. (నా ఉపనిషద్భాష్యాంధ్రీకరణము - ప్రథమభాగమున చూడనగును.) భర్గశబ్దము సకారాంతముగ తేజోవాచకమని చెప్పనెడ_తేజస్సు అచేతనమగుటచే ధీప్రేరకత్వము ఘటింపదు గాన, తేజస్సు నధిష్ఠించి సూర్యమండలమున సూర్యాంతర్వర్తియగు పరమేశ్వరుఁడే బుద్ధిప్రేరకుఁడగునని నిర్ణయింపబడినది.

"దేవస్య సవితు ర్మద్యే-యో భర్గో నో ధియః స్వయం,
ప్రచోదయా త్తద్వరేణ్యం-శరణ్యం సముపాస్మహే"

"సూర్యునిలో నివసించి మా బుద్ధులను స్వయముగా ప్రేరేపించు భర్గుఁడెవడో, అట్టి శరణ్యుఁడు వరేణ్యుఁడు నగు పరమేశ్వరు నుపాసించుచున్నాము" అని భగవానుఁడైన యోగ యాజ్ఞవల్క్యమహర్షి- గాయత్రీ మంత్రార్థమును విశదీకరించెను."

ఇత్యాది సమర్థనమున_గాయత్రీ మంత్రగత భర్గ శబ్దము-అకారాంతమై శివునినే చెప్పుననియు, బుద్ధులను ప్రేరేపించువాడు- పరమేశ్వరుఁడే ననియు- అవగతమైనది.

## యజ్ఞాధిపతిత్వ నిర్ణయము

"ఆ వో రాజాన మధ్వరస్య రుద్రమ్" అను శ్రుతిని ఘృతాదిహాని సాధ్యములగు ఆహుతులు గల యజ్ఞముల కన్నిటికి రుద్రుఁడే

అధిపతి యని ప్రతిపాదింపఁబడినందున - పరమేశ్వరుఁడే సమస్త యజ్ఞాధిపతి యనియు, హరిబ్రహ్మాదులు కారనియు, తేటపడుటచే వైదిక జనులందరికి నుపాస్యుఁడు శివుఁడే నని విదితమగును.

## నమఃశేషిత్వ నిర్ణయము

"నమసాం శేషిత్వాత్ = నమశ్శేషిత్వం" అను వ్యుత్పత్తి ననుసరించి సర్వదేవతా నమస్కారములకు అవసానముగా మిగిలియుండుటచే—శివుఁడు నమఃశేషి యగునని నిర్ణయింపఁబడినది.

ఎట్లనఁగా ?

పరమేశ్వరుఁడు నమశ్శేషి యగుటచే వైదిక జనులందరికి నుపాస్యుఁడగుచున్నవాడు.

ప్రశ్న : "నమో బ్రహ్మణే, నమోఽస్త్వగ్నయే, నమః పృథివ్యై, నమ ఓషధీభ్యః" ఇత్యాది మంత్రములయందు - శివేతర దేవతలు నమస్కరింపఁబడుటఁజేసి- నమశ్శేషిత్వము రుద్రునకే కలదని నిరూపింపరాదు గదా!

ఉత్తరము : "స్తోమం వో అద్య రుద్రాయ శిక్వసే- క్షయద్వీరాయ నమసా దిదిష్టన - ఏభి శ్శివ స్స్వవా యవయావభి శ్శివ క్షత్రస్వయశా, నికామభిః" అను మంత్రము - శివేతర దేవతలఁగూర్చి చేయఁబడిన నమస్కారములు గూడ ఈశ్వరుఁ డెందునని - తెలుపుటచే - నమఃస్వామిత్వము- పరమేశ్వరుని లక్షణమగునని విశదమగుచున్నయది.

మంత్రార్థము హే మరుతః = ఓ దేవతలారా! స్తోమం = స్తోత్రమును, వః = మీయొక్క శిక్వసే = నిగ్రహానుగ్రహశక్తిగలయట్టి,

క్షయద్వీరాయ, క్షయత్ = అవాంతర ప్రళయమనఁదగు క్షయముఁ గావించు వీరభద్రాదులు పరివారముగ గలవాఁడైనట్టి, రుద్రాయ = రుద్రునికొరకు, నమసా = నమస్కారముతో గూడ, దిదిష్టన = ఈయుఁడు! (సమర్పించుడు) ఏభిః = ఈ స్తుతి నమస్కారములతో, సవా = స్వామి, స్వయశాః = అనన్య సాధారణమగు కీర్తి గలవాడు నగు రుద్రుఁడు, యవాః = ప్రయత్నింపదగిన కామములు, అవ్వాని యందు యావభిః = అకస్మాత్తుగా తారసిల్లెడు, నికామభిః = స్తవ ములతో మిమ్ము, శివక్తి = సంయోజింపఁజేయును.

"దేవతలారా! మిమ్ము నుద్దేశించి మాచే చేయఁబడు నమస్కార సహిత స్తోత్రములను పరమేశ్వరునకు ఒసఁగుడు! ఈ స్తుతినమస్కారములతో ప్రభువగు ఈశ్వరుఁడు- భక్తులచే అపేక్షింపఁబడు కామముల నిచ్చు శక్తిని మీకు కలుగఁజేయు గాక!" అని సారాంశము.

"ఆకాశాత్పతితం తోయం-యథా గచ్ఛతి సాగరం,
సర్వదేవనమస్కారః- కేశవం ప్రతిగచ్ఛతి"

అను స్మృతిప్రమాణము - శ్రుతి విరుద్ధమగుటచే దుర్బలము గాన "శంకరం ప్రతిగచ్ఛతి" అను పాఠమే - శ్రుతి సమ్మతమై ఆదరణీయమగుటఁజేసి- పరమేశ్వరుఁడే నమఃశేషియై నమఃస్వామియగు నని తెలియవలెను.

## ప్రణవార్థ నిర్ణయము

వేదములన్నియు ప్రణవ (ఓంకార)ము మూలముగా గల వగుటచే- ప్రణవవాచ్యుఁడగుటవలన గూడ - శివుఁడు — సర్వవేద ప్రతిపాద్యుఁడని తేటపడును.

ఎట్లనఁగా ?

"యో వేదాదౌ స్వరః ప్రోక్తో-వేదాంతే చ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య-యః పర స్స మహేశ్వరః"

అను శ్రుతియందు - ప్రణవము మహేశ్వరపరంబని నిరూపింపఁబడినది.

శ్రుత్యర్థము- "వేదప్రారంభమున వేదముయొక్క- చివరను ఏ స్వర (ఓంకారాక్షర)ము ప్రయోగింపఁబడినదో - ప్రకృతిని తనలో దాచుకొనునట్టి ప్రణవము నధిష్ఠించి ప్రణవమును మించిన దేవుఁడు-మహేశ్వరుఁడనఁబడఁగును." ఇందువలననే అధర్వశిఖయందు - మహేశ్వర మహాదేవాది నామధేయములతో సహ ఓంకార ప్రణవాదులు గూడ పరమేశ్వరుని అభిధాన (నామధేయ)ములగునని నిర్ధారింపఁబడినది.

"తస్య వాచకః ప్రణవః"

"క్లేశ కర్మ విపాకాశయములు లేనట్టి ఈశ్వరుని చెప్పునది ప్రణవము" అని భగవానుఁడగు పతంజలి-ప్రణవము ఈశ్వరాభిధానమని నిర్ణయించెను.

"ప్రణవ స్తస్య వాచకః" ఇత్యాది పురాణవచస్సులు నిందువలననే సార్థకములగుచున్నవి.

ఇయ్యది-ప్రణవార్థ సంగ్రహము.

ఇఁక పురుషసూక్తార్థము ఎట్టిదో, ఇఁట విచారింపఁబడును.

## పురుషసూక్తార్థ నిర్ణయము

సర్వవేద తాత్పర్యవిషయముగా శివుఁడు ప్రతిపాదింపఁబడుచున్నను పురుషసూక్తము విష్ణుపరమను పరుల అభిమానవాదమును నిరాకరించి శివపరత్వమును నిరూపించుచున్నాము.

ప్రశ్న: "పురసంజ్ఞే శరీరేఽస్మిన్-శయనాత్ పురుషో హరిః,
తథా పురుషశబ్దోఽయం-వాసుదేవేఽపతిష్ఠతి।
తం వినా పుండరీకాక్షం-కోఽన్యః పురుషశబ్దభాక్,
స ఏవ వాసుదేవోఽయం-సాక్షాత్ పురుష ఉచ్యతే।
భగవానితి శబ్దోఽయం-తథా పురుష ఇత్యపి,
నిరుపాధీ చ వర్తేతే-వాసుదేవే సనాతనే॥"

ఇత్యాది పురాణవాక్య సముదాయము-పురుషశబ్దము విష్ణువాచకంబని నిర్ణయించుటచే- అట్టి పురుషుఁడే ఇఁట ప్రతిపాదింపఁబడుచున్నందున పురుషసూక్తము నారాయణపరమని చెప్పవలెనుగదా!

ఉత్తరము: "పురుషో వై రుద్రః" ఇత్యాది శ్రుతివచస్సులచే పురుషశబ్దము భగవానుఁడగు పార్వతీపతియందు రూఢమగుటఁజేసి పురుషసూక్తము శివపరంబనఁజెల్లుచున్నయది.

ఇంక నవధరింపుడు!

"పురుషశబ్దము- పై విధము శివకేశవులకు సాధారణమగుటచే శివపరమగునని నిర్ణయింపరాదు" అని భావింపఁగూడదు. ఎందుకనఁగా? పౌరాణిక వ్యవహారమునకన్న-శ్రౌతవ్యవహారము బలిష్ఠమగుటచే-శ్రౌతవ్యవహారమును పురస్కరించి-పురుషశబ్దము శివపరముగ నిర్ణయింపనగును గాన-పురుషసూక్తము శివప్రతిపాదకమగుననుటలో సందియము లేదు.

"పురుషో వై రుద్రః" అనుచో "వై" అనునది ఏవార్థకమగుటచే "పురుషుఁడు రుద్రుఁడేను" అను నర్థము స్పష్టమగుచున్నయది.

ప్రశ్న: పురుషో వై నారాయణోఽకామయత" "పురుషుఁడగు

నారాయణుఁడు - సృష్టిఁజేయుదునని అపేక్షించెను. ఇత్యాదిశ్రుతిని నారాయణునందును శ్రౌతవ్యవహారము కనఁబడుటచే పురుషశబ్దము శివపరమే నని చెప్పరాదు గదా!

ఉత్తరము: "కర్మలోపము, యజ్ఞాపచారంబు సంభవించునెడ "పూర్ణత్వాత్ పురుషః" అను వ్యుత్పత్తి ననుసరించి- పురుషు (పరమేశ్వరు)ని చింతించుచు పురుషసూక్తమును పఠింపవలె"నని వాధూలసూక్తము చెప్పుటయే గాక "తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్" "పురుషునిచే చరాచరమంతయు నిండియున్నది" ఇత్యాదిశ్రుతులు- పూర్ణత్వ నిమిత్తమున పురుషశబ్దము- శివునకు అసాధారణ అభిధానమగునని విశదపఱచినవి.

"వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక-స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్" అను మంత్రము-

శ్లో॥ ఈశో వృక్ష ఇవ స్తబ్ధో-య ఏకో దివి తిష్ఠతి।
తేనేద మఖిలం పూర్ణం-పురుషేణ మహాత్మనా॥

"ఎవఁడు దివ్యాంతరిక్షమున వృక్షమువలె నిశ్చలుఁడైయుండునో, అట్టి మహాత్ముఁడైన పురుషునిచే ఈ జగత్తంతయు వ్యాపింపఁబడినది" ఇత్యాది పురాణోపబృంహణములు-

శ్లో॥ పురుషో నామ సంపూర్ణ-శ్శివ స్సత్యాదిలక్షణః।
సాంబమూర్తిధరో నాన్యో-రుద్రోఽజో విష్ణురేవ వా॥

"పురుషుఁడనఁగా- సత్యసంకల్పత్వాది లక్షణములు గలవాడు, శమదమాది కల్యాణగుణ పరిపూర్ణుఁడు, సాంబమూర్తియు నగు శివుఁడేను, శివేతరులగు హరిబ్రహ్మ గణేరుద్రులు పురుషశబ్దవాచ్యులు కారు, ఇత్యాది పురాణవచస్సులును-

"పురుషశబ్దమునకు శివుఁడే వాచ్యుండని" నిర్ధారించినవి. "పురుష ఏవేదం సర్వమ్''అను ఋక్కునకు "సర్వోహ్యేష రుద్రః" అను శ్రుతివాక్యము ప్రోద్బలకమగుచున్నయది.

మఱియు

"తత్పురుషాయ విద్మహే-మహాదేవాయ ధీమహి,
తన్నో రుద్రః ప్రచోదయాత్" ఇత్యాదిని శివునకే

పురుష శబ్దము చెల్లునను వైదికవ్యవహారంబు-సుసంగతమగునది. "రుద్రగాయత్రియందువలె పురుషశబ్దము- గణేశగాయత్ర్యాదుల యందు నుండుటచే- శివపరమేనని నిర్ణయింపరాదు" అను శంకకు సమాధానమేమనఁగా?

విష్ణునరసింహాదుల గాయత్రీమంత్రములలో లేనిదగునది, పరశివుని పరివారమగు షణ్ముఖ నంది గరుడాది గాయత్రీ మంత్రములయందు గలయట్టి పురుషశబ్దము-శివసంబంధము గలదని నిర్ణయింప వచ్చును.

మంత్ర రహస్యములలో గరుత్మంతుఁడు శైవుఁడని వ్రాయఁబడుటచేతను, హేలాపుర ప్రాంతమున వైనతేయక్షేత్రమందు గరుత్మంతునిచే ప్రతిష్ఠింపఁబడిన వైనతేయేశ్వర శివలింగము-ప్రత్యక్షసిద్ధమగుటఁజేసియు, గరుత్మంతుఁడు శైవుఁడుగా భావింపఁదగినవాడయ్యెను.

"పురుషస్య విద్మ సహస్రాక్షస్య-మహాదేవస్య ధీమహి"
"మహాన్ ప్రభుర్వై పురుష-స్సత్వస్యైష ప్రవర్తకః"

ఇత్యాది వైదికవ్యవహారము పుష్కలముగ నుండుటచే "విప్రతిషేదే

భూయసాం స్యా త్స్వధర్మత్వమ్" "పరస్పర విరోధము ఏర్పడినచో ప్రమాణబాహుళ్యము చెప్పునది అంగీకార్యమగును" అను న్యాయము ననుసరించి. పురుషపదము శివపరమగునని నిర్ణయింపఁబడుచున్నం దున ప్రకృత పురుషసూక్తము శివపరంబని నిస్సంశయముగా నిర్ధారింపవచ్చును.

మరియు "పురుష స్సహస్రాక్షః" అనుచో పురుషపదమునకు సహస్రాక్షపదము సంబంధించియుండుటను "పురుషస్య విద్మ సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి" "నమో అస్తు నీలగ్రీవాయ మీఢుషే. అవతత్య ధనుస్త్వం సహస్రాక్ష శతేషుధే" "సహస్రాక్ష మతిపశ్యం పురస్తాత్" ఇత్యాది శ్రుతివాక్యముల ద్వారా పెక్కు వైదిక వ్యవహారమునందు సమర్థించుట వలన సహస్రాక్షపదంబు శివపరంబగుననఁ జెల్లును.

"సహస్రాక్షపదము లోకవ్యవహారము ననుసరించి మహేంద్రుఁ జెప్పు" నను శంకకు సమాధానమేమనఁగా? సహస్రాక్షపదము ఏదేనొకచో దేవేంద్రుని చెప్పినను పరబ్రహ్మముఁ గూర్చిన ప్రకరణములలో మహేంద్రుని ప్రసంగము లేనందున ప్రకరణముఁబట్టి పైనుదహరింపఁబడిన శ్రుతులలో పరమేశ్వరపరంబే నగునని తెలియుచున్నది. తథా పురుషశబ్దలబు వైదికరూఢిని శివపరంబని తేలుటచే ఈ పురుషసూక్తము శివపరంబగునని విశదమగుచున్నయది.

ప్రశ్న: "అథాతో మహాదేవస్య మహాపురుషస్యాహరహః పరిచర్యావిధిం వ్యాఖ్యాస్యామః "మహాపురుషుఁడైన మహాదేవుని యొక్క దినదినము ఆచరింపఁదగిన పూజావిధానమును వివరించుచున్నాము" ఇత్యాది బోధాయన మహర్షి విరచితసూత్రములు మొదలగు ప్రమాణముల నవగతమగు నామముఁదగు అర్థము గల మహాపురుష శబ్దమును పురుషసూక్త మధ్యమున "పురుషం మహాంతం"

అనుచో ప్రయోగించుటఁజేసి పురుషసూక్తము నారాయణపరమగు ననుట సముచితమే గదా!

ఉత్తరము: మహాపురుష శబ్దము విష్ణుపరమని లోకరూఢి యున్నను పురుషసూక్తమధ్యగతములగు "పురుషం మహాంతం" అను విడివిడి పదములు గూడ- శివునినే బోధించును. ఎట్లనఁగా: పురుషశబ్దము శివపరము అని వైదికరూఢి యుండుటచే—పురుషశబ్ద సన్నిహితమగు "మహాంతం" అనునదియు శివపరంబని చెప్పవలెను. ఇదిగాక మహచ్ఛబ్దముప్ను పరమేశ్వరునందే రూఢమగునది.

ఎట్లనఁగా?

అధర్వశిరస్సునందు "అథ కస్మా దుచ్యతే మహాదేవః" అని ప్రారంభించి "తస్మా దుచ్యతే మహాదేవః" అని ప్రస్తావింపఁబడినది. మరియు "తస్మా దీశానో మహాదేవో మహాన్‌దేవః" అని మహోపనిషత్తున వక్కాణించుటవలన, బ్రహ్మదేవుఁడు నిర్దేశించినట్టి భవాది అష్ట నామధేయములలో "మహాన్" అను పేరు పరిగణింపఁబడుట వలనను శివారాధనమున బ్రహ్మయజ్ఞాంగతర్పణమునందును మరి యొకచోటను భవాదినామములతో సరిదూగునట్టి "మహన్"నామదేయ మును పూజ్యుఁడైన బోధాయనుఁడు నిర్వచించుటచేతను, ఇట్లే స్మృతులలో శివారాధన ప్రకరణములయందును, పురాణములలో నగణితముగా కనఁబడుటవలన "మహాన్" శబ్దము శివునియందే ప్రసిద్ధమైనదని అవగతమగుచున్నయది.

ప్రశ్న: "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" అనుచో— లక్ష్మీపతిత్వము వినఁబడుటచే- లక్ష్మీపతిత్వము" అను లక్షణము - నారాయణునియందే అసాధారణమగుటఁజేసియు – పురుషసూక్తమంతయు విష్ణుపరమగునని చెప్పవలెను గదా?

ఉత్తరము : మీరు చూపిన వాక్యమున గౌర్యసాధారణమగు హ్రీంకారము మొదటనుండుటచే - లక్ష్మీపదంబు గౌరీపరమని సమర్థింపవలసివచ్చును. అందువలననే "తస్యాంకమండలారూఢా- శక్తి ర్మాహేశ్వరీ పరా- మహాలక్ష్మీరితి ఖ్యాతా-శ్యామా సర్వమనోహరా" "శ్రేష్ఠురాలగు, పరమేశ్వరుని ఒడిలో కూర్చున్నట్టి. యౌవన మధ్యస్థురాలైన (శ్యామా) పరమేశ్వరుని మనస్సు నాకర్షించునట్టి మహేశ్వరశక్తి-మహాలక్ష్మి యను పేరుతో ప్రసిద్ధురాలైనది. "అని వాయుదేవుఁడు చెప్పిన శివమహాపురాణ వచనము - సంగతంబగుచున్నయది.

ప్రశ్న : లక్ష్మీపదము గౌరీవాచకమగునెడల "పత్న్యౌ" "ఇద్దరు భార్యలు'' అను ద్వివచనము నిరుపయుక్తంబగు గదా?

ఉత్తరము : పరాశక్తి - నానావిధ రూపములతో శివునాశ్రయించునదగుటచే- ద్వివచనము మా పక్షమున విరుద్ధము కాజాలదని తెలియుము!

ప్రశ్న : ఈ సూక్తమునకు "నారాయణము'' అను పేరుండుటచే నియ్యది విష్ణుపరమనఁజెల్లు నందుము. మీరేమందురు ?

ఉత్తరము : పురుషసూక్తమునకు నారాయణము అను పేరున్నంతమాత్రమున నియ్యది విష్ణుపరమగుననుట - అవివేకమగును. ఎందుకనఁగా? నారాయణుఁడను పేరు గల ఒకానొక ఋషిచే కని పెట్టఁబడినదని మాధవీయ వచనముండుటచే - నారాయణము అను నామధెయము - పుంసూక్తము విష్ణుపరమని చెప్పుటకు-దోహదము కాజాలదు.

ప్రశ్న : పురుషసూక్తము వైష్ణవీ సంహితలో చేరినదిగా పరి

గణింపఁబడుటవలన పురుషసూక్తముతో విష్ణువును ప్రార్థింపవలెనని విష్ణు పురాణములో వ్రాయఁబడినందున నియ్యది విష్ణుపరమగునని అంగీకరింపవలెను గదా!

ఉత్తరము: పురుషసూక్తముతో శివునిఁ బ్రార్థించుటయు శివ పురాణములలో నున్నందున నియ్యది శివపరంబగుటకు ఎట్టి విరోధము లేదు.

పురుషసూక్తము శివపరమనుటకు— పదునాలుగు (14) ప్రబలములైన కారణములను చూపుచున్నాము.

1. పురుష శబ్దము — వేదరూఢ మగుటయు, 2. సహస్రాక్ష పదముగూడ శివునినే చెప్పుటయు, 3. ఈశానశబ్దము శ్రుతి నిరూపితమగుటయు, "మహాన్"అను పేరు—శ్రౌతమగుటయు, (ఇవి శ్రౌతములగు నాలుగుకారణములు) 5. సహస్రశీర్షత్వ లక్షణము శివునకు కలదనుటయు, 6. "శీర్ష్ణోద్యౌః" అనుచో వ్యోమకేశత్వలక్షణ నిరూపణము, 7. ఆదిత్యవర్ణత్వలక్షణ ప్రతిపాదనము, 8. పురస్తాత్ ధాతచే ఉదాహరింపఁబడుటయు, 9 జ్ఞానులచే ఇంద్రశబ్దవాచ్యుఁడైన పరమేశ్వరుఁడు ఉపాసింపఁబడుటయు, 10. హ్రీల్లక్ష్మీయనఁబడు హ్రీదేవికి భర్తయగుటయు, 11. అహోరాత్రములను పేరుగల శక్తులు పార్శ్వద్వయమున విరాజిల్లుటచే అర్ధనారీశ్వరుఁడగుటఁ జేసి కృష్ణపింగళవర్ణములు గలవాఁడని నిర్ణయింప వలనుపడుటయు, 12. అశ్విని మొదలగు నక్షత్రములు మాలికగా గల చంద్రుని ఉత్పత్తికి కారణమగుటయు, (ఇవి ఎనిమిది లక్షణములు.) 13. "వేదాహ" మనుచో-భగవన్నారాయణ వేద్యత్వము, "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్- ధ్యాత్వా

మునిర్గచ్ఛతి భూతయోనిం-సమస్తసాక్షిం తమసః పరస్తాత్" "నాన్యః పంథా విముక్తయే" "నాన్యః పంథా అయనాయ విద్యతే" "సర్వాననశిరోగ్రీవః-సర్వభూత గుహాశయః-సర్వవ్యాపీ చ భగవాన్-తస్మాత్సర్వగత శ్శివః" అను కైవల్య శ్వేతాశ్వతర మంత్రములలోని అర్థము నీ సూక్తమునందు అనువదించుటయు, 14 ఈశ్వరపూజనమున నీ సూక్తమును వినియోగించుటయు, ఇట్లు చతుర్దశ హేతువు లుండుటచే - పరులు చూపిన ఎనిమిది హేతువులు దుర్బలములని తేటపడినది.

ఇంతకు మించిన వివరణమును పురుషసూక్త భాష్యమునందు చూడనగును.

బ్రహ్మపథాంతర్గత వేదపథమున
శాంకరీయ శైవనందినీవ్యాఖ్యతో వైష్ణవపథ ప్రతిషేధమున-
ప్రథమభాగము సమాప్తము.

## నారాయణోపనిషదర్థనిర్ణయము

ప్రశ్న : నారాయణ మనఁబడు ఉపనిషత్తునందు "నారాయణ పరంబ్రహ్మ" ఇత్యాదిని-నారాయణుఁడే పరబ్రహ్మమని ప్రతిపాదించుటచే నారాయణుఁడే వేదవేద్యుఁడగుటఁజేసి - శివునకు పరత్వము గాని వేదవేద్యత్వము గాని సిద్ధించుట లేదు గదా!

ఉత్తరము : ఉపనిషత్తులన్నిటియందు శివునకు పరత్వము

వినఁబడుటచే ఈ యుపనిషత్తునందలి నారాయణశబ్దమునకు శివపర మైన అర్థమును నిర్వచించుట - అనివార్యంబని తెలియవలెను.

ప్రశ్న : నారాయణపదము శివార్థకమగునేని - యౌగికార్థము నందు ణత్వము రాదు గాన రూఢ్యర్థము నారాయణుఁడనియే చెప్పఁ దగినది గదా!

ఉత్తరము : నారాయణపదము విష్ణువునందువలె శివునందును రూఢమగునని ''నరాణామయనత్వాచ్చ-తేన నారాయణ శ్శివః"అను ప్రమాణము చాటుచున్నది. మరియు "నారాయణీ నమోఽస్తుతే"అను నది- నారాయణుని భార్య-నారాయణీ అనురీతిని - నారాయణీభర్త యగు నారాయణుఁడు శివుఁడే నని స్ఫురింపఁజేయును.

నారాయణ శబ్దార్థములను నా ఉపనిషత్ భాష్యాంధ్రీకరణమున ద్వితీయ భాగమునందు 177 వ పుటలో గాననగును.

మరియు "ఋతగ్ంం సత్యం పరంబ్రహ్మ''అను నీ యుపనిషత్తు నందలి మంత్రమున- కృష్ణపింగళవర్ణములు గల పరబ్రహ్మస్వరూ పము - ఆదిశక్త్యంశమగు నారాయణుని కృష్ణవర్ణము గలదనుట- సంగతంబగును'' విష్ణువునకు మూలమగు ఆదిశక్తి - కృష్ణవర్ణము గలదగుటచేతను ఆదిశక్తితో లవినాభావము గల శివుఁడు కృష్ణ వర్ణము గలవాడను కారణమునను నారాయణ శబ్దవాచ్యుఁడు శివుఁ డని నిర్ధారింపవచ్చును. సంజ్ఞావాచకమగునెడ ణత్వము వచ్చునను వ్యాకరణ నిర్బంధము - శివునకు నారాయణశబ్దము సంజ్ఞావాచక మనుచో-సార్థకమగును.

ఒకవేళ కాదందురేని ఈ యువనిషత్తు-పరస్పర విరుద్ధార్థము గలదై నిరర్థకంబగును.

ఇంకను నారాయణోపనిషత్తు శివపరత్వము నెట్లు సమర్థించు చున్నదో విచారింతము.

వస్తుతః- ఈ యుపనిషత్తునందు నారాయణశబ్దము విష్ణుపర మైనను బాధలేదు. ఇఁట నారాయణుఁడు ఉపాసకుఁడుగా నిరూపింపఁ బడుటచే విష్ణువు పరబ్రహ్మంబని సాధింప శక్యము గాదు.

ఎట్లనఁగా ?

"దహ్రం విపాపం పరవేశ్మభూతం—యత్ పుండరీకం పురమధ్యసంస్థం-
తత్రాపి దహ్రం గగనం విశోక - స్తస్మిన్ యదంత స్త దుపాసితవ్యమ్"

"పరమేశ్వరుని నివాసగృహమగు, "శరీరము" అను పట్టణము నడుమనుండున్నది. సూక్ష్మము, పాపరహితంబునగు హృదయపుండ రీకమునందు- ఎట్టి ఇరుముల జాడ లేనిది, అతిసూక్ష్మంబునగు చిదా కాశము ఎద్ది కలదో, అద్దానిలోనుండు వస్తువు ఉపాసింపఁదగినది.'' "నామరూపములను నిర్దేశింపరానట్టి యత్కించి ద్వస్తువు ధ్యానింపఁదగినది'' అను శ్రుతివాక్యమున నిరూపించి- అటుపిమ్మట- "ఉపాస్యమునకు నామరూపములెట్టివి'' అను ఆకాంక్షకు సమా ధానము—

"యో వేదాదౌ స్వరః ప్రోక్తో-వేదాంతే చ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య-యః పర స్స మహేశ్వరః"

"వేదప్రారంభమున ఏ అక్షరము ఉచ్చరింపఁబడినదో, వేద సమాప్తి నెద్ది స్థిరపరుపఁబడినదో, పాంచభౌతికాదిమయమగు ప్రకృతిని తనలో దాచియుంచినట్టి ఓంకారాక్షరమును మించినవాడు,

ఓంకార వాచ్యుఁడు నగు వాడెవడో - వాడు మహేశ్వరుఁడనఁబడుఁ గును.'' అను ఉపసంహార (చివరి)వాక్యముచేతను "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణ పింగళం-ఊర్ధ్వరేతం విరూపాక్షం- విశ్వరూపాయ వై నమో నమః" అను ఉపక్రమ (ప్రారంభ)వాక్యము చేతను మహేశ్వరుఁడు-ఉపాస్యుఁడని ప్రతిపాదింపఁబడుటఁజేసి మధ్యమానువాకము శివపరమే నగునని తేటపడుచున్నయది.

"దహ్రం విపాపం" ఇత్యాదివాక్యము-దహరోపాసనమును విధించునది కాగా- "న కర్మణా న ప్రజయా ధనేన-త్యాగేనైకే అమృతత్వ మానశుః"

"కర్మచేతగాని, సంతానముచేతగాని, ధనముచేతగాని మోక్షము లభింపదు. కర్మఫలత్యాగ పూర్వక శివోపాసనమువలననే మోక్షమును పొందుదురు."

"వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థా- స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధ సత్వాః- తే బ్రహ్మలోకే తు పరాంతకాలే- పరామృతాత్ పరిముచ్యంతి సర్వే"

"వేదవేదాంతాధ్యయన శ్రవణములతో ఏకార్థ నిశ్చయము గలవారు కర్మఫలత్యాగరూపమైన సన్న్యాసయోగమువలన శుద్ధమైన అంతఃకరణము (చిత్తశుద్ధి)గలవారు, శమదమాదియత్నశీలురు నగు శివోపాసకులందరు ప్రారబ్ధముయొక్క చివరికాలమున-పరమేశ్వరుని వలన బంధవిముక్తులై శివలోకమున శివానందరసాస్వాదలోలురగుదురు" అను వాక్యమున శివోపాసన ఫలంబు ప్రోక్తమైనది.

నారాయణుఁడు ఉపాస్యుఁడనుట-విధివాక్యము ఫలవాక్యంబునిట చెప్పఁబడనందున- ఉపపన్నంబగుట లేదు.

ప్రశ్న: నారాయణుఁడు ఉపాస్యుఁడు కాడునునెడ- మధ్యమాన వాకమున నారాయణుని కీర్తించుట వ్యర్థమగును గాన-నారాయణుఁ ముముక్షూపాస్యుఁడని అంగీకరింపవలెను గదా!

ఉత్తరము: ఉపాసనావిధియందు-ఉపాసనము, ఉపాస్యము, ఉపాసకుఁడు నను మూడు అంశములు నిరూపింపఁదగినవి.

"పద్మకోశప్రతీకాశం—హృదయం చాప్యధోముఖమ్"

తామరమొగ్గతో సరిదూగునది క్రిందిముఖము గలదియు నగు హృదయము గలదు.

"తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం-తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్"

"అట్టి హృదయముయొక్క మధ్యన-సూక్ష్మమైన రంధ్రము గలదు అందు సమస్తము నెలకొనియున్నది"

"తస్య మధ్యే మహానగ్ని-ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః"

"ఆ రంధ్రము నడుమ- అంతట మంటలు గలిగి శరీరము నంతయు వ్యాపించు ముఖములు గలిగిన గొప్ప జఠరాగ్ని కలదు".

"తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితా"

ఆ జఠరాగ్ని (జ్యోతిస్సు) నడుమ—పై భాగమున వరిముల్లంత చిన్నదైన వహ్నిశిఖఁబోలిన జీవాత్మ యుండును."

"తస్యాః శిఖాయా మధ్యే-పరమాత్మా వ్యవస్థితః"

"వహ్నిజ్వాలాగ్రతుల్యుఁడగు జీవాత్మలో పరమాత్మ నివసించును. ఇట్లు పరమాత్మయగు శివుఁడు- లోలోన నుండునని తెలుప

సందర్భమువలనను ఇందు కీర్తింపఁబడిన నారాయణుఁడు-శివోపాస కుఁడనియే నిర్ణయింపనగును.

ప్రశ్న: "ఆత్మా నారాయణః పరః" అను వాక్యమున పరాత్మ శబ్దము నారాయణుని బోధించుటచే- శిఖావాక్యమున గల పరమాత్మ శబ్దముగూడ విష్ణుపరమగుటఁజేసి-నారాయణుఁడు ఉపాసకుఁడు కాద నియు, ఉపాస్యుండనియు అంగీకరింపవలెను గదా!

ఉత్తరము: ఈ యుపనిషత్తునందు నారాయణుని హృదయము వర్ణింపఁబడినందున-నారాయణునిహృదయమునందు నారాయణుఁడు ఉండుననుట- ఆత్మాశ్రయదోషదుష్టంబగును. అదిగాక-ఒకఁడే ఉపాసకుఁడు ఉపాస్యుఁడు నగుట సుసంగతము కాదు. మరియు వహ్నిశిఖాంతరాళమున ఆత్మగానుండి తనను తానే ఉపాసించుననుట తన శరీరముఁదగు భుజముపై నెక్కి నాట్యమాడుచున్నాఁడనునట్లు పరిహాసాస్పదంబగును.

ప్రశ్న: ఇందు వర్ణింపఁబడిన హృదయము ఉపాసకులది కాగా అట్టి హృదయమున ముముక్షువులు నారాయణు నుపాసింపవలెనని సమర్థింపనగును గదా!

ఉత్తరము: ఇది నారాయణుని ప్రకరణమగుటచే-ఇందు ప్రతిపాదింపఁబడిన హృదయము నారాయణునిదై యుండవలెను.

ప్రశ్న: నారాయణుఁడు ఉపాసకుఁడగువెడ "నారాయణపరం బ్రహ్మ" ఇత్యాదివాక్యమున నారాయణుఁడు పరబ్రహ్మముగా ఉపా స్యుండని అవగతమగుట సరిపడదు గదా?

ఉత్తరము: "నారాయణపరం బ్రహ్మ" అనువాక్యము "దీపో జ్యోతిః పరంబ్రహ్మ" అనువాక్యము వలె-స్తుతిరూపమైన అర్థవాద

మగును. ఇంతియేగాక— నారాయణుఁడు "ధ్యానించువాడు (ధ్యాత) ధ్యానింపదగినది (ధ్యేయము) అను విభాగవివేకము లేనట్టి సమాధిదశ యందు పరబ్రహ్మంబగు శివునితో ఏకీభావముఁజెందినవాడై-పర బ్రహ్మత్వాది ధర్మములు గలవాడుగా ఇందు ప్రశంసింపఁబడిన వాడని భావింపవచ్చును. గరుత్మంతుని మంత్రమును జపించి సిద్ధిఁ బొందినవాడు-తనను గరుత్మంతునిగా భావించుటవలె-పైయంశము సుసంగతంబగును- నారాయణ(ః) పరో ధ్యాతా" అను వాక్యము-శివు నుపాసించువారిలో నారాయణుఁడు శ్రేష్ఠుఁడని స్పష్టపఱచినది.

ప్రశ్న: "స బ్రహ్మ స శివ స్సహరి స్సేంద్రః" ఇత్యాది వాక్యమున ఉపాస్యుఁడు-శివునికంటె వేరైన దేవుఁడని బోధపడు చున్నయది. ఒకవేళ—ఇఁట చెప్పఁబడినవాడు శివుఁడే నగుచో "స శివః" అని నిర్దేశించుట పొసగదు గదా!

ఉత్తరము: ఈ వాక్యమున— హరిబ్రహ్మదుల నుదహరించు క్రమములో గల శివశబ్దమునకు- గుణిరుద్రుఁడను అర్థముతో పర మాత్మ-శివుఁడే నని నిర్ధారింపనగును. మరియు నీ యుపనిషత్తున— ఉపక్రమమునందు దహరవిద్యను, అద్దాని ననుసరించి అంతరాదిత్య విద్యను, ఆ పిమ్మట గాయత్రీవిద్యను ప్రతిపాదించుటచేతను ఈవిద్యా త్రయము శివునినే నిరూపించుచున్నందువలనను ప్రణవవాచ్యుఁడు బ్రహ్మవిష్ణ్వాది జనకుఁడు నారాయణోపాస్యుఁడును శివుఁడే నని- పూర్వాపర మంత్రములవలన- సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రముల నుదాహరించుట చేతను ఈశాన మహేశ్వర తత్పురుషాది శబ్దముల రూఢ్యర్థమువలనను— విశదమగుచున్నయది.

మరియు "విశ్వం నారాయణం" ఇత్యాదిని విష్ణువు చేతనాచేతన సమ్మిశ్రమగు విశ్వమనియు "పతిం విశ్వస్య" ఇత్యాదిని విశ్వరూపు

దగు విష్ణువునకు ప్రభువై విష్ణువుచే ఉపాసింపఁబడువాడు శివుఁడ నియు ఈ యుపనిషత్తు-స్పష్టపరచుటయు గమనింపఁదగినది.

ఇతి-బ్రహ్మపథాంతర్గత వేదపథే-వైష్ణవపథప్రతిషేధే శివయోగి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి విరచితస్య-నారాయణోపనిషదర్థ నిర్ణయస్య శైవనందినీ సమాఖ్యః శాంకరీయాంధ్రానువాదః.

ఇయ్యది

బ్రహ్మపథమందలి వేదపథమున గల వైష్ణవపథప్రతిషేధమునందు శివయోగి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి విరచితంబగు నారాయణోపనిషదర్థనిర్ణయముయొక్క-శైవనందినీ సమాఖ్య గలయట్టి శాంకరీయ ఆంధ్రానువాదము

## రుద్ర జన్మాభావ నిర్ణయము

(రుద్రుఁడు అను పరమేశ్వరునకు జన్మ లేదని నిర్ణయించుట)

ప్రశ్న: "తస్య లలాటాత్ త్ర్యక్ష శ్శూలపాణి రుదతిష్ఠతి" "బ్రహ్మదేవుని ఫాలప్రదేశమునుండి-మూడు కన్నులు గలిగి త్రిశూలమును చేతఁబట్టుకొనిన రుద్రుఁడు ఆవిర్భవించెను" ఇత్యాది శ్రుతి ననుసరించి రుద్రుఁడు-బ్రహ్మదేవునుండి విష్ణుమూర్తినుండియు జన్మించినాడని విదితమగుటఁజేసి రుద్రసమాఖ్యగల పరమేశ్వరుఁడు పరబ్రహ్మముకాదని తేటపడుచున్నది గదా!

ఉత్తరము: శ్రీహరి గూడ బ్రహ్మరుద్రులనుండి జన్మించుట శ్రుతులయందు వినఁబడుటచే-బ్రహ్మవలన విష్ణువు జన్మించుట మీ (వైష్ణవ) మతమునందును సమానమైనది. మరియు బ్రహ్మవిష్ణురుద్రు లనఁబడు త్రిమూర్తులు-నారాయణునివలన జన్మించుట శ్రుతులయం

దెచ్చోటను గానరామిఁజేసి- అధర్వశిఖాద్యుపనిషత్తులయందు శివుని వలన త్రిమూర్తులు జన్మించిరని చెప్పఁబడుట వలనను రుద్రుని జననము "దశరథవసుదేవులవలన రామకృష్ణులు జన్మించుట వలె గానిదై- విలక్షణంబగునని తేటపడుచున్నయది.

ఇంతియే గాక- అవిముక్తోపాసనా స్థలముగ అతిపరిశుభ్రమైన బ్రహ్మలలాటమునుండి రుద్రుఁడు ఆవిర్భవింపగా- నారాయణుఁడు బ్రహ్మదేవుని నాసిక(ముక్కు-) నుండి జన్మించుటయు, బ్రహ్మదేవుని పౌత్రుడగు కశ్యపునివలన జన్మించుటయు నికృష్టములగుచున్నవి. మరియు మనుష్యమాత్రునివలన జన్మించుట-రుద్రునకు సంగతము కానులేదు. శివునకు-నారాయణునకువలె పురుషవీర్య ప్రవేశము స్త్రీగర్భవాసము యోనిసంభవము ఘటింపలేదు.

శివుఁడు- బ్రహ్మవిష్ణువుల లలాటముల నుండి- జన్మించుట స్వేచ్ఛాధీనమైనదని-మహాభారతమునందు కూర్మమహాపురాణాదులందును ప్రతిపాదింపఁబడినది.

ఎట్లనఁగా?

శ్లో॥ అనాదినిధనో దేవ-శ్చైతన్యాది సమన్వితః।
జ్ఞానాని చ వశే యస్య-తారకాదీన్యశేషతః॥
అణిమాదిగుణోపేత-మైశ్వర్యం న చ కృత్రిమం।
సహి పూర్వాధికో రాజం-స్తోషిత స్తపసా విదేః॥
లలాటా దనియోజ్యోఽపి-పుత్రత్వేన ప్రకల్పితః॥

రాజా! ఆద్యంతములు లేనివాడు, "చేతన శ్చేతనానాం"అన్నట్లు సంపూర్ణ చైతన్యము మొదలగు విశేషములు గలవాడు, సంసార సముద్రమునుండి తరింపఁజేయు ప్రణవపంచాక్షరీ మహామంత్రార్థానుసంధానము మొదలగు శక్తులచే కలుగవలసిన జ్ఞానములను స్వాధీన

పరచుకొనువాడు అణిమ మహిమ గరిమ లఘిమ ప్రాప్తి ప్రాకామ్యము ఈశిత్వము, వశిత్వము అను అష్ట(8) ఐశ్వర్యములు సహజములు (ఇతరుల వలన లభించిన కృత్రిమములు కానివి)గా గలవాడునగు పరమేశ్వరుఁడు-బ్రహ్మదేవుని తపస్సుచే సంతుష్టుఁడై- ఇతరులచే శాసింపఁబడువాడు కాకున్నను- బ్రహ్మదేవుని లలాటమునుండి_తన ఇష్టముతో ఆవిర్భవించి- కుమారుఁడుగా రూపొందెను.

శ్లో॥ అహం చ భవతో వక్త్రాత్-కల్పాంతే ఘోరరూపధృత్।
శూలపాణి ర్భవిష్యామి-క్రోధజ స్తవ పుత్రకః॥

"బ్రహ్మదేవా! నేను ప్రళయకాలమున భయంకరరూపముఁ దాల్చినవాడనై త్రిశూలహస్తుఁడనై నీ తాత్కాలిక కోపమువలన నీ ముఖమునుండి ఆవిర్భవించి నీకు కుమారుఁడను కాగలను" అని బ్రహ్మదేవుని మహేశ్వరుఁడు అనుగ్రహించెను.

మరియు

శ్లో॥ నిర్దిష్టః పరమేశేన-మహేశో నీలలోహితః।
పుత్రోభూత్వాఽనుగృహ్ణాతి-బ్రహ్మాణంబ్రహ్మణోఽనుజః॥
తస్య హృత్కమలస్థస్య-నియోగా దంగజో విభుః।
లలాటం తస్య నిర్భిద్య-ప్రాదురాసీ న్మహేశ్వరః॥

"నీలలోహితుఁడనఁబడు మహేశ్వరుఁడు_పరశివునిచే ఆజ్ఞాపింపబడినవాడై బ్రహ్మతరువాత జన్మించు పుత్రుఁడై బ్రహ్మదేవు నను గ్రహించెను. బ్రహ్మదేవుని హృదయకమలమునందు నివసించు పరమేశ్వరుని శాసనమువలన సర్వవ్యాపకుఁడగు మహేశ్వరుఁడు-బ్రహ్మ యొక్క లలాటమును భేదించి ప్రాదుర్భవించెను" ఇత్యాది లింగ మహాపురాణవచనంబు పై యంశమును సమర్థించినది. శివునకు

గర్భవాసాదికము ఎప్పుడును లేదని—స్కాందమహాపురాణాంతర్గత మగు సనత్కుమారసంహితయందు నిరూపింపఁబడినది.

శ్లో॥ సృష్ట్యర్థం బ్రహ్మణః పుత్రో-లలాటా దుత్థితః ప్రభుః।
భూతానా మధిపో రుద్రో-మృద స్తంతిచరో వృషా ॥

స్వేచ్ఛయాఽపి న యస్యాహు-ర్భూతసంసారసంగ్రహః
పురాఽత్రే రపి యత్పత్న్యాః-కరాదేవాభవ త్సుతః ॥
స్వల్పాంశేనాపి గర్భస్య-దుర్వాసత్వ ముదాహరన్ ॥

"ప్రాణులకు అధిపతి, సర్వరక్షకుఁడు ప్రాణుల శరీరగతము లైన నరములయందు—లేక—తీగలయందు—లేక వాయుగమనములపై సంచరించువాడు, ఊర్ధ్వరేతస్కుఁడు చరాచరజగన్నాథుఁడు నగు రుద్రుఁడు— జగన్నిర్మాణమును పెంపొందించుటకై- బ్రహ్మదేవుని నొసటినుండి బయలుపడెను. అట్టి పరమేశ్వరుఁడు తన ఇష్టముతో నైనను జీవాత్మ బెందిన సంసారబంధమును స్వీకరించువాడు కాడు. పూర్వకాలమున అత్రిమహర్షిగారి భార్యయగు అనసూయాదేవియొక్క— దక్షిణహస్తమునుండియే కుమారుఁడై జన్మించి—అత్యల్పము గూడ గర్భవాసము లేనివాడయ్యెను. అందువలననే అత్రికుమారులలో మహేశ్వరాంశసంభూతుఁడు దుర్వాసుఁడను సమాఖ్యగలవాడని విజ్ఞులు వ్యవహరించుచున్నవారు" అని శివమహాపురాణములు—ఉద్ఘోషించినవి.

రామకృష్ణావతారములై తేనో ఇంద్రజిత్సాల్వాదియుద్ధముల యందు అవ్వారి బాణములతో గాయములఁబెందుటయు, కట్టుబడుటయు, మూర్ఛ (తెలివిఁదప్పుటయు) ఇత్యాదులు—రామాయణభారతాదులయందు ప్రసిద్ధములైనవి. మఱియు అవసానకాలమున

గోప్రతారక్షేత్రమున ఆ క్షేత్రముఁదగు మహిమవలన శ్రీరాముఁడు సరయూనదిలో శరీరమును విడిచి స్వర్గముఁ జేరినాడని- మహాభారతమున నిరూపింపఁబడినది.

ఈ విధము శరీరత్యాగము శివునకు ఎచ్చోటను చెప్పఁబడలేదు. కిరాతరూపధారియై శివుఁడు అర్జునునితో పోరాడినపుడు-కౌంతేయుని బాణముల తాకిడితో ఏమాత్రం బాధ కాలేదనియు, అర్జునబాణ ప్రయోగముచే క్షతముగాని శరీరముతో శివుఁడు-కొండవలె-కదలకనుండెననియు, అర్జునుఁడు అట్టి శివస్థితిఁ బరికించి-విస్మితుడై-ప్రశంసించెననియు మహాభారతమున ప్రతిపాదింపబడుటను దిగువ శ్లోకములలో గాననగును.



శ్లో॥ తతోఽర్జున శ్శరై ర్వర్షం-కిరాతే సమవాకిరత్ ।
తత్ప్రసన్నేన మనసా-ప్రతిజగ్రాహ శంకరః ॥

ముహూర్తం శరవర్షంతు-ప్రతిగృహ్య పినాకధృత్ ।
అక్షతేన శరీరేణ-తస్థౌ గిరిరివావరః ॥

స దృష్ట్వా బాణవర్షం తు-మోఘీభూతం ధనంజయః ।
పరమం విస్మయం చక్రే-సాధు సాధ్వితి చాబ్రవీత్॥

ఇందుకు ప్రోద్బలకముగా శ్రీమదప్పయ దీక్షితేంద్రులు-బ్రహ్మతర్కస్తవమున ఇట్లు వక్కాణించిరి.

శ్లో॥ దేవ త్వమేవ నిటలాద్యది ధాత్రవిష్ణో
రావిర్బభూవిథ తత స్తవ కో నికర్షః?
నాసాపుటా న్నహి విధే ర్నచ తస్యపౌత్రా
జ్జాతోఽసి విష్ణురివ నాపి మనుష్యమాత్రాత్॥

నాస్త్యేవ తే పురుషవీర్యకణానుషక్తి
ర్న స్త్రైణగర్భజననం న చ యోనిజత్వమ్॥

"మహాదేవా! నీవే బ్రహ్మవిష్ణువుల లలాటమునుండి ఆవిర్భవించితివి. ఇవ్విషయమున నీకు చిన్నతనమెక్కడిది? విష్ణువవలె నీవు బ్రహ్మదేవుని నాసికారంధ్రమునుండి గాని బ్రహ్మపౌత్రుడగు కశ్యపునివలన అదితియందు గాని మనుష్యమాత్రులగు దశరధ వసుదేవులనుండి గాని జన్మింవలేదు.

"అందువలన_నీకు పురుషవీర్య ప్రవేశము, స్త్రీగర్భవాసము, యోనియంత్ర పీడిత జననంబు సంఘటింపలేదు. ఇంతియేగాక-"నమో విష్ణవే బృహతే కరోమి" "గొప్పవాడైన విష్ణువునకు నమస్కారమును చేయుచున్నాను" ఇత్యాదిని_బృహచ్ఛబ్దముతో చెప్పఁబడు విష్ణువునకు- "జాతో బృహన్నభిపాతిత్రృతీయమ్" "బృహచ్ఛబ్ది వాచ్యుఁడైన విష్ణువు-జన్మించినవాడై-స్థూలప్రపంచమును రక్షించుచున్నవాడు." ఇత్యాదిని-విష్ణు జననము నిరూపింపఁబడినది.

శివునకైతేనో "అజాత ఇత్యేవం కశ్చిద్భీరుః ప్రపద్యతే-రుద్ర యత్తే దక్షిణం ముఖం-తేన మాం పాహి నిత్యమ్" "రుద్రా! నీవు జననమరణాదులు లేని మృత్యుంజయుఁడవని_ఒకానొక సంసార క్లేశానుభవభయము గల పుణ్యాత్ముఁడు_గుర్తించి- నిన్నాశ్రయించును. అందువలన నీ పంచముఖములలో దక్షిణదిశకు గల అఘోర ముఖముతో నన్ను జీవితమున జీనితాంతమందును రక్షింపుము!"ఇట్లు భగవతియగు శ్రుతి_పరమేశ్వరునకు జన్మను నిషేధించుటవలన

శివుఁడొకఁడే జననమరణములు లేనివాడనుట—సమంజసమని తెలియ వలెను.

ప్రశ్న: విష్ణువునకు గర్భవాసాదికము ఇచ్ఛాధీనమని పురాణ ములయందు చెప్పఁబడినది గదా!

ఉత్తరము: శ్రుతిప్రోక్తమగు విష్ణుజననము పురాణములయందు లేదని చెప్పుట— ప్రామాణికము కాదు. ఇంతియే గాక- శ్రుతిసూక్తి మాలయందు—శ్రీహరదత్తాచార్యవర్యులు— దిగువశ్లోకములలో నిర్ణ యించిన విషయము—ఈ సందర్భమును బలపఱచుచున్నయది.

శ్లో॥ ఇచ్ఛాఽవతీర్ణ మురశాసన గర్భవాసః-
స్స్వేచ్ఛే దుదాహరణ మేష విమర్శనీయః।
గర్భే వసామి పరివేష్ట్య జరాయుణాఽహం—
మాసాన్ బహూనితి మహేశ్వర! కస్య కామః?॥
ఇచ్ఛాఽపి నూన మనుయాతి పురాకృతాని-
కర్మాణి శంకర! శుభాశుభలక్షణాని।
ఇచ్ఛాఽవతారవచనాని తు భారతాదౌ-
నారాయణస్య గుణవాద ముదాహరంతి॥

"మహేశ్వరా! విష్ణువు తన ఇష్టముచే నవతరింప- గర్భమందు నివసించుట-ఇచ్ఛావతారమునకు తార్కాణమగునెడల— ఈయంశము విమర్శింపఁదగినదేను, "మావి (జరాయువు)చే కప్పఁబడి—నేను గర్భమునందు అనేకమాసముల కాలము నివసింతు" నను కోరిక ఎవనికి కలుగును?

"శంకరా! శుభాశుభమయములైన పూర్వకర్మల ననుసరించియే

ఇచ్ఛ-సంభవించును. "నారాయణుఁడు కర్మపరవశుఁడు గాక-లోక కల్యాణార్థము తన ఇష్టముతో రామకృష్ణాద్యవతారములు గం వాడయ్యె"నని భారతాదులయందు నిర్వచించుట-ప్రశంసారూపమగు అర్థవాద మగుచున్నయది.

మరియు శ్రీమద్రామాయణమున ఉత్తరకాండయందు (51) ఏబది యొకటవ సర్గయందు- దశరథుఁగూర్చి-దుర్వాసమహర్షి వచనము-

శ్లో॥ శ్రుణు రాజన్ పురావృత్తం-తథా దేవాసురే యుధి।
దైత్యాస్సురై ర్భర్స్యమానా-భృగుపత్నీంసమాశ్రితాః॥
తయా దత్తాభయాస్తత్ర-న్యవస న్నభయా స్తదా।
తథా పరిగృహీతాం స్తాన్-దృష్ట్వా క్రుద్ధ స్సురేశ్వరః॥
చక్రేణ శితధారేణ-భృగుపత్న్యా శ్శిరోఽహరత్।
తతస్తాం నిహతాం దృష్ట్వా-పత్నీం భృగుకులోద్వహః॥
శశాప సహసా క్రుద్ధో-విష్ణుం రిపుకులార్దనం।
యస్మాదవధ్యాం మే పత్నీ-మవధీః క్రోధమూర్ఛితః॥
తస్మా త్త్వం మానుషే లోకే-జనిష్యసి జనార్దన।
తత్ర పత్నీవియోగం త్వం-ప్రాప్స్యసే బహువార్షికమ్॥
శాపాపహతిభీతస్సన్-స్వాత్మనా భావితోఽభవత్।
అర్చయామాస దేవేశం-భృగో శ్శాపేన పీడితః॥
తపసాఽఽరాధితో దేవో-హ్యబ్రవీ ద్భక్తవత్సలః।
లోకానాంసంప్రియార్థంవై-తంశాపంగృహ్యాముక్తవాన్॥

ఇతి శప్తో మహాతేజా-భృగుణా పూర్వజన్మని।
ఇహాగతో హి పుత్రత్వం-తవ పార్థివసత్తమ!॥

రామ ఇత్యభివిఖ్యాత-స్త్రిషు లోకేషు మానద!॥
తత్ఫలం ప్రాప్యతే చాపి-భృగుశాపభవం మహత్॥

"దశరథ మహారాజా! పూర్వము జరిగిన వృత్తాంతమును వినుము! ఒకప్పుడు దేవతలు రాక్షసులు పోరాడుచుండగా-అమరుల ధాటికి తాళలేక దైత్యులు పరుగిడి-భృగుమహర్షిగారి భార్య నాశ్రయించి-రక్షించుమని-ప్రార్థించిరి. అప్పుడామె యవ్వారికి అభయము నొసఁగినందున నిర్భయముగా నుండిరి. నారాయణుఁడు అట్టితటి-భృగుపత్నిచే రక్షింపఁబడు దైతేయులఁగాంచి క్రుద్ధుఁడై-తీక్ష్ణధారలుగల సుదర్శనచక్రముతో భృగుపత్నియొక్క శిరస్సును ఖండించెను.

అందువలన భృగుమహర్షి మృతురాలైన తన భార్యఁజూచి కోపోద్రిక్తుఁడై శత్రుసంఘమును చెండాడునట్టి శ్రీహరిని-హాలాత్తుగా దిగువవిధము శపించెను.

"వధింపరానట్టి నా భార్యను-క్రోధమువలన వివేకములేనివాడవై ఎందువలన సంహరించితివో, అందువలన- జనార్దనా! నీవు మానవ లోకమునందు జన్మింతువు గాక! అందు పెక్కువత్సరములు భార్య నెడఁబాసి యుందువు గాక!"

ఇట్లు భృగుశాపఘాతమునకు వెఱఁగంది తనలో శివుని ధ్యానించుచు బహుభంగుల నారాధింపగా- దేవదేవుఁడు ప్రసన్నుఁడై భక్తవాత్సల్యమున "లోకకల్యాణార్థము భృగుశాపము నంగీకరించి యనుభవింపు" మని వక్కాణించెను.

ఇట్లు భృగువుచే పూర్వజన్మయందు శపింపఁబడిన విష్ణువు ఈ

లోకమున కేతెంచి నీకు కుమారుఁడై-శ్రీరాముఁడను ప్రఖ్యాతిని ముల్లోకములయందు గాంచెను- అందువలన నీ కుమారుఁడు అరణ్య వాసమును సీతావియోగమును భృగుశాపఫలముగా అనుభవించుచున్న వాడు.

ఇఁక పరమేశ్వరుడైతేనో ''విశ్వాధికో రుద్రో మహర్షిః'' ''శివ ఏకో ధ్యేయ శ్శివంకర సర్వ మన్యత్ పరిత్యజ్య''ఇత్యాది శ్రుతివాక్యముల ప్రామాణ్యము వలన- శ్రుతులన్నిటికిని ''శివుడే జగత్కారణము. శివుడే ఉపాస్యుడు''అను నర్థమునందు తాత్పర్యము కలదని స్ఫురించుచున్నయది.

ఇట్లు చెప్పుటచే- వేదప్రామాణ్యవాదులు- శివోపాసనను విడువని వారగుటఁజేసి- శైవశాస్త్రమే సర్వవేద సమ్మతంబని తేటపడినది.

ఇందువలననే-

శ్లో॥ సదాశివః పరంబ్రహ్మ-సాంబమూర్తి స్సనాతనః।
విభూతిలేశ స్తస్యైష-ప్రపంచ ఇతి వైదికాః॥
పాంచరాత్ర స్థితా స్తస్య-పరభావే ధృతాక్షమాః।
విష్ణోఃపరత్వే వేదానా-మపి తాత్పర్య మూచిరే॥
తన్నిరాసప్రకారోఽత్ర—సంక్షేపేన ప్రదర్శ్యతే।
శివతత్త్వవివేకే యః-ప్రపంచేనోపపాదితః॥

''సనాతనుడు సాంబమూర్తియు నగు సదాశివుఁడు పరమాత్మయనియు, ఈ చరాచరప్రపంచమంతయు సదాశివుని మహిమలోకొద్ది భాగమనియు, వైదికులు భావించుచున్నవారు.''

''పాంచరాత్రాగమముల ననుసరించు వైష్ణవులు-సదాశివుని

పరత్వమును సహింపనివారై-విష్ణువుఁదగు పరత్వమునందు వేదములకును తాత్పర్యము కలదని ఆర్భాటము నొనర్చినందున-నవ్వారి ప్రతిపాదనము నీ గ్రంథమున సంగ్రహముగా నిరాకరింపనైనది. శివతత్త్వవివేకమునందు వైష్ణవమతఖండనమును విస్తారముగా చూదనగును.''

ఇవ్విధము శ్రీమదప్పయదీక్షితేంద్రులు స్వవిరచితమగు శివకర్ణామృతమునందు ప్రతిపాదించినవారు.

ఇట్లు-రుద్రజన్మాభావనిరూపణము సర్వంబు సమంజసంబేను.

## శ్రీరామాయణ ప్రతిపాద్య నిర్ణయము

శ్రీమద్రామాయణము మహాభారతము మొదలగువానికి గూడ-శివోపాసనయందే తాత్పర్యము కలదని దిగువ శ్లోకము విశదపరచుచున్నయది.

శ్లో॥ రామాయణేన మహతాఽపి చ భారతేన-
రామాదిసేవితతయా ప్రథితం మహేశమ్।
ముక్త్వాఽన్యదైవత ముప్రాశయతాం జనానాం-
పంథాః కథం మహితవేదపథానుగస్స్యాత్?॥

రామాయణమునందు మహాభారతమునందును శ్రీరామకృష్ణులచే సేవింపబడినవాడుగా నిరూపింపఁబడిన మహేశ్వరునివిడనాడి ఇతర దేవతల నాశ్రయించువారి మార్గము- శ్రేష్ఠమైన వేదపథం బెట్లగును?

ప్రశ్న: శ్రీమద్రామాయణమున సుందరకాండయందు—

"కిం వైష్ణవం వా కపిరూప మేత్య - రక్షోవినాశాయ
పరం ను తేజః।
అచింత్య మవ్యక్త మనంతరూపం - స్వమాయయా
సాంప్రత మాగతం వా?॥

అను శ్లోకమున-అచింత్యత్వము వశీకృతమాయత్వము మొదలగు పరబ్రహ్మలక్షణములు-వైష్ణవరూపమునందు గలవని వర్ణించుటచే- రామాయణమున విష్ణుపారమ్యము నిరూపింపబడినట్లే గదా?

ఉత్తరము: పై శ్లోకమున- "వైష్ణవం వా" "ఆగతం వా" అనుచో- రెండు "వా" కారములు గమనింపదగినవి. "వైష్ణవం పరమం తేజః కపిరూపమేత్య రక్షోవినాశాయ సాంప్రతం ఆగతం వా? "అచింత్య మవ్యక్త మనంతరూపం స్వమాయయా సాంప్రతమాగతం వా?" "విష్ణుసంబంధమైన పరమతేజస్సు-వానరరూపముతో రక్కసులం దునుమాడుటకు ప్రస్తుతము ఇటకు నేతించినదా? లేక అచింత్యము అవ్యక్తము అనంతరూపంబు నగు శివతత్త్వము- తన మాయచే కపిరూపముఁదాల్చి రాక్షసులను సంహరింవ నేతెంచినదా?" విష్ణువా? శివుడా? అని తర్కించుటలో అచింత్యత్వాది లక్షణములు గల శివతత్త్వమే ముఖ్యమైనదని-దిగువ శ్రుతివలన తేటపడుచున్నయది.

"అచింత్య మవ్యక్త మనంతరూపం-శివం ప్రశాంతం
అమృతం బ్రహ్మయోనిమ్ । స్వమాయయా కల్పిత
విశ్వరూపం"

"అచింత్యుడు, అవ్యక్తుడు, అనంతస్వరూపుడు, ప్రశాంతుడు. వేదకర్తయు నగు శివుడు-తన మాయాశక్తిచే విశ్వమును నిర్మించి అట్టి విశ్వముఁదగు స్థూలరూపము గలవాడును" అను శ్రుతియందు

ప్రసిద్ధమైన శివరూపము- రక్షోవినాశము కొరకు వచ్చినదా ? అని సమర్థించుట - సమరసంబగుటఁజేసి - శ్రీమద్రామాయణమునందు- శివుఁడే పరబ్రహ్మముగా-నిర్ణయింపఁబడినవాడని తెలియవలెను.

మరియు-

శ్లో॥ కృతాభిషేక స్స రరాజ రామ - స్సీతాద్వితీయ స్సహ లక్ష్మణేన।
కృతాభిషేకో గిరిరాజపుత్ర్యా-రుద్ర స్సవిష్ణు ర్భగవా నివేశః॥

"సీతాద్వితీయుఁడైన శ్రీరాముఁడు - వనవాసానంతరము అయోధ్యఁజేరి-పట్టాభిషిక్తుఁడై లక్ష్మణునితో కూడ-రాజసింహాసనమునందు - పార్వతీదేవితోసహ పరమేశ్వరుఁడు — మహాకైలాసమున పట్టాభిషిక్తుఁడై విష్ణుమూర్తి ప్రక్కన ఉండగా దేవతాసార్వభౌమ పీఠమునందు వలె-ప్రకాశించెను."

అను రామాయణ శ్లోకమున- శ్రీరాముని పరివారములో లక్ష్మణుని స్థానము-శివుని పరివారమునందు విష్ణువునకు "రుద్ర స్సవిష్ణుః" అను ఉపమానమున - వాల్మీకి మహాకవిచే నిర్దేశింపఁబడుటఁ జేసి- లక్ష్మణునికంటె రామచంద్రునకు వలె - విష్ణువునకన్న రుద్రునకు శ్రేష్ఠత్వము అవగతమగుచున్నయది.

ఆ శ్లోకమున "రుద్ర స్స నందీ"అను పాఠము విహితము కాదు. ఎందుకనఁగా ? నందికేశ్వరుఁడు శివుని ముందు ఉండువాడగుటచే- రాముని ప్రక్కనుండు లక్ష్మణుని స్థానమున-నందికేశ్వరుఁ జేర్చుట- సముచితము కాదు. గాన- "స నందీ" అనునది - అనౌచిత్యదోష దూషితమై పరులచే కల్పింపఁబడిన అపపాఠమగుటవలన వాల్మీకి

విరచితము కాదని గ్రహింపవలెను. ఇంతియే గాక- యుద్ధకాండము నందు-ఆదిత్య హృదయమున-

"బ్రహ్మేశానాచ్యుతేశాయ-సూర్యాయాదిత్యవర్చసే" (sic)

"బ్రహ్మ విష్ణు రుద్రుల ప్రభువగు సదాశివుని స్వరూపము లోన గల రవికి నమస్కారము" అనుచో పరమేశ్వరుఁడు- మూర్తిత్రయ జనకుఁడని వెలిబుచ్చుటచే- అట్టి మహేశ్వరుని శరీరమగు సూర్యుని ప్రార్థించుటవలన శ్రీరామచంద్రునకు విజయము సంప్రాప్తమైనందున రామచంద్రుఁడు- శివోపాసకుఁడని- వాల్మీకి మహాకవి - స్ఫురింపఁ జేసెను. మరియు శ్రీమద్రామాయణగతమగు ఉత్తరకాండమునందు అశ్వమేధ ప్రస్తావమున-

శ్లో॥ నాన్యం పశ్యామి భైషజ్య-మంతరేణ వృషధ్వజం।
నాశ్వమేధాత్ పరో యజ్ఞః-ప్రియశ్చైవ మహాత్మనః॥

"రావణవధాది దోషపరిహారము- పరమేశ్వరు నాశ్రయింపనిది సంభవింపదు. సంసారక్లేశ వ్యాధులకు పరమౌషధము- శివోపాసనం బేను. అశ్వమేధమునకన్న నితరమైన యజ్ఞము- శివునకు ప్రియము కాదు."

శ్లో॥ తే తు రామవచశ్శ్రుత్వా-నమస్కృత్వా వృషధ్వజం।
అస్వమేధేన దేవేశం-పూజయంతి స్మ నిత్యశః॥

"వారందరు- శ్రీరాముని మాటవిని_శంకరునకు ప్రణమిల్లియు- అశ్వమేధయాగము నాచరించుచు-ప్రతిదినము మహాదేవుని పూజించు చుండిరి." శ్రీరాముఁడు - అశ్వమేధయాగముచే శివు నారాధించెనని అవగతమగుటచే శ్రీరామచద్రుఁడు- శివోపాసకుఁడని_ ఇఁట- స్పష్ట మైనది.

ఇందువలననే

"అత్ర పూర్వం మహాదేవః-ప్రసాద మకరో ద్విభుః"

శ్రీరాముఁడు పుష్పకవిమానముపై—"సముద్రతీరమున-రావణవధకు పూర్వము సర్వవ్యాపకుఁడగు మహాదేవుఁడు—అనుగ్రహించె"నని సీతాదేవికి చెప్పినందున- శ్రీరాముఁడు- శివానుగ్రహమునకు పాత్రుఁడని నిర్ణయింపవచ్చును.

ప్రశ్న : "అత్ర పూర్వం మహాదేవః"అను దానిని "అత్రపూరు -అమ్మహాదేవః"అని విభజించినచో-"త్రపు అనఁగా సీసము, అత్రపు -సీసము కానట్టి బంగారు ఛాయలు గల, ఊరు = తొడలు గల ఓ సీతా! అపాం మహాదేవః, అమ్మహాదేవః = ఉదకములకు గొప్ప ప్రభువైన సముద్రుఁడు అనుగ్రహించెను" అను నర్థము ఏర్పడును గాన- శ్రీరాముఁడు శివానుగ్రహపాత్రుఁడనుట చెల్లదు గదా!

ఉత్తరము : ఇట్టి అపవ్యాఖ్యానములు అపపాఠములున్ను- భగవానుఁడైన ఆదికవియగు వాల్మీకిచే రచింపఁబడినట్టి, శ్రుతిసమ్మితంబునగు రామాయణమును కలుషితముఁజేయునవి గాన - తమ (వైష్ణవ) పథము- అవైదిక మూర్ధన్యమని ప్రకటింపఁబడినట్లు వ్యక్తమగుచున్నయది.

ఇత్యాది సందర్భమున- శ్రీమద్రామాయణ ప్రామాణ్యము కూడ శివుఁడే. భుక్తిముక్తి కాములచే ఉపాస్యుండని విశదపరచినదని పాఠకులు గ్రహింతురు గాక!

## శ్రీ మహాభారత ప్రతిపాద్య నిర్ణయము

ప్రశ్న : మహాభారత ప్రారంభమున "నమో భగవతే తస్మై-

వ్యాసాయామితతేజసే- యస్య ప్రసాదా ద్వక్ష్యామి - నారాయణకథా మిమామ్"

"భగవానుఁడు, అమిత ప్రభావముగలవాడు నగు వ్యాసునకు నమస్కారము ఆ మహామహుని అనుగ్రహమువలన ఈ నారాయణ కథ గల భారతమును చెప్పఁగలుఁగుచున్నాను"అని సూతుఁడు నిర్వ చించుటఁజూడగా - మహాభారతము శ్రీహరిని వర్ణించునదని - స్పష్ట మగుటచే-నియ్యది శివపారమ్య ప్రతిపాదకము కాదు గదా!

ఉత్తరము : ఇట్టి భారతమును రచించు వేదవ్యాసుఁడు – శ్రీకృష్ణుని మహిమను వర్ణించుట ద్వారా - శ్రీకృష్ణునిచే, శ్రీకృష్ణుని మూలరూపమగు పరవాసుదేవునిచేతను సదా పూజింపఁబడు శివునినే పేర్కొనుచు శ్రీకృష్ణుఁడు - శివపూజానిష్ఠుఁడై శివానుగ్రహముచే సమస్తమహిమలు గలవాడైనాడని- ఇందు–పునః పునః నిరూపించెను.

ఎట్లనఁగా ?

సౌప్తిక పర్వమునందు అశ్వత్థామఁ గూర్చి శివుఁడిట్లు నిర్వ చించెను.

శ్లో॥ సత్య శౌచార్జవ త్యాగై- స్తపసా నియమేన చ।
అహం యత్ భవతాఽఽరాధ్యః-కృష్ణేనాక్లిష్టకర్మణా॥
తస్మాత్ ప్రియతమః కృష్ణా-దన్యో మమ న విద్యతే॥

"సత్యము, శౌచము, ఋజుభావము, మమకారత్యాగము, రుద్రా ధ్యాయాది పఠనము నక్తభోజనము శివపంచాక్షరీజపము మొదలగు తపస్సు. బ్రహ్మచర్యాది నియమము అనువానిచే నీవు నన్నారాధించి నట్లు– క్లేశమును నివారించు లోకకల్యాణకార్యముల నొనర్చు శ్రీకృష్ణుఁ

డును సత్యాదులు గలవాడై నన్నారాధించుచున్నవాడు గాన కృష్ణుని కన్న ప్రియతముఁడు మరియొకఁడు నాకు లేడు."

ఆదిపర్వమునందు — సుభద్రా పరిణయప్రస్తావమున— సముద్ర మధ్య నౌకానౌక ద్వీపమునందు - శ్రీకృష్ణుఁడు శివునిఁబూజింప— గొప్ప ఉత్సవమును జరిపించెనని వ్రాయఁబడినది. మరియు ఉప మన్యు మహర్షిగారి యుపదేశమును శ్రీకృష్ణుఁడు-పంద్రెండ్రు వత్సర ములం కాలము పాశుపత వ్రతము నాచరించినాడనియు, కైలాస యాత్రయందు ఇతరసమయములలోను — పూజాస్తుతి తపస్సులచే శ్రీకృష్ణుఁడు శివు నారాధించెననియు చెప్పఁబడినది.

ద్రోణపర్వమునందు-

ద్రోణాచార్యుఁడు మరణించినపిదప - అశ్వత్థామ - కృద్ధుఁడై- కృష్ణార్జునులపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగింపగా - నయ్యది వ్యర్థ మైనందున - సిగ్గుపడి - దక్షిణదిశవైపు వెడలుచుండ - మార్గమున శ్రీవేదవ్యాసుఁడు ప్రత్యక్షమై అశ్వత్థామయొక్క దీనత్వమును పోగొ ట్టుటకు దిగువవిధము ప్రవచించెను.

శ్లో॥ దేవ దేవ స్త్వచింతాత్మా-అజయ్యో విష్ణు రవ్యయః।
సర్వరూపం భవం జ్ఞాత్వా-లింగేఽర్చయతి యః ప్రభుమ్॥
తస్మి న్నభ్యధికాం ప్రీతిం-కరోతి హి వృషధ్వజః॥

"దేవ దేవుఁడు" సామాన్యులకు చింతింపనలవిగాని స్వరూపము గలవాడు, అవ్యయుఁడు ఎవరిచేతను గెలువ నలవిఁగానివాడు నగు విష్ణుమూర్తి— "పరమేశ్వరుఁడు—చరాచర జగద్రూపుఁడని" భావించి- విశ్వనాథుఁడైన శివుని లింగమునందు పూజించుచున్నవాడు. అందు వలన విష్ణువునందు శివుఁడు అత్యంతప్రీతి కలిగియున్నవాడనియు.

మరియు నదే ద్రోణపర్వమున—

"శ్రీకృష్ణార్జునులు – పూర్వము నరనారాయణులను ఋషులుగా నుండిరి. వారు— ప్రతిదినము శివలింగము నర్చించుట చేతను, అరువది వేల వత్సరములు శివపంచాక్షరీ జపాదులచే శివు నారాధించుట వలన నవ్వారికి అతుల వీర్యబల పరాక్రమాదులైన పెక్కు వరముల నొసఁగినాడని వేదవ్యాసుఁడు వక్కాణింపగా—"నేను శివపూజకుఁడను కానా ?" అని అశ్వత్థామ ప్రశ్నించినతఱి

శ్లో॥ జన్మకర్మ తపోయోగా- స్తయో స్తవ చ పుష్కలాః।
తాభ్యాం లింగేఽర్చితో దేవ- స్త్వయాఽర్చాయాం
యుగే యుగే॥

కృష్ణార్జునులకు నీకును-జననము, సత్కర్మాచరణము, తదస్న మొదలగు విశేషములు సమానములేను, తథాపి వారిద్దరు శ్రుతియుగమున లింగమునందు మహాదేవు నర్చించిరి. నీవైతేనో మూర్తియందు శివునారాధించితివి. మూర్తి పూజనమునకన్న లింగార్చనము మిన్న యగుటచే నవ్వారిని నీవు జయింపఁజాలలేదని-వేదవ్యాసుఁడు నిర్వచించెననియు కలదు.

ఇంతియే గాక—

స్వర్గమునుండి భువిని పారిజాతవృక్షమును నిరాటంకముగా తీసికొని వచ్చుటకు శ్రీకృష్ణుఁడు — బిల్వదళమున పార్థివలింగము నర్చించి,

శ్లో॥ ఇతి సంస్తూయమానస్తు- భగవాన్ గోవృషధ్వజః।
ప్రహర్ష్య దక్షిణం బాహుం-వాసుదేవ మదాబ్రవీత్ ॥

,, మనీషితానా మర్థానాం-ప్రాప్తి స్తేఽస్తు నరోత్తమ ।
పారిజాతస్య హర్తాఽసి-మాఽభూత్తే మనసో వ్యధా॥

,, పురా మైనాక మాశ్రిత్య-తప స్త్వమకరో ర్యదా।
తదా మమ వచః కృష్ణ-సంస్మృత్యస్థైర్య మాప్నుహి॥

,, అవధ్య స్త్వ మజయ్య స్త్వం-మత్తః శూరతర స్తథా।
భవితాసీత్యవోచం యత్-తత్తథా న తదన్యథా॥

ప్రార్థింపగా - భగవానుఁడగు గోవృషధ్వజుఁడు కుడి చేయి చాచి వాసుదేవుఁగూర్చి ఇట్లు వచించెను.

నరోత్తమా! నీవు కోరిన వన్నియు నీకు లభించుగాక! స్వర్గము నుండి పారిజాత వృక్షమును తీసికొని రాగలుఁగుదువు గాక! ఇవ్విషయమై నీవు బాధపడకుము! ఇప్పుడే గాక పూర్వము మైనాక పర్వతముపై నన్నుగురించి తపస్సుచేసియుంటివి. అప్పుడు నేను చెప్పిన మాటలను జ్ఞాపకమునకు తెచ్చుకొని-స్థిరమనస్కుఁడవు కమ్ము!

"ఎవరిచేతను వధింపఁబడు వాడవు కావనియు, ఎవరికిని గెలువనలవిగాని వాడవనియు, ఒకప్పుడు నన్నుమించిన పరాక్రమము గలవాడవగుదువనియు, వరముల నిచ్చియుంటిని. అట్టి సామర్థ్యము నీకెప్పుడును కుంటుబడదుసుమా ! అని శ్రీకృష్ణునకు శివుఁడొసఁగిన వరములఁబట్టి విచారింపగా — శ్రీకృష్ణుఁడు - నిజరూపమున పూర్వరూపములయందును శివునారాధించిన సందర్భములనేకములు—గోచరించును.

శ్రీకృష్ణుని మూలరూపమగు నారాయణుఁడు శివు నారాధించి వరములఁ బొందినట్లు—మహాభారతమున అరణ్యపర్వమునందు తీర్థ

యాత్రాప్రకరణమున "తతో గచ్ఛేత్సువర్ణాక్షం-త్రిషులోకేషు దుర్లభం-యత్ర విష్ణుః ప్రసాదార్థం- శివ మారాధయన్ పురా-వరాంశ్చ సుబహూన్ లేభే-దేవైరపి సుదుర్లభాన్- దత్తాంశ్చ త్రిపురఘ్నేన-పరితుష్టేన భారత! అపి చాన్యైః ప్రియతమో-లోకే విష్ణో భవిష్యసి-త్వన్ముఖం చ జగత్సర్వం-భవిష్యతి న సంశయః"

"ముల్లోకములయందు పొందనలవిగానట్టి సువర్ణాక్షము అను పుణ్యక్షేత్రమున - శివానుగ్రహముఁ బడయుటకై విష్ణువు శివునారాధింపగా-ప్రసన్నుఁడైన శివుఁడు-"ఇతరులకన్న నెక్కువ ప్రియుడవగుదువు! చరాచరమంతయు నిన్ను ప్రముఖునిగా భావించును"ఇట్లు అమరులకు గూడ పొందనలవిగానట్టి పెక్కు వరములను విష్ణువునకు ప్రసాదించెను" అని యుల్లేఖింపఁబడినది.

అనుశాసనికమునందున-

శ్లో॥ యస్య బ్రహ్మా చ విష్ణుశ్చ-త్వం చ శక్ర! సహామరైః।
అర్చయధ్వేసదా లింగం-తస్మాచ్ఛ్రేష్ఠతమో హి కః?॥

"ఇంద్రా! బ్రహ్మదేవుఁడు, విష్ణుమూర్తి, దేవతలు, నీవును ఎవనిని లింగమునందు ఆరాధించుచున్నవారో, అట్టి మహాదేవునికంటె గొప్పవాడెవడు?"

అను ఉపమన్యు మహర్షిగారి వచనమునందు-బ్రహ్మవిష్ణ్వాదులు నిత్యము శివునారాధించువారని వ్యక్తమగుచున్నయది.

ఇంతియే గాక సౌప్తికాది పర్వములయందు- విష్ణ్వవతారమగు శ్రీకృష్ణభగవానుఁడు - శివునర్చించి సర్వవిధ వరములఁ బడసినట్లు నిర్వచనములుండుటచే - నిరతిశయ ప్రభావము గల శ్రీకృష్ణుఁడు పరమాత్మగా మహాభారతమున ప్రతిపాదింపఁబడుటలో-శ్రీకృష్ణునిచే

నారాధింపఁబడు సదాశివుని పారమ్యము ఇమిడియున్నదని స్ఫురించు చున్నయది.

ఇట్లు—మహాభారతము - స్వనాచ్యుఁడైన నారాయణుని చరితము ద్వారా పరమేశ్వరుని — ముఖ్య ప్రతిపాద్యునిగా నిరూపించినదని- గ్రహింపవలెను. మరియు మహావిష్ణువు గావించిన తపస్సు - ద్రోణ పర్వమున—

శ్లో॥ ఊర్ధ్వబాహు ర్మహాతేజా-జ్వలనాదిత్యసన్నిభః।
షష్టి వర్షసహస్రాణి-తపత్యేవ శతాని తు॥

శ్లో॥ వ్యశోషయ త్తదాత్మానం-వాయుభక్షోఽంబుజేక్షణః ।
అథాపరం తప స్తప్త్వా-ద్విస్తతోఽన్యత్ పునర్మహత్॥
ద్యావాపృథివ్యో ర్వివరం-తేజసా సమపూరయత్ ।
స తేన తపసా తత్ర-బ్రహ్మభూతో యథాఽభవత్॥

మహాప్రభావము గల పుండరీకాక్షుఁడు-అరువదిఆరువేల వత్సరములు—ఊర్ధ్వబాహువై శివునిఁగూర్చితపించి-మండుచున్న సూర్యుఁబోలినవాడై—గాలిమాత్రము పీల్చుచు తన శరీరమును శుష్కింపఁజేసెను. ఆ పిమ్మట అట్టి తపస్సునే రెండుతడవలు గావించి—స్వర్గ మర్త్యలోకముల నడిమిచోటును తన తేజస్సుచే నింపివేసెను. అట్టి అద్వితీయ అపూర్వ తపస్సుచే పరబ్రహ్మభావము గలవారయ్యెను. "నారాయణుఁడు "శివోఽహం" భావనతో శివునితో నేకీభవించి శివుఁడయ్యెనని" "బ్రహ్మభూతః" అను పదముఁదగు అంతరార్థము.

ఇట్టి తపస్సుచే సాక్షాత్కరించిన శివుని—విష్ణువు దిగువ విధము ప్రార్థించెను.

శ్లో॥ స జానుభ్యాం మహీం గత్వా-కృత్వా శిరసి చాంజలిం।
పద్మాక్ష స్తం విరూపాక్ష-మభితుష్టావ భక్తిమాన్॥

"అట్టి తటి-నారాయణుఁడు- మోకాళ్ళచే నేలఁదాకి- తలపై దోసిలినిడియు, కమలనేత్రుఁడు-ఫాలనేత్రుని భక్తితో నుతించెను".

శ్లో॥ త్వద్భూతావై భూతకృతో వరేణ్య!-గోప్తారో యే భువనస్య గోపాః । ప్రవిశ్యేమాం ధరణీం యే హ్యరక్షన్-పురా పురాణీ తవ దేవ సృష్టి॥

భూతం భవ్యం భావి యచ్చాప్యదృష్టం- త్వత్సంభూతా సప్త ఇమే హి లోకాః ।
భక్తం చ మాం భజమానం భజస్వ-ప్రీత్యా మాం వై లోకపిత ర్మహేశ॥

"సర్వశ్రేష్ఠుఁడవైన శంకరా! లోకపాలురై ప్రపంచమును రక్షింప సమకట్టిన బ్రహ్మవిష్ణ్వాదులు- నీ వలన జన్మించినవారు. అట్లే ఈ భూమిఁబ్రవేశించి అవతారరూపములతో ప్రాణులను కాపాడినవారును నీ మూలము గానే గొప్పవారైరి. దీనినంతటిని పరిశీలింపగా- ప్రప్రథమము-హరి బ్రహ్మదిదేవతల నావిర్భవింపఁజేయు ఆదిసృష్టి నీదేనని తేటపడును."

సమస్త ప్రాణి జనకుడవైన మహేశ్వరా! జరిగినది జరుగుచున్నది కనుఁకగుపడనట్టి భవిష్యత్తు నీవలననే ప్రవర్తించునది. భూతభవిష్యత్ వర్తమానములకాశ్రయములగు ఈ ఏడులోకములును నీపై ఆధారపడియున్నవి. ఇంతకు నేను ప్రార్థించునదేమనఁగా? నీయందు నిరంతరము ఏకాగ్రభక్తి గలవాడను, ప్రస్తుతము నిన్ను సేవించుచున్నాను. అట్టి నన్ను అనురాగముతో అనుగ్రహింపుము!"

ఇఁక- ఇదే మహాభారతమున ఉద్యోగపర్వమునందు-

"మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ" అనుచో-

"మహాభారతమునకు మూలము-కృష్ణుఁడు, బ్రహ్మము, బ్రాహ్మణులు" అను వివరణమున- కృష్ణునియొక్కయు బ్రాహ్మణుల యొక్కయు నడుమనుండు బ్రహ్మపదమునకు—అచేతనమైన వేదమను నర్థముఁజెప్పక—చేతనుఁడైన శివుఁడను నర్థముఁజెప్పుట సమంజసంబగును. ఎట్లనఁగా? కృష్ణుఁడు బ్రహ్మజ్ఞులు పోగా-పారిశేష్యాత్- శేషించినవాడు శివుఁడే నగును. కైలాసగుహయందు విశ్రాంతిఁజెందుచున్న పంచేంద్రులను పరీక్షించి పంచపాండవులుగా భువిని జన్మింతురుగాక!" అని శపించుటయు, ఒకానొక ఋషికన్యక భర్త కావలెనని తపింపగా ప్రత్యక్షమైన శివునిఁగూర్చి భర్త అను పదమును ఐదు పర్యాయములు ఉచ్చరించి ప్రార్థించిన ఋషికన్యకకు-రెండవ జన్మమున ద్రౌపదివై ఐదుగురు భర్తలఁబడయుదువని వరము నొసఁగుటయు చూడగా— పంచేంద్రశాపముచే ఋషిపుత్రికా వరమువలనను మహాభారతమునకు మూలము శివుఁడయ్యెననియు, ఆ పిమ్మట కృష్ణుఁడు తన మహిమలను రాజకీయచాతుర్యముఁజూపి-మహాభారతవాచ్యుఁడయ్యెననియు, వేదవ్యాస పరశురామ దుర్వాసాది బ్రహ్మజ్ఞులు మహాభారతమున పాండవవిజయమునకు కారకులైరనియు తేటపడుచున్నయది.

ఇయ్యది

శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి కృతమగు బ్రహ్మపథమున
వేదపథములో వైష్ణవపథ ప్రతిషేధమునందు-శ్రీ రుద్రజన్మాభావ
నిర్ణయమునకు, శ్రీ రామాయణప్రతిపాద్య నిర్ణయమునకు
శ్రీ మహాభారత ప్రతిపాద్య నిర్ణయమునకును
శైవనందినీ శాంకరీయ ఆంధ్రానువాదము

# శ్రీ భగవద్గీతా ప్రతిపాద్య నిర్ణయము

శ్రీమద్రామాయణము శ్రీ మహాభారతము ఉపనిషత్తులు ఆగమములు పురాణములు ధర్మశాస్త్రములున్ను శివుఁడే పరదైవముగా సర్వోపాస్యుండగునని ప్రతిపాదించుచున్నను— శ్రీకృష్ణభగవానుడు పరమాత్మనని వక్కాణించిన-భగవద్గీత- శివపరమెట్లగునో, శ్రీమదప్పయదీక్షితేంద్రుల సమర్థనమును శ్రీ హరదత్తాద్యాచార్యుల నిర్వచనమును పురస్కరించుకొని స్వకీయ పాండిత్యప్రతిభలను మేళవించి మహోపాధ్యాయ, శివయోగి- శ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రివరేణ్యులు- శ్రుతిస్మృతి పురాణాదిప్రామాణ్య ప్రదర్శనముతో సముల్లేఖించిన సందర్భము- ప్రశ్నోత్తరరూపముగాను శంకా సమాధానరూపముగాను ఇఁట వ్రాయఁబడుచున్నది.

శ్రీకృష్ణప్రోక్తమగుటచే భగవద్గీతను పఠింపరాదనువారు దీనిని చదివి అవగాహనఁజేసికొనియు సావధానచిత్తులగుదురు గాక!

"ఈశ్వర స్సర్వభూతానాం-హృద్దేశేఽర్జున! తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని-యంత్రారూఢాని మాయయా॥

"అర్జునా! ప్రాణులందరి హృదయములో పరమేశ్వరుఁడు సూక్ష్మాతి సూక్ష్మరూపమున నివసించును- మరియు కర్మవశమున తారసిల్లిన శరీరము అను యంత్రము నధిష్ఠించిన జీవాత్మలందరిని తన మాయాశక్తిద్వారా ప్రారబ్ధగతకర్మల నాచరింపఁ బ్రేరేపించును."

"తమేవ శరణం గచ్ఛ-సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్ పరాం శాంతిం-స్థానం ప్రాప్స్యసి
శాశ్వతమ్॥

భరతవంశోద్భవా! కౌంతేయా! అట్టి పరమేశ్వరునే-మనో వాక్కాయములతో శరణము నొందుము! ఆ పరమేశ్వరుని సంపూర్ణానుగ్రహమువలన జననమరణాది దుఃఖములచే నిండియుండు సంసారము యొక్క విరామమును నిత్యమైన శివపదమును పొందగలవు!

"తమేవ చాద్యం పురుషం ప్రపద్యే"

"ఆద్యుఁడు పురుషుఁడునగు ఆ పరమేశ్వరునే శరణము నొందుచున్నాను."

"ఉత్తమః పురుష స్త్వన్యః-పరమాత్మేతి కీర్తితః"

"జీవభిన్నుఁడైన ఉత్తమపురుషుఁడు- ఇందు పరమాత్మయని కీర్తింపఁబడెను." ఇత్యాది గీతాచార్యోక్తులు- శివపారమ్యప్రతిపాదకములుగా భగవద్గీతయందు సంగతములగుచున్నవి.

ప్రశ్న: "అహం సర్వస్య ప్రభవః" ఇత్యాది వాక్యములను పరిశీలింపగా భగవద్గీతయంతయు శ్రీకృష్ణపరమని విదితమగుచున్నందున- గీతలో గల ఈశ్వరాదిపదఘటితమగు వాక్యజాతము యౌగికార్థముతో శ్రీకృష్ణునే ప్రతిపాదించునని- నిరూపించుటలో విరోధము లేదు గదా!

ఉత్తరము: ఈశ్వరాది శబ్దములు- లోకవేదములయందు శివపరములై ఇతరసాధారణములు కాకుండుటచే- ఈశ్వరాదిశబ్దముల యొక్క రూఢ్యర్థవశమున గీతయందు చెప్పఁబడిన "అహం సర్వస్య ప్రభవః" ఇత్యాది వాక్యములకు "అహం మను రభవం సూర్యశ్చ" వామదేవుఁడు-సర్వాత్మాహంభావముతో "నేను మనువును సూర్యుడనై తిని" అని యుపదేశించినట్లు "శాస్త్ర దృష్ట్యా తూపదేశో వామదేవ

వత్" "శాస్త్రదృష్టిచే నేను నేను అని దేవేంద్రుఁడు ప్రతర్దనునకు ఉపదేశించుట- వామదేవునివలె- ఉపపన్నంబగును" అను బ్రహ్మ సూత్రగత న్యాయము ననుసరించి శ్రీకృష్ణుఁడు-అర్జునునకు "అహం" "అహం" అని-శివతాదాత్మ్యభావనతో ఉపదేశించె నను అర్థముఁ జెప్పవలెను.

శంక: "సర్వస్య చాహం హృది సన్నివిష్టః "చరాచరప్రాణుల యొక్క హృదయములో నేనున్నాను" అను పంచదశాధ్యాయగత మగు శ్రీకృష్ణవచనమునకు "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అనునది ప్రత్యభిజ్ఞా (గుర్తుగల) వాక్యమగుటఁజేసి—ఈశ్వ రాది పదఘటితవాక్యములన్నిటికిని విష్ణుపరత్వమును నిర్ణయింప నగును గదా!

సమాధానము: "తమేవ శరణం గచ్ఛ" "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" ఇత్యాది వచస్సులను పరిశీలించునెడ-భగవానుఁ డగు శ్రీకృష్ణుఁడు- ఉపాసకుఁడనియు, పరమాత్మకాదనియు తేట పడును.

అందువలన "అహం సర్వస్య ప్రభవః" ఇత్యాదిని ప్రతిపాదింప బడిన నిఖిల జగజ్జన్మాదికారణత్వము- పరమేశ్వరునకే కలదని శ్రీకృష్ణుఁడు అర్జునునకు విశదపరచుటకై "ఈశ్వర స్సర్వభూతానాం" ఇత్యాదివాక్యముల నుదాహరించెనని స్పష్టమగుచున్నయది.

"ఎందువలన ఈశ్వరుఁడు ప్రాణులందరి హృదయములోనున్న వాడో అందువలన నేను అంతర్యామిభావనతో జగత్కారణమగుదు నని-శ్రీకృష్ణుఁడు ప్రబోధించెనను తద్భావన-ఇఁటహృదయ(రహస్య) మైనది.

[illegible] ననుసరించి గీతలోని

అస్మచ్ఛబ్దము అంతర్యామిపరమని-అంగీకరించుట-అనివార్యమగును. ఎట్లనఁగా? కూర్మమహాపురాణ గత-ఉత్తరార్థమున గల ఈశ్వర-గీతను పరమేశ్వరుఁడు- విష్ణువును ముందిడుకొని సనకసనందనాది మహర్షులకు ప్రబోధించిన గురుపరంపరలో—

శ్లో॥ మా ముపాచ పురా దేవః-సతీదేహభవాంగజః ।
వామదేవో మహాయోగీ-రుద్రః కిల పినాకధృత్॥

నారాయణోఽపి భగవాన్-దేవకీతనయో హరిః ।
అర్జునాయ స్వయం సాక్షా-ద్దత్తవా నిద ముత్తమమ్॥

యదాఽహం లబ్ధవాన్ రుద్రా-ద్వామదేవా దనుత్తమం ।
విశేషా ద్గిరిశే భక్తి-స్తస్మాదారభ్య మేఽభవత్॥

"సతీదేహోద్భవుఁడు, పినాకధారి రుద్రుఁడనదగినవాడు నగు వామదేవుడు అను యోగీశ్వరుడు-నాకు ఈశ్వరగీతను ప్రబోధించెను అట్లే-నారాయణుడును దేవకీతనయుడై జన్మించి-శ్రీకృష్ణరూపముతో పార్థునకు కురుక్షేత్రమున నీ సర్వశ్రేష్ఠజ్ఞానము గల ఈశ్వరగీత నుపదేశించెను.

రుద్రస్వరూపుడైన వామదేవునివలన నీ శివజ్ఞానముబడసి నప్పటినుండి సదాశివునియందు విశేషించి నాకు భక్తి కలిగినది.

అని వేదవ్యాసుడు ప్రవచించిన సందర్భమును పురస్కరించు కొని- పూర్వవాదమగు ఈశ్వరగీతకు-భగవద్గీత-అనువాదమగుట వలన-ఈశ్వరగీతార్థమునందేభగవద్గీతార్థము పర్యవసానముజెందుట-న్యాయ్యమగుచున్నయది మహాభారతముశివపారమ్యప్రతిపాదకమగుటచే

మహాభారతాంతర్గతమగు భగవద్గీతగూడ- శివపరమగుట-సముచితము గదా!

ఒకవేళ అట్లు కానిచో- అర్జునుఁడు గీతాశ్రవణానంతరము తత్పూర్వమున్ను శివునారాధించినవాడని-మహాభారతము నిర్వచించుట వ్యర్థంబగును.

"బహూని మే వ్యతీతాని-జన్మాని తవ చార్జున!
తాన్యహం వేద సర్వాణి-న త్వం వేత్థ పరంతప!"

ఇత్యాదిని శ్రీకృష్ణుడు- తనకు అనేక జన్మలున్నట్లు చెప్పుకొనుటయు పొసగదు.

"న జాయతే మ్రియతే వా విపశ్చిత్" ఇత్యాదిని చెప్పఁబడిన జన్మమరణ రాహిత్యము శ్రీకృష్ణునకు కలదనుటయు సరిపడదు.

ఇత్యాది ఉపపత్తులవలన- భగవద్గీత-శివపరమని- నిర్ధారింపనగును. ఇందువలననే "దర్శయామాస పార్థాయ-పరమం రూపమైశ్వరమ్" శ్రీకృష్ణుఁడు విశ్వరూపమును చూపెట్టు సందర్భమున "పార్థునకు ఈశ్వర సంబంధము ఉత్కృష్టంబునగు రూపమును చూపెట్టె" నని చెప్పుటయు సంగతంబగుచున్నయది.

అట్లు కాదందురేని "ద్రష్టుమిచ్ఛామి తే రూప-మైశ్వరం పురుషోత్తమ!"

"పురుషోత్తమా! ఈశ్వరసంబంధమైన నీవు చూపెట్టు విశ్వరూపమును చూడగోరుచున్నా" నని అర్జునుఁడు ప్రశ్నించుటయు విరోధించును.

శంక- "బ్రహ్మాణ మీశం కమలాసనస్థం- ఋషీంశ్చ దివ్యా

నురగాంశ్చ సర్వాన్"అనుచో ఈశశబ్దవాచ్యుఁడగు శివుడు విశ్వరూప మధ్యగతుఁడని చెప్పుటచే–శివుఁడు పరమాత్మ గాక– విష్ణువిభూతిలో చేరినవాడని వ్యక్తమగుచున్నది గదా!

సమాధానము: ఇఁట ఈశశబ్దమును బ్రహ్మశబ్దమునకు విశేషణముఁజేసి "జగత్తు నవాంతరముగ శాసించునట్టి కమలాసనము పై ఆసీనుఁడైనట్టి బ్రహ్మదేవుని విశ్వరూపమునందు పార్థుఁడు గాంచె" నని సమన్వయముఁజేయుట సముచితంబగునని తెలియవలెను. ఒకవేళ ఈశశబ్దమునకు శివుడను నర్థముఁ జెప్పినచో "కమలాసనస్థం, బ్రహ్మాణం"అను విశేషణ విశేష్యముల మధ్య మరియొక విశేష్యమగు ఈశశబ్దమును జొప్పించినచో "కమలాసనస్థం బ్రహ్మాణం ఈశం" అనుదూరాన్వయ దోషము సంభవించును.

ఇట్లు ఉపపత్తులనేకములుండుటచే భగవద్గీతయందు-శ్రీకృష్ణుడు ఉపాసకుడుగాను, శివుడు ఉపాస్యుడుగానుందురని విదితమైనది. ఇందువలననే ఛాందోగ్యమున-తృతీయపాఠకమునందు-సప్తదశఖండమున "తదేతత్ ఘోర అంగిరసః- కృష్ణాయ దేవకీపుత్రాయుక్త్వోవాచ– అపిపాస ఏవ స బభూవ" ఘోరుడగు అంగిరసమహర్షి-దేవకీ తనయుడైన శ్రీకృష్ణునకు ఈశ్వరీయజ్ఞానమును ప్రబోధించెను"అను వాక్యమున శ్రీకృష్ణుడు అంగిరసుని శిష్యుడని చెప్పుట-సంగతంబగుచున్నయది.

మరియు నీ భగవద్గీతలోని "మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్? అను వచనమునందుగల "మయా అను అస్మచ్ఛబ్దము- దిగువ చూపబడిన సందర్భముఁబట్టియు అంతర్యామి పదమగునని నిర్ణయింపవచ్చును.

మహాభారతమున–ద్రోణపర్వమునందు వేదవ్యాసుఁగూర్చి

శ్లో॥ సంగ్రామే న్యహనం శత్రూన్-శరౌఘై ర్విమలై రహం।
అగ్రతో లక్షయేయం తం-పురుషం పావకప్రభమ్॥

జ్వలంతం శూలముద్యమ్య-యాం దిశం ప్రతిపద్యతే।
తస్యాం దిశి విశీర్యంతే-శత్రవో మే మహామునే?॥

తేన భగ్నా నరీన్ సర్వాన్-మద్భగ్నాన్ మన్యతే జనః।
భగవం స్త్వం సమాచక్ష్వ-కో వై స పురుషోత్తమః?॥
శూలపాణి ర్మయా దృష్ట-స్తేజసా సూర్యసన్నిభః।

న పద్భ్యాం స్పృశతే భూమిం—న చ శూలం విముంచతి॥
శూలా చ్ఛూలసహస్రాణి-నిపేతు స్తస్య తేజసా॥

"కదనమున స్వచ్ఛములైన బాణములతో పగతుఱఁదునుమాడు చుండగా-నా రథముముందు అగ్నిఁబోలిన ఒకానొక పురుషునిఁగాంచితిని. మండుచున్న త్రిశూలమునులేపి ఆ పురుషుడు వెళ్ళు దిశయందు నా శత్రువులు మడియుచుండిరి. ఆ మహామహునిచే సంహరింపఁబడిన శత్రువులందరు నాచే చంపబడుచున్నారని- ప్రేక్షకులు భావించుచుండిరి. అట్టి పురుషోత్తముఁడెవరో, భగవానుడా! తెలుపుము! తేజస్సుచే సూర్యునితో సమానుఁడగు శూలపాణి నవలోకించితిని. ఆ మహాపురుషుఁడు-పాదములచే భూమి నంటనివాడై—త్రిశూలమును విడువకుండెను. అతని మహిమవలన నొక్క-త్రిశూలమునుండి వేల కొలది త్రిశూలములు ఆవిర్భవించి- శత్రువులపై పడుచుండెడివి" అని అర్జునుఁడు ప్రశ్నింపగా—సాత్యవతేయుఁడు-

శ్లో॥ ఈశానం వరదం పార్థ!-దృష్టవానసి శంకరం।
తం గచ్ఛ శరణం దేవం-వరదం భువనేశ్వరమ్॥

"పార్థా! వరదుఁడు ఈశానుఁడు నగు శంకరు నవలోకించితివి. అట్టి వరదుఁడైన భువనేశ్వరుని శరణము నొందుము!" ఇత్యాది మహాభారతగత వచస్సులతో—తదంతర్గతమగు భగవద్గీత యందు శివుఁడే ప్రతిపాదింపఁబడినవాడని—స్పష్టమగుచున్నయది.

శ్లో॥ "అజోఽపి సన్నవ్యయాత్మా-భూతానా మీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వా మవష్టభ్య-సంభవామ్యాత్మమాయయా॥

జన్మ లేనివాడు, నిత్యస్వరూపుఁడు ప్రాణిప్రభువునైనను-నా మాయా శక్తివలన ప్రకృతి నధిష్ఠించి జన్మించువాడను" అనుచో వాసుదేవునకు బ్రహ్మలక్షణము వ్యవహరింపఁబడినది గదా!

ఉత్తరము: శ్రీకృష్ణుని మూలరూపమగు మహావిష్ణువు-ఉమాశక్త్యంశమగుటచే- బ్రహ్మలక్షణము ఉపపన్నమైనను అంతమాత్రమున- ఈశ్వరాది అసాధారణ అభిధానముల వలన సిద్ధించు శివపరత్వమునకు భంగము వాటిల్లనేరదని తెలియవలెను.

అశ్వమేధపర్వమునందు ఉదంకునకు చూపిన విశ్వరూపము విష్ణుప్రదర్శితమగుటచే వైష్ణవమని వ్యవహరింపఁబడినంత మాత్రమున ఈశ్వరునిది విశ్వరూపము కాదనుటకు అవకాశము లేదు-

"ఈశ్వరోపాసనచే సాధింపఁబడినందున ఐశ్వరమనియు విష్ణువుచే ప్రదర్శింపఁబడినందున-వైష్ణవమనియు నిర్వచనము. మరియు "తమేవ శరణం గచ్ఛ" అని వాసుదేవుఁడాదేశింపగా- "నీవెవరిని శరణము నొందువాడవు? అని అర్జునుఁడు ప్రశ్నించునని భావించి "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" అని శ్రీకృష్ణుడు నుడువగా- "శరణము నొందఁదగిన పురుషుఁడెట్టివాడు? అనుప్రశ్నకు "ఉత్తమః పురుషస్త్వన్యః- పరమాత్మేత్యుదాహృతః-యో లోకత్రయ మావిశ్య

బిభర్త్యవ్యయ ఈశ్వరః" "లోకత్రయముఁ బ్రవేశించి భరించు ఈశ్వరుఁడు— నాకంటె వేరైన ఉత్తమపురుషుఁడుగా పరమాత్మగా నుదాహరింపఁబడుచున్నవాడు." అను సమాధానము చెప్పఁబడినందున నీ కనఁబడు శరీరియగు గీతాప్రవక్తకన్న వేరైనవాడే పరమాత్మ యని తేటపడినది.

చివరన కౌంతేయుఁడు "స్థితోఽస్మి గతసందేహః-కరిష్యే వచనం తవ" "సంశయము లేనివాడనైతిని నీ మాట పాటింతు"నని అర్జునుఁడు యావజ్జీవము శివునినే పూజించెననియు, మాధవునెప్పుడు నారాధింపలేదనియు మహాభారతమున వ్రాయఁబడినది. మరియు "కరిష్యే వచనం తవ" అను అర్జునుని అంగీకారము యుద్ధవిషయకము కాదని "మన్మనా భవ! మద్భక్తో-మద్యాజీ మాం నమస్కురు" "సర్వధర్మాన్ పరిత్యజ్య- మామేకం శరణం వ్రజ" ఇత్యాది వాక్యములవలన విశదమగుచున్నయది.

శంక- గీతలోని అస్మచ్ఛబ్దము-అంతర్యామిపరమనుట-గౌరవ దోషజుష్టమగుటచే-గీతాప్రయుక్తసమస్తశబ్దవాచ్యుఁడగు శ్రీకృష్ణుఁడే గీతాప్రతిపాద్యుఁడని నిరూపింపనగును గదా!

సమాధానము: గీతలోని అస్మచ్ఛబ్దము అంతర్యామిపరమని పరులు అవశ్యము అంగీకరింపవలసినదేను, ఒకవేళ కాదనినచో— భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు మహావిష్ణువుయొక్క- ఒకానొకవెంట్రుకఁ దగు అంశమని-మహాభారతమునందే సముల్లేఖింపఁబడినందున-మహావిష్ణువే సర్వాంతర్యామియని పరులు అంగీకరించుటచేతను "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" అనుచో గల సర్వప్రాణి హృదయవర్తిత్వము— విష్ణుకేశాంశమైన-శ్రీకృష్ణునకు ఉపపన్నము కాజాలదు. మరియు దృశ్యమానశరీరుఁడగు శ్రీకృష్ణుఁడు-సర్వాంతర్యామియని వర్ణించుటయు సముచితము కాదు.

పరమాత్మయొక్క విభూతులను నిర్దేశించు సందర్భమున "వృష్ణీనాం వాసుదేవోఽస్మి" "యాదవులలో వాసుదేవుడను" అని చెప్పఁబడుటచే- కనులకు గోచరించువాడే పరమాత్మయని అంగీకరించినదో తానే తన విభూతిలో చేరుట- సరిపడదు గదా!

అస్మచ్ఛబ్దము అంతర్యామిపరమని అంగీకరించి భగవద్గీత విష్ణుపరమనునెడ —విరోధములను చూపుచున్నాము.

1. ఈశ్వరాది పదములకు రూఢ్యర్థమును విడనాడి- యౌగికార్థ ప్రతిపాదనముతో విష్ణుపరత్వము నంగీకరించుట- ప్రథమ విరోధము.

2. అథర్వశిఖ మొదలగు శ్రుతులలో నిరూపింపఁబడిన శివపారమ్యము నంగీకరింపకుండుట-ద్వితీయ విరోధము.

3. కూర్మమహాపురాణము ప్రమాణము కాదనుట-తృతీయవిరోధము.

4. ప్రస్తుత మహాభారతములోని పరమేశ్వరపారమ్యమును పరిగణింపకుండుట-చతుర్థవిరోధము.

5. గీత నాకర్ణించిన అర్జునుని శివభక్తిని పాటింపకుండుట-పంచమ విరోధము. ఇత్యాది విరోధములుండుటఁజేసి-భగవద్గీత-విష్ణుపరమని చెప్పరాదు. ఇంతియేగాక-మహాభారతమునందు మహాభారతశేషమగు హరివంశమునందును-శ్రీకృష్ణుడు శివు నారాధించినవాడని- పెక్కుచోట్ల చెప్పబడినందున, శ్రీకృష్ణుడు-తన కుమారునకు పరమేశ్వరుని సాంబనామమును పెట్టుటచేతను, భగవానుఁడగు వాసుదేవుఁడు శివభక్తుఁడని నిర్ణయించుటవలనను భక్తులందరిచే శివుఁడే ఉపాసింపఁదగినవాడని అవగతమగుచున్నయది.

శ్రీమద్రామాయణాది ఉద్గ్రంథములను పరిశీలింపగా శివసార మ్యమే స్పష్టమగునని-పూర్వము ఇందు నిరూపింపఁబడినది.

ఇట్లు చెప్పుటచే-అధ్యాత్మ ఆనంద రామాయణాదులలో-శివుడు శ్రీరామభక్తుఁడని వ్రాయఁబడిన అంశము కల్పితమనియు, అట్టి గ్రంథములు ధూర్తజనవిరచితములై ప్రత్యక్ష వేదమునకు రామాయణ మహాభారతాది గ్రంథములకును విరుద్ధములైనవని విదితమైనది.

ప్రశ్న: మీ ప్రతిపాదనమువలన సమర్థనమువలనను శివుఁడే విశ్వాధికుఁడనియు విశ్వసేవ్యుఁడనియు విదితమైనందున-విష్ణుపురాణ ములయందు వర్ణింపఁబడిన నారాయణుఁడు-సర్వాధికుఁడు సర్వ సేవ్యుఁడను సంశయమునకు అవకాశము లేనట్లేనా?

ఉత్తరము: విష్ణువు-శివోపాసకుఁడను సంశయము-శ్రుతి స్మృతుల యందు మహాభారతాదులయందుమ ప్రసిద్ధమగుటచే-విష్ణువు పర మాత్మ యను వ్యవహారము-పరమేశ్వరుని నిరంతరము తాదాత్మ్యము. ముతో భావించుటవలన నేర్పడినదని చెప్పవచ్చును.

అట్లు కానిచో-

"ఏక ఏవ మహావిష్ణు-శ్శివజ్ఞానమహోదధిః" అను సూతసంహితా వాక్యము మరియు "వ్యాఖ్యాతుం దేవదేవస్య శక్తో నామాన్యశేషతః-ఋతే నారాయణాత్పుత్ర-శంఖచక్రాగదాధరాత్" "మహాదేవునినామ ధేయముల నన్నిటిని వివరించుటకు-శంఖచక్రగదాధరుఁడగు నారాయణుఁడే సమర్థుఁడు. తదితరుఁడెవడును శివమహిమనుపూర్తిగా వివరింపఁజాలడు" అను ఆనుశాసనిక వచస్సులు వ్యర్థములగును.

ఇంతియే గాక. ముముక్షువు-జన్మజరామృత్యువులు లేనట్టి శివు నినే ఉపాసించినచో శాశ్వతపదము లభించును. కాని జన్మమృత్యు వులు గల హరిబ్రహ్మాద్యమరుల నుపాసించినచో కామ్యములు

మాత్రము సిద్ధించుననియు, "ఒకానొక యాచకుఁడు- శ్రీమంతుని యాచించునుగాని మరియొక భిక్షుకు నాశ్రయింపడు" అను న్యాయము ఇఁట పరిగ్రాహ్యమనియు తెలియవలెను.

"ఏకో విష్ణు ర్మహద్భూతం-పృథక్ భూతాన్యనేకశః"

విష్ణువు- గొప్ప ప్రాణియై ముఖ్యుఁడు కాగా జీవాత్మలనేకులు వేరైన ప్రాణులగుదురు. అను సూక్తి- నారాయణుఁడు "పురుషాణాం ఉత్తమః" అను వ్యుత్పత్తి ననుసరించి - జీవసమష్టిస్వరూపుఁడని నిరూపించుట- పై యంశమును బలపఱుచుచున్నయది.

విష్ణువు- మహాభూతము కాగా- భూతపతి-శివుఁడగునని "ఈశ్వర స్సర్వ భూతానాం" ఇత్యాది శ్రుతియందు వినఁబడుదే గాక పర బ్రహ్మత్వము శివునకే కలదని "బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మ" అనువాక్యము ధృవీకరించినది.

ప్రశ్న: శివుఁడు విశ్వాధికుఁడనునెడ-హరిహరులు సమానులు అను వ్యవహారము భంగపడును గదా!

ఉత్తరము: హరిహరసామ్యమునకు ప్రమాణములున్నచో అంగీక రింపవచ్చును. హరిహరా భేదము సంధ్యావందనములో కల్పితంబని తోచెడిని. ఎందుకనఁగా? "పరాత్ పరతరో బ్రహ్మ-తత్పరాత్ పర తో హరిః-తత్పరాత్ పరతో హీశః" "బ్రహ్మదేవుని కన్న శ్రేష్ఠుఁడు శ్రీహరికాగా- శ్రీహరిని మించినవాడు మహేశ్వరుఁడగును" అను శివ సంకల్పోపనిషద్వాక్యము (తత్పరాత్ పరతోఽధీశం అనునది శివ పారమ్య అసహపరులచే కల్పితము) "విశ్వాధికో రుద్రో మహర్షిః" ఇత్యాద్యుపనిష ద్వచస్సులును "మహేశ్వరుఁడు-హరిబ్రహ్మలకంటె నధికుఁడు" "శివుఁడు విశ్వాధికుఁడు" అను యంశమును ప్రతిపాదిం చుటఁజేసి- తద్విరుద్ధమగు హరిహరసామ్యాదివాదము-పరిగ్రాహ్యము

కాదని తెలియుచున్నది. మరియు "మిణుగురు పురుగు- సూర్యునితో సమానమగునేని శ్రీహరి-మహేశ్వరునితో సమానుఁడగును. కొందరు కేవలాద్వైతులు బిడాల (మార్జాల) ప్రతిములై - "హరిబ్రహ్మాదులు శివునితో సమానులు అని భావింతురు.''అను సూతసంహితావచస్సులు హరిహరసామ్యవాదమును నిరాకరించినవి. ఇంతియేగాక-

"యే మాం విష్ణ్వాదిభి స్తుల్యం-యే త్వాం లక్ష్మ్యాదిశక్తిభిః
గురుం యే ప్రకృతే స్తుల్యం-సంస్మరంత్యల్పబుద్ధయః
తేషాం పాపాని నశ్యంతి-శివరాత్రి ప్రజాగరాత్॥

పార్వతీ! నన్ను విష్ణ్వాదులతో సమానునిగా, నిన్ను లక్ష్మీదేవి మొదలగువారితో సమానురాలుగా, దీక్షాగురువును సామాన్యమానవునిగా భావించు అల్పబుద్ధుల పాపములు- మహాశివరాత్రిని జాగరణఁ జేసినందువలన_హరించును. అని శివమహాపురాణమునందు_హరిహరసామ్యవాదమునకు ప్రాయశ్చిత్తము విధింపఁబడుట- గమనార్హము.

హరిహరాభేదవాదమైతేనో- నారాయణుడు_ ఉమాశక్త్యంశసంభూతుఁడని కొన్నిచోట్ల వినంబడుటచే శక్తిశక్తిమంతులకు అభేదము అను దృష్టిని ఆ వాదము సంగతమైనను-శ్రుతిస్మృతీహాసపురాణాదులయందు ప్రతిపాదింపఁబడిన "పరమేశ్వరుఁడు సర్వోపాస్యుఁడు''అను నంశమునకు ఎట్టిహాని లేదు. హరిహరాభేదమనఁగా-హరిహరులు ఒకే వ్యక్తిగా_మహేశ్వరుని పదమూడవ లీలారూపంబగునని "త్రయోదశం హరే రర్ధ-మర్ధనారీ చతుర్దశమ్" అనువాతూలాగమసూక్తిఁ బట్టి- అవగతమగును. "శివస్య హృదయం విష్ణుః-విష్ణోశ్చహృదయం శివః" ఇత్యాదికల్పిత పాఠమున- అన్యోన్యాశ్రయదోషము తారసిల్లుటచే హరిహరాభేదవాదము బహుప్రమాణసమ్మతముకాకున్నయది.

"శ్రుతిభ్రష్టులై వైదికప్రాయశ్చిత్తమునకు భయపడినవారుతంత్రము నాశ్రయించి- కాలక్రమమున శ్రుత్యధికారమును పొందవలె" నను ప్రమాణము ననుసరించి-పాంచరాత్రాదితంత్రప్రోక్తరీత్యానారాయణు నుపాసించి తరింపవలెననుటతో పాంచరాత్రాదితంత్రములు-సార్థకములగుచున్నవి.

కొందరు-అంబికను, మరికొందరు విష్ణువును, ఇంకకొందరు గణపతిని, తద్భిన్నులు షణ్ముఖుని, మరికొందరు ఆదిత్యుని పరదైవముగా భావించి పూజించువారు- ఆయా దేవతయొక్క పారమ్యమును నిరూపించునట్టి వాదగ్రంథములను రచించిరి. ఐనను అంబిక-పరమేశ్వరుని పత్నికాగా- విష్ణువు-శక్త్యంశసంభవుఁడగుటఁజేసి- గణేశషణ్ముఖులు-పరమేశ్వరుని తనయులగుటచేతను ఆదిత్యుఁడు పరమేశ్వరుని నేత్రమగుటవలనను-తత్తత్పరత్వమును ప్రతిపాదించు వాదములచే-పరమేశ్వరుని పరత్వమే సాధింపఁబడినది. ఇందువలన గూడ-శివాద్వైతమే వేదపథముగా దృఢముగా నిర్ణయింపఁబడినదని స్పష్టమైనది.

వేదపథమున-వైష్ణవపథ ప్రతిషేధము సమాప్తము.

---

శ్రీ మహాగణాధిపతిని ప్రార్థించి-శ్రీదక్షిణామూర్తి ప్రేరితుఁడనై వ్యాసపథమున- మహోపాధ్యాయ శివయోగి-శ్రీ ముడిగొండ-నాగలింగ శాస్త్రిలచే వ్రాయఁబడిన రామానుజపథ ప్రతిషేధమును యథామతి అనువదించు-శైవనందినీ-శాంకరీయ వ్యాఖ్య-ఇది సమర్థింపఁబడుచున్నయది.

## వ్యాసపథమున

# రామానుజపథప్రతిషేధము

శ్రీ భాష్యమున-శుద్ధాద్వైతమును ఖండించిన-రామానుజస్వామి శ్రీకంఠభాష్యమునుండి విశిష్టాద్వైతమును పరిగ్రహించి-విశిష్టాద్వైత ప్రథమాచార్యులైన శ్రీకంఠభగవత్పాదుల నామధేయమునుగూడ నుదహరింపకుండుట-చోద్యమైనది.

"శ్రీరామానుజుని కాలమున-శ్రీకంఠభాష్యము లేకుండెనని" భావింపరాదు. శ్రీభాష్యకర్త-తన గ్రంథమున-కేవలాద్వైతమును నిషేధించుటచేతను, శుద్ధాద్వైతభాష్యకర్త- శ్రీకంఠభాష్యగతమగు విశిష్టాద్వైతమును నిరాకరించి నిర్విశేషత్వమును ప్రతిపాదించుటవలనను-శ్రీకంఠభాష్యము-శాంకరభాష్యమునకన్న ప్రాచీనమని అవగతమగుచున్నందున-రామానుజుని శ్రీ భాష్యము- కేవలాద్వైతభాష్యము యొక్క అనంతరకాలీనమని-తేటపడుచున్నయది.

అందువలన-కేవలాద్వైతభాష్యాదులకన్న పూర్వమగు శ్రీకంఠభాష్యమును రామానుజుఁడు చదువలేదని చెప్పుట-అంగీకార్యము కాదని తెలియవలెను.

బోధాయనవృత్తి ననుసరించి శ్రీభాష్యము రచింపఁబడినదనుటకు గూడ వీలులేదు. ఎందుకనఁగా? భగవానుఁడగు బోధాయనుఁడు మహాన్యాస రుద్రయాగాది కృతులచే-మహాశైవుడుగా పరిగణింపఁబడినందున బోధాయనకృతియగువృత్తిని పురస్కరించినచో-పాంచరాత్రాగమసిద్ధాంతము నుద్ధరింపవలెనను నిజమనోరథము సిద్ధింపదని

తంచిన రామానుజుఁడు బోధాయనవృత్తినుండిగూడ సవిశేషవాద మాత్రమును పరిగ్రహించుటఁజూడగా- రామానుజుడు-విశిష్టాద్వైత మూలాచార్యుఁడు కాదని బోధపడును.

విష్ణుయాగ కల్పమును రచించిన వైఖానసుఁడు-విష్ణుపారమ్య మంత్రములు-వేదములలో లేనందున "కిమిత్తే విష్ణో! సుమతిం భజా మహే యదన్యరూపస్సమిదే బభూవ" అను మంత్రమునకు అర్థమును వివరించుట-పరిహాసాస్పదమైనను-అందు విష్ణునామము మాత్రము ఉండుటచే-వైఖానసుఁడు- ప్రాయశః-విష్ణుయాగకల్పమున పరిగ్ర హింప వలసివచ్చెను.

"కిమిత్తే విష్ణో" అను మంత్రముఁదగు వాస్తవికార్థమును వివ రించుచున్నాము. ఎట్లనఁగా?

వసిష్ఠమహాముని శిష్యుడు శివభక్తుఁడునగు ఒకానొక రాక్షసునిచే పలుతడవలు పరాజితుఁడైన మహావిష్ణువు- ఆ రాక్షసుని జయింప నుపాయము నాలోచించి- తాను శివరూపధరుఁడై పోరాడుటకు పిలువగా నా రక్కసుఁడు తెలివిలేనివాడగుటనే- ఆ మాయావిని నిజమైన శివుఁడని భావించి-శివునిచే ప్రసాదింపఁబడిన వరము యొక్క ప్రభావముచే అంతట విజయము నందుటఁజేసి భగవానుఁ డైన శివునితో నెట్లు తలపడవలెనని భావించి స్వయముగా ప్రాణము లను విడనాడెను.

అట్టితటి-భగవానుఁడైన వసిష్ఠమహర్షి-విష్ణుచేష్టితమును గుర్తించి విష్ణువు నుద్దేశించి "హే విష్ణో! రక్కసుని నిజరూపముతో జయింపఁ జాలనివాడవై శివరూపముఁదాల్చి యుద్ధమునకై కడంగితివి. గాన కపటోపాయము గల నీ సుబుద్ధిని ప్రశంసించుచున్నాము" అని వ్యాజస్తుతి నొనర్చెను.

ఇది వాస్తవికార్థము.

ఈ మంత్రమే వైష్ణవ సంస్కారములన్నిటియందును తఱచుగా గ్రహింపఁబడుచున్నది.

ఇంతియే గాక

"శంభో" అను ఆహ్వానము గల మంత్రమును విష్వక్సేనుని ఆవాహనమునందు వైష్ణవులు-అవశముగ - వినియోగించుచుండుట గమనార్హమగుచున్నయది.

ఐన నీ మంత్రముఁదగు అర్థమును వివరించినచో సుధీమంతులు పరిహసింతురని భావించి- "దివ్యో దేవ ఏకో నారాయణః" అను సౌభాలవాక్యమునే శ్రీ భాష్యకర్త-ప్రతి అధికరణమునందు ఉదాహరింపవలసివచ్చెను. శ్రీకంఠీయ భాష్యమునందైతేనో-శివపారమ్య ప్రతిపాకములగు వైదికమంత్రములు వేలకొలది- ప్రతి అధికరణమునందు ఉదాహరింపఁబడుటను గాననగును. అందువలన-శ్రీభాష్యకర్త యొక్క చౌర్యము అనివార్యమైనది.

శ్రీకంఠ రామానుజభాష్యములను పరిశీలించినచో- పూర్వోత్తర మీమాంసా శాస్త్రముల ఐక్యము. కర్మజ్ఞాన సముచ్చయము సవిశేష బ్రహ్మనిరూపణము మొదలగు సంశములతో సిద్ధాంతము ఒకటేనని- విదితమగును. శ్రీకంఠభాష్యము పరమప్రాచీనమని-శ్రీమదప్పయ దీక్షితేంద్రాదులు అంగీకరించుటచే-అర్వాచీనమగు శ్రీ భాష్యమున- శ్రీకంఠభాష్యగతాంశములే స్వీకరింపఁబడినవని నిర్ణయింపవచ్చును.

బ్రహ్మమీమాంసాశాస్త్రము విష్ణుపరమని శ్రీ భాష్యకర్త -నిరూపింప సమకట్టినను-అట్టి నిరూపణము సరి కాజాలదు.

ఎట్లనఁగా ?

"శబ్దాదేవ ప్రమితః" అను సూత్రముఁదగు ప్రమితాధికరణ మున శ్రీభాష్యమునందు- "అంగుష్ఠమాత్రః పురుషః" ఇత్యాది కఠ వల్లీగతమును విషయవాక్యముగా పరిగ్రహించి- "అంగుష్ఠమాత్రుఁడు జీవాత్మ" యను పూర్వపక్షమును ఖండించి- "ఈశానో భూతభవ్యస్య" అను వాక్యమున గల "భూతభవ్య జగత్తును శాసించుట" యను లక్ష ణము ననుసరించి - "అంగుష్ఠమాత్రుఁడు పరమాత్మ" యని సిద్ధాం తము చేయఁబడినది.

ఐతే "శబ్దాదేవ ప్రమితః" అను సూత్రమున గల "శబ్దాదేవ" అను దానికి- "ఈశానశబ్ద మువలననే" అను నర్థము సమంజసము కాగా "ఈశానో భూతభవ్యస్య అను వాక్యమువలన" అను నర్థము ఉపయుక్తము కాజాలదు.

"ఈశ్వర శ్శర్వ ఈశానః" "ఈశాన శ్శశిశేఖరః" ఇత్యాది నిఘంటువులఁబట్టి ఈశానశబ్దము-పరమేశ్వరునందే యోగముచేతను రూఢివలనను అసాధారణమగుచున్నందున- విష్ణువునందు యోగముచే సిద్ధించినను రూఢము కానందునను కేవలయోగమునకంటె - యోగ రూఢి శక్తిద్వయ సంపన్నముగా యోగరూఢము ప్రబలమగుచున్న యది.

ప్రశ్న : "ఈశానః ప్రాణదః ప్రాణః" అని విష్ణుసహస్రనామ స్తోత్రమున ఈశానశబ్ద ముండుటచే నయ్యది విష్ణుపరమని చెప్ప వచ్చును గదా!

ఉత్తరము : "సహస్రనామములతో నుతించుచు" అని ఉపక్రమ మున- "విశ్వం విష్ణు" రిత్యాదులలో దేవతాన్తర నామములను పరి గ్రహించుటచే - ఈశానాది శబ్దములకు రూఢిశక్తి యుండదని బోధ పడుచున్న యది. అట్లు కాదందురేని-మహాభారతమున లింగ ఆదిత్య

మహాపురాణముల యందును పఠింపఁబడిన శివసహస్రనామములలో విష్ణునామములు-విష్ణువాచకములు కావలసివచ్చును. అట్లగుచో సహస్ర నామములు-అనేక దేవతానామములు గలవగుటచే ఏకార్థ నిశ్చయము లేనివగును. ఈశానాది శబ్దములతో విష్ణువును ప్రశంసించుట "దీపం జ్యోతిః పరంబ్రహ్మ" అను దానివలె-అర్థవాదమగును. ఇంతియే గాక హరివంశమున- కైలాసయాత్రయందు-

శ్లో॥ నామాని తవ గోవింద!-యాని లోకే మహాంతి చ।
తాన్యేవ మమ నామాని-నాత్ర కార్యా విచారణా॥

"గోవిందా! లోకమున శ్రేష్ఠములుగా చెప్పఁబడు నీ నామధేయములన్నియు నా నామదేయములుగానే పరిగణింపఁబడును. ఇవ్విషయమై సంశయింప నవసరములేదు" అని శ్రీకృష్ణునిఁగూర్చి శివుఁడు చెప్పినందున-విష్ణువుయొక్కయు ఇతర దేవతలయొక్కయు ముఖ్యములైన నామధేయములు - శివునకు చెల్లును గాన విష్ణుసహస్రనామగతమైన ఈశాన శబ్దము - గౌణముగా నారాయణుని చెప్పినను అభిధానకోశ (నిఘంటు) ప్రాబల్యముచే- ముఖ్యముగా- శివవాచకంబగునని తెలియవలెను.

ప్రశ్న : ఓయీ ! ఈ ప్రమితాధికరణము మాత్రము మాకు ప్రతికూలమైనను ఇతర అధికరణములన్నియు నారాయణపరత్వము ను సాధించునవగుటచే- బ్రహ్మమీమాంసా శాస్త్రము-మాకు అనుకూలించునని నిరూపింపవచ్చును గదా!

ఉత్తరము : పరమేశ్వరుని అసాధారణాభిధానము ఈయధికరణమునందే విశేషించి బ్రహ్మమును నిర్ణయించుచున్నందున-ఇతర అధికరణములలో నెద్దానియందును బ్రహ్మనిర్ణాయక శబ్దము ప్రత్యే

కించి లేకుండుటవలనను - సామాన్యముగా బ్రహ్మముఁ దెలుపునట్టి అధికరణములన్నిటికి బ్రహ్మనిర్ణాయకమగు ఈశాన శబ్దము- ప్రమితాధికరణమున విషయవాక్యములో నున్నందునను భాగవతన్యాయముఁబట్టి- బ్రహ్మము శివుఁడేనని సమన్వయము ఏర్పడుచున్నయది.

శ్రీకంఠభాష్యమున — లింగభూయస్త్వాధికరణమునందు — పూర్వము విద్యలన్నిటియందు ఉపాస్యముగా చెప్పఁబడిన బ్రహ్మము విశేషించి—నిర్ధారింపఁబడినది. ఎట్లనఁగా?

"సర్వో వై రుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు"

"పురుషో వై రుద్ర స్తన్మహో నమః"

"విశ్వంభూతం భువనం చిత్రం-బహుధా జాతం జాయమానం చ యత్ - సర్వోహ్యేషరుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు"

"కద్రుద్రాయ ప్రచేతసే - మీఢుష్టమాయ తవ్యసే-వోచేమ శంతమగ్ం హృదే - సర్వోహ్యేషరుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు"

"నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ హిరణ్యపతయేఽంబికాపతయ ఉమాపతయే పశుపతయే నమోనమః"

"రుద్రుఁడు-చరాచర జగదంతర్యామియగు మహానారాయణము పరబ్రహ్మము—అట్టి రుద్రునకు నమస్కారము''

"రుద్రుఁడు - పరిపూర్ణుఁడగుటచే, శరీరము అను పట్టణమున—

జీవాత్మతో సహ శయనించువాడగుటచే - పురుషుఁడనఁబడుఁగును. అట్టి మహాతేజోమయునకు అభివాదము.''

"నానావిధములచే విచిత్రమైన-అనేకరీతుల జన్మించినది, సృష్టింపఁబడినదియు నగు విశ్వమంతయు - శివుఁడంతర్యామిగా కలదేను. సూక్ష్మాతిసూక్ష్మ జ్యోతిర్లింగ (భావలింగ)ముగ సర్వాంతర్యామిగ నుండు- సంసార రోగమును పోగొట్టు-రుద్రునకు ప్రణామము''

## రుద్ర శబ్దార్థములు-

1. "రుదం = అజ్ఞానమును, ద్రావయతీతి = నివారించును గాన రుద్రుఁడు.''

2. "రుదం = వేదమును, రాతి = బ్రహ్మదేవున కొసఁగువాడు- రుద్రుఁడు.''

3. "రుదం = ప్రణవఘటిత శివషడక్షర మంత్రానుష్ఠానమును (కలుగఁజేసి) రాతి = తన రూపము ననుగ్రహించువాడు- రుద్రుఁడు.''

4. "రుదం = ఇహపరసుఖమును, రాతి=ఇచ్చువాడు-రుద్రుఁడు".

5. "రుదం = ప్రారబ్ధగత దుఃఖానుభవమును, రాతి=తగ్గించుటతో సహింపఁజేయువాడు-రుద్రుఁడు.''

## కద్రుద్రాయ మంత్రార్థము-

''కద్రుద్రాయ = సృష్టిఁజేయు రుద్రుఁడు, ప్రచేతసే = సర్వజ్ఞుఁడు, మీఢుష్టమాయ = వర్షాదులచే నేలఁదడుపుచు ప్రాణులను తృప్తిపఱచువాడు, తవ్యసే = తపఃఫలస్వరూపుడు, హృదే = మనో

హార దివ్యమంగళవిగ్రహుఁడు నగు మహేశ్వరునికొరకు, శంత మగ్ం = అమృతమువలె ఆనందింపఁజేయు స్తోత్రమును, వోచేమ= పలుకుదుము. సర్వోహ్యేష రుద్రః = ఇట్టి రుద్రుఁడు సర్వాత్మకుఁడై యుండువాడు, తస్మై రు-ద్రాయ నమో అస్తు = అట్టి రుద్రునకు నమస్కారమగు గాక!''

''హిరణ్యబాహవే'' అను మంత్రమున-సువర్ణాభరణములు గల హస్తములు గలవాడనుటలో - శరీరమంతయు సువర్ణమయము-అను నర్థము ఇమిడియున్నది. ''హిరణ్యవర్ణాయ'' సువర్ణకాంతి సమన్విత మైన దివ్యశరీరము గలవాడు, ''హిరణ్యరూపాయ'' శుద్ధ రజతము (వెండిఁ) బోలిన శుద్ధస్ఫటికవర్ణము గల దివ్యరూపము గలవాడు, "హిరణ్యపతయే" హిరణ్యానాం=తేజోమయులగు సూర్యచంద్రాదుల యొక్క, పతయే = ప్రభువు,(లేక) హిరణ్య (ధన)ములకు నధికారి, సర్వైశ్వర్య సంపన్నుఁడని భావము. ''అంబికాపతయే'' త్రిగుణాత్మకయగు మాయ నధిష్ఠించి వశపఱచుకొనువాడు, ''ఉమాపతయే'' ప్రణవస్వరూపిణి యగు చిచ్ఛక్తి యనఁదగు పార్వతీదేవియొక్క భర్త, ''పశుపతయే'' సంసారపాశబద్ధులైన బ్రహ్మవిష్ణ్వాదుల యొక్క ప్రభువు నగు మహాదేవునకు నమోనమః.

ఇతోఽధికమును నా ఉపనిషత్ భాష్యాంధ్రీకరణముఁదగు ద్వితీయ భాగమున 195, 196, 197 పేజీలలో చూడనగును.

పై నుదహరింపఁబడిన శ్రుతివాక్యముల యందు — సర్వోపాస్యుఁడుగాను, ఉమాపతిగాను వినఁబడు పరబ్రహ్మము-విద్యలన్నిటి యందు నుపాస్యంబగుచున్నయది.

శ్రీభాష్యమునందైతేనో- ఈ లింగభూయస్త్వాధికరణమునందు-

సర్వవిద్యోపాస్యత్వలింగములు – స్వపక్షమునకు అనుకూలింపనం దున–లింగశబ్దమునకు – చిహ్నము – అను నర్థముఁ జెప్పఁబడినది. అందువలన–శ్రీభాష్యకర్త– మీమాంసయొక్క మర్యాదను విడనాడి రనియు, పరబ్రహ్మ లక్షణ (లింగ)ములు విష్ణుపరములుగా సమ న్వయముఁ జేయరాలేదనియు వ్యక్తమైనది.

మరియు అంతర్యామ్యధికరణమునందు – శ్రీభాష్యమున "యః పృథివ్యాం తిష్ఠన్" ఇత్యాది వాక్యములలోగల అమృత శబ్దము నుపే క్షించి– "అంతః ప్రవిష్ట శ్శాస్తా జనానాం" ఇత్యాది శ్రుతి వాక్యములు ఆధారముగా–సుబాలోపనిషత్తు నందలి "దివ్యో దేవ ఏకో నారాయణః" అను వాక్యము నుదాహరించి – విష్ణువే సర్వాంతర్యామి యని నిర్ణ యింపఁబడినది.

దీనికి సమాధానమేమనఁగా?

అష్టమూర్తిగా ప్రసిద్ధుఁడైన పరమేశ్వరుఁడే పృథివ్యాదుల నంత ర్యామియై సమస్తమును శాసించువాడని నిరూపించుట – సమంజసం బగును. ప్రసిద్ధ శ్రుతులయందు– నారాయణుఁడు ఉపాస్యుఁడు అని చెప్పఁబడనందున – "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం–త్రిలో చనం నీలకంఠం ప్రశాంతమ్" "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ– పురుషం కృష్ణపింగళం– ఊర్ధ్వరేతం విరూపాక్షమ్" ఇత్యాది ప్రసిద్ధ శ్రుతులయందు పరమేశ్వరుని రూపము అభ్యసింపఁబడుటచే– ఉపని షత్ప్రతిపాద్యుఁడైన పురుషుఁడు – ఉమాసహాయత్వాది లక్షణములు గలవాడని తేటపడుచున్నయది.

ఈశ, కేన, శ్వేతాశ్వతరాద్యుపనిషత్తులు– శివపరములని– వేద పథమునందు నిరూపింపఁబడినది గాన సుబాలోపనిషద్గతమగు నారా యణ శబ్దమునకు శివార్థముఁజెప్పుట–అనివార్యంబగును. ఇట్లు చెప్పుట

వలన అంతర్యామ్యధికరణము గూడ విష్ణుపరము కాదని స్పష్టమైనది.

శివ మృడ శర్వ ఈశ ఈశాన మహేశ్వరాది శబ్దములు శివపరములై "జన్మాద్యస్య యతః" ఇత్యాది అధికరణములలోని జగజ్జన్మాది కారణత్వము మొదలగు లక్షణములఁ జెప్పునవగుటచే-బ్రహ్మమీమాంసాశాస్త్రము-విష్ణుపరమగునని చెప్పనలవిగాదు.

మహాభారతమున - ఉద్యోగపర్వమునందు "మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ" ఇత్యాది శ్లోకమందలి బ్రహ్మపదము-శివ వాచకముగా నిర్ణయింపఁబడుటఁజేసి- మహాభారతమును బ్రహ్మమీమాంసను రచించిన వేదవ్యాసుఁడు ఏకాభిప్రాయము గలవాడగుట-అనివార్యము గాన - బ్రహ్మమీమాంస శివునినే ప్రతిపాదించునదని అంగీకరింపవలెను.

ఇంతియే గాక- ఉభయలింగాధికరణమునందు - సమస్త దోషములు లేనిది, నిఖిలమాంగళ్యగుణములు గలదియు బ్రహ్మంబని ప్రతిపాదించుటచే-అట్టి రెండు లక్షణములు గలదను అర్థము గల శివపదము- పరబ్రహ్మార్థము గలదని చెప్పుట సమంజసంబగును.

"శామ్యంతి అస్మిన్ దోషా ఇతి = శివః"

"శివాని=నిఖిలమాంగళ్య గుణాని(అస్య)సంతీతి=శివః"

"ఈతనియందు దోషములన్నియు శమించును గాన శివుఁడనియు"

"మాంగళ్య గుణములన్నియు ఇతనికి కలవు గాన శివుఁడనియు" శివశబ్దార్థనిర్వచనము ఇఁట గమనార్హము.

ఇట్లు- శివపరముగా భాష్యమును రచించిన శ్రీకంఠాచార్యులకు

వ్యతిరిక్తముగా ప్రవర్తించిన శ్రీభాష్యకర్త - విఫలుఁడైనాడని విదిత మైనది. ఐనను శ్రీరామానుజాచార్యులు-అతి ప్రయాసతో విష్ణుభక్తిని సుస్థిరముఁ గావించుట-ప్రశంసనీయ మైనదని-చెప్పవచ్చును.

రామానుజపథ ప్రతిషేధము-సమాప్తము.

శ్రీ మహాగణాధిపతయే నమః

# మాధ్వపథ ప్రతిషేధము

ప్రశ్న : "యుక్తి యుక్తం వచో గ్రాహ్యమ్" అను న్యాయము ననుసరించి - పరుల మార్గము గూడ సమంజస మైనచో - ఆదరింపఁ దగినది గదా?

ఉత్తరము : మధ్వాచార్యులు- ప్రమాణ సంబంధమైన మర్యాద నుల్లంఘించి- అవలంబించిన మార్గము గ్రాహ్యము కాకున్నది.

ఎందుకనఁగా ?

కమఠ, మాఠర, కౌండరవ్య, కౌండిన్య, మాండవ్యాదులగు అత్యంత అప్రసిద్ధములైన శ్రుతివాక్యముల నుదహరించి - హనుమంతుఁడు, భీమసేనుఁడు, అను వాయుదేవుని అవతారముల తరువాత మూడవ అవతారము తానేనని యుపన్యసించి — తత్ప్రోద్బలకముగా-

"ప్రథమో హనుమా న్నామ-ద్వితీయో భీమసేనకః,
పూర్ణప్రజ్ఞ స్తృతీయస్తు-భగవత్కార్యసాధకాః."

అను స్మృతివచనమును తానే ప్రతిపాదించుటచే "పూర్ణ ప్రజ్ఞుఁడు" అను నామధేయము గల మధ్వాచార్యుని మతము-అంగీకారార్హ మగుట లేదు.

మరియు విష్ణు పారమ్యమును తప్తముద్రాది పరిగ్రహమును పాంచ రాత్రాగమ మాత్ర ప్రామాణ్యమున- ప్రతిపాదించుటలో- రామానుజ మధ్వాచార్యులు సమానులైనను రామానుజునికంటె వేరుగా ఆచార్య పీఠము నలంకరింపఁదలచిన పూర్ణప్రజ్ఞుఁడు - జగత్తునకు పర మాత్మ— కేవల నిమిత్త కారణము, అను నంశమును నిరూపించుట- ప్రసిద్ధ శ్రుతులకు వ్యాససూత్రములకును విరుద్ధమైనది.

ఎట్లనఁగా?

"ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్" అను సూత్రముఁ దగు అధికరణమున- బ్రహ్మము జగత్కారణమగుట ఎట్లు? - అని ఆశంకించి- ప్రకృతిశ్చ - బ్రహ్మము నిమిత్తకారణమే గాక-ఉపా దాన కారణమునగును, ఎందువలననఁగా -ప్రతిజ్ఞా దృష్టాంతానుపరో ధాత్- "యేనాశ్రుతం శ్రుతం భవతి- అమతం మతం భవతి- అవి జ్ఞాతం విజ్ఞాతమ్" "బ్రహ్మముఁ గూర్చి వినినచో సమస్తము వినఁ బడును. బ్రహ్మము ఇష్టమైనచో తదితర స్థూలజగత్తంతయు ఇష్ట మగును. బ్రహ్మము తెలిసినయెడల - బ్రహ్మకార్యమగు ప్రపంచము తెలియును" అను ప్రతిజ్ఞను, మృద్ఘట దృష్టాంతమును ఛాందోగ్యము నందు ప్రతిపాదించుట వలన-అట్లే బృహదారణ్యకమునందు ముండకా ద్యుపనిషత్తులయందును నిరూపించుటఁజేసియు మాధ్వమతము-శ్రుతి సూత్ర విరుద్ధమని వ్యక్తమగుచున్నయది.

ఇట్లైనను పూర్ణప్రజ్ఞుఁడు - కలియుగమున సంభవించు దోష ములఁ బోగొట్టు విష్ణుభక్తిని ప్రచారముఁజేయుట మెప్పుఁబడసినదని భావింప వచ్చును.

శాంకర రామానుజ మధ్వకృత ప్రసిద్ధ భాష్యములను నిరాక రించుటవలన-శ్రీకర, వల్లభ, నింబార్కాదికృత భాష్యములన్నియు ఖండింపఁబడినవని- అర్థాత్-ఏర్పడినది. విస్తారమును శ్రీదీక్షితేంద్ర కృత - మధ్వతంత్రముఖ మర్దనమునందు గాననగును. ఏతావతా- శాంకరాది పథములకంటె పూర్వంబు, "శివ సాయుజ్యమే పరమ ముక్తి" యని నిర్ధారితము, అట్టి నిర్ధారణము శ్రీకంఠపథము ననుస రించినదని నిరూపితము, "శబ్దాదేవ ప్రమితః" ఇత్యాద్యధికరణము లలో "ఈశానశబ్దము వలననే పరమేశ్వరుని నిర్ణయింప నగు"నను నది మొదలగు అర్థము వచ్చునట్లు సర్వాచార్యులచే ప్రతిపాదితంబు నగు శ్రీకంఠీయమే బ్రహ్మపథము కాగలిగినదని-తేటపడినది.

మాధ్వపథ నిషేధము అను
మాధ్వాధ్వ విధ్వంసనము సమాప్తము.

---

వ్యాసపథమున

# కేవలాద్వైత పథ ప్రతిషేధముఁ జెందిన

## పీఠిక

శ్రీకంఠీయ భాష్యమున - లింగధారణవిధి సంక్షేపము లేదని- కొందరు భావించుటచే- ఇద్ది-శ్రౌత (ఆరాధ్య) శైవులకు గ్రాహ్యము కాదను అపోహఁ గూర్చి విచారింతము.

సహకార్యంతర విధ్యధికరణమున - పాశుపత వ్రతధారులకు

ముక్తియే ఫలమని - శ్రీకంఠ భగవత్పాదులు నిరూపించినవారు. అందు లింగధారణానుష్ఠాన ప్రకాశకమంత్రములు ఉదాహరింపఁబడు టచే-శ్రీకంఠీయ భాష్యోక్తమగు పాశుపతవ్రతము - భస్మరుద్రాక్ష శివలింగధారణాత్మకమని- అవగతమగుచున్నయది.

క్రియాసారము ఇవ్విషయమునే సమర్థించుటవలన ప్రాచీన శ్రీకంఠీయ భాష్యములయందు "పాశుపతము - భస్మ రుద్రాక్ష శివ లింగధారణాత్మకమని" యున్నందున - ఆధునిక కోశములయందు లింగధారణము అస్ఫుటముగ నున్నను ఎట్టి క్షతి లేదని తెలియ వలెను.

ఇఁక వసంతోత్సవమున పేరముద్ద (పిడక) పడినట్లు-శివదేవల కుల యొక్క ఆక్రందనము వినఁబడుచున్నది. ఎట్లనఁగా?

భగవాన్ భాష్యకారుఁడు-తమ కులమున జన్మించినవారను దేవల కుల వాదమును పండితులు ఆమోదింతురేని - అవ్విషయమై మాకు ఆగ్రహము లేదు. లోకోత్తరమగు భాష్యమును రచించిన శ్రీకంఠా చార్యులు-దేవలకకులజన్ములనుట - హాస్యాస్పదమగును.

మహాభారతమున - రాజధర్మపర్వమునందు -76వ అధ్యాయ ములో- మరియు స్కాందమునందు - శివదేవలకులు- "తమ్మలులు" అను సంజ్ఞతో వ్యవహరింపఁబడుటను గాన నగును. ఇందువలననే- ఆంధ్రదేశమున...."తంబళులు" అని శివదేవలకులు - వ్యవహరింపఁ బడుచున్నారు. ఇట్లు చెప్పుటవలన - భగవాన్ - భాష్యకారుఁడు-శివ దేవలకవంశ సంజాతుఁడు కాదని తేటపడుటయే గాక లోకారాధ్య కుంజన్ముఁడని విశదమైనది.

భాష్యకారులు - శ్రీకాశేశ్వర క్షేత్రవాసులు-అని దేవలకులు

గూడ నంగీకరించుటఁజేసియు, "కాశేశ్వరము" అను గృహనామ దేయము గల ఆరాధ్యులు ఇక్కాలమునందును పెక్కురు కనుపడు చున్నందునను మా యభిమతమే సమంజసంబని తెలియవలెను.

శ్రీకంఠీయ భాష్యము ప్రాచీనము కాదని కొందరు సంశయించు చుందురు. శంకరవిజయమున-శివపరమైన సూత్రభాష్యమును రచించిన శ్రీకంఠాచార్యులు శంకరాచార్యులతో వాదించినట్లు వ్రాయుటలో శ్రీకంఠుఁడు శంకరుని సమకాలికుఁడని పొడగట్టినను-శ్రీకంఠుఁడు-శంకరుని కన్న పూర్వపువాడని-అర్థాత్-సిద్ధించును.

మరియు శ్రీమదప్పయ దీక్షితేంద్రులు - శివార్కమణిదీపిక యందు-"వ్యాససూత్ర మిదం నేత్రం"అను శ్లోకమును వివరించుతఱి-శ్రీకంఠభాష్యము-శాంకరాది భాష్యములకన్న పూర్వమైనదని-వక్కాణించిరి. అందువలన శ్రీకంఠీయభాష్యము-ప్రాచీనమైనదని-పరులు గూడ అంగీకరించినట్లు ద్యోతకమగుచున్నయది.

అనేక భాష్యకర్తలయొక్క సూత్ర విరుద్ధార్థములను నిరాకరించి-ఋజుమార్గమున - భాష్యార్థమును నిర్ణయింప సమకట్టిన నా సదుద్యమమును సుధీమణులు అభినందించి అవధరింతురని విశ్వసించు చున్నాను.

ఈ వ్యాసపథము- భక్తులకు శివపదమును లభింపఁజేయుటకై-పెంపొందుచున్నది. భగవాన్ వేదవ్యాసుఁడు న్యాయములతో, బౌద్ధాది నానామతములను ఖండించి- వేదాంత వాక్యములు ఆధారములుగా-పరమపద ప్రాపకమైన రాజమార్గమును- సూత్రములయందు నిర్మించెను ఇదియే ఋజువైన వ్యాసపథము.

ఆచార్యులందరు వైయాసిక సూత్రములనే తమ భాష్యములకు

మూలముగ నుదహరించుటవలన నీ వ్యాసపథము- ప్రాముఖ్యమును సంతరించుకొనినదని తెలియవలెను.

దురంత సంసారసముద్ర నిమగ్నులగు జీవాత్మల నుద్ధరింప ననుగ్రహము గల పరమేశ్వరుఁడు — ఉపనిషత్తుల నవతరింపఁ జేయగా- అనేక మునివరులు - మూలవిరుద్ధార్థములను నిరూపించి వేదాంతములను కలుషితములఁ జేసినందున - ఈ ఉత్తరమీమాంసా శాస్త్రమును శ్రీమన్నారాయణుని యవతారమగు పరాశరనందనుఁడు రచింపవలసివచ్చెను. ఇందువలన ఉపనిషత్తుల ఆద్యంత సమన్వయముతో ఆచార్యానేక ప్రదర్శితార్థములయొక్క- అసామంజస్యమును ప్రదర్శించి సమంజసభావమును వైయాసిక సూత్రములకు- నిరూపించుటయే- మా ఆశయమని చదువరులు గ్రహింతురుగాక!

ముదిగొండ నాగలింగశాస్త్రి

## కేవలాద్వైతపథ ప్రతిషేధ ప్రారంభము

ఉత్తరమీమాంసాశాస్త్ర ప్రారంభ సూత్ర చతుష్టయము. కేవలాద్వైతమున సంగతము కాదు. ఎట్లనఁగా? జీవబ్రహ్మైక్యము-శాస్త్ర విషయమని అద్వైతులు అంగీకరించుటచే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను మొదటి సూత్రములోని బ్రహ్మజిజ్ఞాసా పదము సమర్థనీయము కాకున్నది. "బ్రహ్మము-జిజ్ఞాస్య" మని సూత్రగతమైన బ్రహ్మజిజ్ఞాసా శబ్దము తెలుపును గాని జీవబ్రహ్మైక్యమును చెప్పుట లేదు గదా!

"అథాతో ధర్మజిజ్ఞాసా" అను పూర్వమీమాంసా శాస్త్రారంభ సూత్రమునందలి "ధర్మజిజ్ఞాసా పదము-ధర్మమును విచారింపవలెనని

మాత్రము తెలుపునదై- ధర్మాధర్మైక్యమును సూచింపనట్లు—బ్రహ్మ జిజ్ఞాసాపదంబు నట్టిదే యగును.

ఇఁక రెండవ సూత్రమున ప్రతిపాదింపఁబడిన జగత్కారణ త్వము - అద్వైతపక్షమున బ్రహ్మము నిర్విశేషమగుటచే — సర్వజ్ఞ త్వాది విశేషములతో సిద్ధించు జగత్కారణత్వము—నిర్విశేష బ్రహ్మ మునకు అసంగతమగుటవలన "జన్మాద్యస్య యతః" అను రెండవ సూత్రముగూడ విరుద్ధమగుచున్నయది.

"శాస్త్ర యోనిత్వాత్" అను మూడవసూత్రమున్ను నిర్విశేష వాదులకు సంఘటితము కాదు. ఎందుకనఁగా? నిర్విశేషమైన బ్రహ్మము - వేదాంతములకు యోని కాకుండుటచే నవ్వాని తాత్పర్యము బ్రహ్మమునందు ఉండదు గాన—నిదియు విరుద్ధంబేను.

"తత్తు సమన్వయాత్" అను నాలుగవసూత్రంబు - "వేదాంత ములు— జీవాత్మయొక్క భ్రాంతిని తొలగించు వాక్యార్థ జ్ఞానమును కలిగించునవని పరులు ప్రతిపాదించుటవలన - వాక్యార్థ జ్ఞానము మాత్రము - సంసారబంధమును నివారింపమి - అద్వైతులకు సంగ తము కాకున్నయది.

వస్తుతః విచారించినచో- దిగువ ప్రశ్నలు తారసిల్లును. ఎవరికి భ్రమనివృత్తి ? జ్ఞప్తికా? చేతనునికా? జ్ఞప్తి - అచేతనమగుటచే—అద్దా నికి-భ్రాంతి ఏర్పడుట గాని, భ్రాంతి తొలగుటగాని సంభవింపవు. జ్ఞాతయగు జీవాత్మకు భ్రాంతి, తన్నివృత్తియు కలుగునంటారా? చివరి దశలో జ్ఞాతయగు జీవుఁడు నివర్తించువాడు గానను, మిథ్యా భూతుడైన జీవునకు అస్తిత్వము లేకుండుటచేతను, వ్యావహారిక అస్తి త్వము కలవాడని చెప్పి యాతనికి-భ్రమ, భ్రమ నివృత్తియు సంభ

వించుననినచో-అట్టి జీవాత్మ-తన వినాశమును కోరుట-పురుషార్థము కాకుండుటను; ఇత్యాదులతో - నీ సూత్రముగూడ పరులకు విరుద్ధం బైనదని తేటపడినది.

ఇట్లు ఉత్తరమీమాంసా శాస్త్రముయొక్క ముఖమనఁదగు సూత్ర చతుష్టయము- కేవలాద్వైత పక్షమున - ఉపపన్నము కాదని, స్థాలీ పులాకన్యాయమున-బ్రహ్మమీమాంసా శాస్త్రము - విషయ ప్రయోజ నాద్యభావముచే-నిరుపయోగమగుటఁజేసి- వ్యాససూత్రములన్నియు కేవలాద్వైతమును సమర్థించుట లేదని-అర్థాత్-ఏర్పడినది.

చీకటి వెలుతురులవలె విలక్షణులైన జీవాత్మ పరమాత్మలకు- ఒకరియందు మఱియొకరి నారోపించు అధ్యాసనైతేనో - సూత్రకా రుఁడు ఎచ్చోటను ప్రయోగింపనందున-శబ్ద దుర్భిక్షము-సూత్రకారు నకు లేనందునను అధ్యాసకూడ సూత్రకారుఁడైన వేదవ్యాసునకు సమ్మతము కాదని అవగతమగుచున్నయది.

## ఇఁక జీవబ్రహ్మైక్యము-వ్యాస సమ్మతమగునో కాదో విచారింతము

జీవ బ్రహ్మైక్యము-వైయాసిక సూత్రజాత సమర్థనమున- కేవ లాద్వైత వాదమునందు- ఉత్తర మీమాంసాశాస్త్రమునకు విషయము ప్రయోజనంబునని పరులు నుద్ఘాటించుట ఎట్లనఁగా?

"అయ మాత్మా బ్రహ్మ" "ప్రజ్ఞానం బ్రహ్మ" "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యములు - జీవబ్రహ్మైక్యమును చెప్పునవి.

ఈ ప్రతిపాదమునకు సమాధానమేమనఁగా ? వేదవ్యాసకృత బ్రహ్మసూత్రముల పూర్వాపర పరామర్శఁ జేయువారికి ఇయ్యది- సమ్మతము కాదు. మరియు శాస్త్రముఖమునందు "బ్రహ్మజిజ్ఞాసా" యనియే ప్రతిజ్ఞ చేయఁబడినది కాని, "జీవబ్రహ్మైక్యజిజ్ఞాసా" అని లేదు గదా! బ్రహ్మసూత్రాధికరణములలో దేనియందును జీవపర మాత్మల భేదమును నిరాకరించి-అభేదమును చెప్పకుండుటయే గాక భేదమే సిద్ధాంతీకరింపఁబడినది. ఎట్లనఁగా?

"అంతస్తద్ధర్మోపదేశాత్" అను అధికరణమున - ఆదిత్యాంత ర్వర్తి - పరమేశ్వరుఁడని -పరమేశ్వరుని అమృతత్వాది ధర్మము లను శ్రుతియందు నుపదేశించినందువలన - జీవాత్మ- సూర్యమండ లాంతర్వర్తి కాడని పరులు నిరూపించుటఁజూడగా - జీవపరమాత్మ లకు వస్తుకృతభేదము లేనిది ఈ నిరూపణము సంగతము కాకుండు టఁజేసి - జీవబ్రహ్మైక్యము - ఇఁట - భంగపడినదని తేటపడినది. ఇదియే గాక-

"సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్" అను అధికరణము నందు-

"సర్వం ఖల్విదం బ్రహ్మ-తజ్జలానితి శాంత ఉపాసీత, మనో మయః ప్రాణశరీరో భారూపః" ఇత్యాది విషయవాక్యమును పరిగ్ర హించి - మనోమయత్వాది ధర్మములతో పరబ్రహ్మమే ఉపాసింప దగినది. ఎందుకనఁగా? శ్రుతులన్నిటియందు ప్రసిద్ధముగా బ్రహ్మమే నిర్దేశింపఁబడినది"అను పరుల ప్రతిపాదనము - జీవపరమాత్మ భేద మునే సూచించుట- గమనార్హము.

"అత్తా చరాచరగ్రహణాత్" అను అధికరణమున-

"యస్య బ్రహ్మ చ క్షత్రంచ-ఉభే భవత ఓదనః"

మృత్యు ర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః" అను విషయవాక్యము నుదాహరించి- అత్తా = ప్రపంచమును భక్షించువాడు శ్రుతియందు "చరాచరభరితమగు ప్రపంచము" అను శబ్దమును స్వీకరించుటవలన- పరమేశ్వరుఁడే ననియు, జీవాత్మకాదనియు, పరులు వివరించిన సందర్భము ననుసరించి-జీవపరమాత్మలకు భేదమే పొడగట్టుటచే- పరసమ్మతమగు జీవబ్రహ్మైక్యము సంఘటించుటలేదు.

మరియు "అంతర ఉపపత్తేః" "అంతర్యామి" "అధిదైవం" "అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః" "ఆనందమయో" "నేతరోఽనుపపత్తే" "అంతః" "భేదవ్యపదేశాచ్చాన్యః" "సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్" "ద్యుభ్వాద్యాయతనం" "సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన" "ఇతరపరామర్శాత్స ఇతి చేన్నా సంభవాత్" "ముక్తోపసృప్యవ్యపదేశాత్" ఇత్యాది సూత్రములయొక్క అధికరణములయందు-సమన్వయాధ్యాయ గతములైన అనేక అధికరణములలోను జీవేశ్వర భేదమే కంఠోక్తిగా నిరూపింపఁబడుటవలన-జీవబ్రహ్మైక్యమునందు నీ ఉత్తర మీమాంసాశాస్త్రమునకు తాత్పర్యము లేదని తేటపడుచున్నయది.

బ్రహ్మము నిర్విశేషమగునెడ- "జన్మాద్యస్య యతః" అస్య = ఈ ప్రపంచమునకు, జన్మాది = సృష్టిస్థితిలయాదులు, యతః = దేనినుండి సంభవించుచున్నవో, తత్ = అయ్యది, బ్రహ్మంబగును- అను సూత్రాధికరణమునందు నిర్ణయింపఁబడిన జగజ్జన్మాదికారణత్వము జీవబ్రహ్మైక్యపక్షమున ఉపపన్నము కానందునను అధ్యాస సూత్రప్రతిపాదితము కానందునను కేవలాద్వైతము వైయాసిక సూత్రవిరుద్ధమై ప్రామాణికము కాదని విశదమైనది.

ఇఁక బ్రహ్మము నిర్గుణము అనుటకు-వ్యాససూత్రములలో నెద్దానియందును ఆధారము లేనందున-పెక్కుసూత్రములయందు సగుణము బ్రహ్మంబని-నిరూపించుటవలనను, ఉపాసనము సగుణపర మైనదని పరులే అంగీకరించుటచేతను, అర్చిరాది గతితో-పునరావృత్తి రహితమైన బ్రహ్మలోకముఁజెందుట. సగుణము క్రియని పరులు అవ శతః ప్రతిపాదించుటవలనను "జన్మాద్యస్య యతః" అను ఉపక్రమము "అనావృత్తిశ్శబ్దాత్" అను ఉపసంహారము-సగుణబ్రహ్మమునే నిర్ణ యించుటఁజేసియు-బ్రహ్మము నిర్విశేషము కాదని విదితమగును. ఛాగ పశున్యాయమున క్వచిత్-ప్రతిపాదింపఁబడిన నిర్విశేషత్వమును సవి శేషత్వముగా సమర్థింపవలసియుండును.

ఇఁక సత్యమగు బ్రహ్మముయొక్క కార్యమగు జగత్తు-మిథ్య యనుట నిరాధారమైనది. జగత్తు మిథ్య యగునేని-బ్రహ్మంబుమిథ్య కావలసివచ్చును. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతుల ననుసరించి సత్యమగు బ్రహ్మము- "జన్మాద్యస్య యతః" అనుసూత్ర మున జగత్తునకు కారణమగునని చెప్పఁబడినందున-జగత్తుగూడ సత్య మనియు, జగదంతర్గతజీవాత్మయు నిత్యుఁడనియు నిరూపించుట-ఉత్తరమీమాంసాశాస్త్ర సమ్మతమైనది.

ఇంకను పరుల సిద్ధాంతము విమర్శింపఁబడుచున్నది.

జగత్తు-మిథ్యయను వాదమును "అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరాః" ఈశ్వరు నిష్టపడని విజ్ఞానవాదులు- "జగత్తు- సత్యముకాదు, ప్రతిష్ఠలేనిది" అని చెప్పుదురు. అను స్మృతివచనము నిరీశ్వరవాదిసమ్మతము జగన్మిథ్యాత్వంబని-నిరాకరించుటచే పర పక్షంబునట్టిదే గాన విద్వదాదరణీయము కాదని తేటపడినది.

ప్రశ్న: "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అనుచో జగత్తు

నకు మాయ-ప్రకృతి(ఉత్పత్తిస్థానము)యని చెప్పుటచే మాయామయమగు జగత్తు మిథ్యయని స్ఫురించును గదా!

ఉత్తరము: మాయాశబ్దము_ పరమేశ్వరుని శక్తి-మాయ-యను అర్థము గలదగుటఁజేసి_ "యా మా_సా మాయా" అను విపరీత వ్యుత్పత్తిచే మాయకు మిథ్యాత్వమును కల్పింపరాదు.

ఎట్లనఁగా

మాయ_జగత్ప్రకృతిగా పరమేశ్వరుని శక్తియని నిర్ధారించి "మాయినం తు మహేశ్వరం" అను ఉత్తరవాక్యమున_మాయ-మహేశ్వరుని విశేషణమని చెప్పఁబడినది. మరియు విచిత్రమైన సృష్టికి సహకరించు శక్తి మాయాశబ్దవాచ్యురాలగును. "యా మా సా మాయా" "ఏది లేదో అది మాయ" అను వ్యుత్పత్తి సాధువు కాదు.

"మహామాయే విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి"

పరమేశ్వరుని పట్టపురాణివగు మహామాయా! విచిత్ర విశ్వమును నడిపించుచున్నావు" అనుచో మాయాశబ్దము_శక్తిపర్యాయపదంబని_ పరులంగీకరించుట గమనార్హము.

"తస్యైవ శక్తి ర్వివిధైవ శ్రూయతే-స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" అనుచో_మాయాశక్తి_ పరమేశ్వరునకు సహజసిద్ధయై ఇచ్ఛాజ్ఞాన క్రియాత్మక యగుననియు, కల్పితయై సదసదనిర్వచనీయ కాదనియు" నిర్ణయింపఁబడినది. మరియు "విద్యావిద్యే ఈశతే యస్తు సోఽన్యః" అనుచో "స్వశక్తులగు విద్యావిద్యలను శాసించువాడు_ పరమేశ్వరుఁడు" అని విశదీకరింపఁబడినది.

మరియు "ఈక్షతే ర్నాశబ్దమ్" "అశబ్దం=ప్రధానము ఈక్షతేః=

జగత్తును నిర్మింతు నను సంకల్పము పరమేశ్వరునిదగుటచే- ఈక్షతి కర్తృత్వము పరతంత్రురాలైన ప్రకృతికి లేమిని జగత్కారణముకాదు"అను సూత్రమున- వేదవ్యాసుఁడు-ప్రకృతికి స్వతంత్రముగా జగత్తును నిర్మించు అధికారము లేదని నిరూపించెను.

ఇట్లు నిర్వచనముండగా-మాయ అను కామధేనువునకు-జీవేశ్వరులు దూడలు అను సిద్ధాంతమును పరులంగీకంంచుట-విస్మయావహంబగుచున్నయది.

ఇంతియే గాక-

"ఆనందాదులు పరమేశ్వరుని గుణములు కావు. స్వరూపమగును" అని అంగీకరించిన పరుల-ప్రతిపాదనమును-భగవాన్‌సూత్రకారుఁడు "ఆనందాదయః ప్రధానస్య" అను అధికరణమున-ఆనందాదులు పరమేశ్వరుని గుణములని నిర్వచించి-నిరాకరించెను. మరియు "సుఖవిశిష్టాభిధానాత్" అను సూత్రమున-ఆనందము పరమాత్మ యొక్క గుణమనియే నిరూపించెను.

జీవాత్మలు విభువులను పరుల వాదమును "ఉత్క్రాంతిగత్యాగతీనాం" అను సూత్రముచే-జీవాత్మ-శరీరమునుండి లేచి-గతి అగతి కలిగియుండును గాన అణువని నిర్ణయించి-ఖండించెను.

"అర్చిరాదినా తత్ప్రథితేః" అనుచో జీవాత్మగమనము అర్చిరాది మార్గమున సంభవించును. అద్ది శ్రుతియందు ప్రసిద్ధమైనదదని జీవాత్మకు అణుత్వ నిమిత్తముగా పరలోకగమనము ఘటించునని వేదవ్యాసుఁడు నిర్ధారించెను. జీవాత్మ-కర్త కాడను ప్రసంగమును "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అను సూత్రమున నిరాకరించెను. మరియు "సర్వధర్మోపపత్తేశ్చ" ఇత్యాది సూత్రములచే "బ్రహ్మము నిర్విశేషము అను నంశమును త్రోసిపుచ్చెను.

శ్రుతిశతసమధిగతములగు భక్తికర్మల నంగీకరింపనట్టి- కేవలాద్వైత పథము- బుధజనపరిగ్రాహ్యముకాకుండుటచే, కర్మలు-బ్రహ్మజిజ్ఞాసవరకేఆచరణీయములై జ్ఞానసాధనములుకావని నిరూపించుటవలనను "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" "సన్న్యసించియే వేదాంత శ్రవణము చేయవలె" నను నిర్బంధమును నెలకొలిపి-కర్మిష్ఠియైన గృహస్థునకు వేదాంతశ్రవణాధికారమును నిషేధించుటవలనను, కేవలాద్వైతము కర్మను ఆదరించునది కాదని విశదమైనది.

మరియు దేవతాభక్తియు- పరమతమున స్థిరపడలేదని చెప్పవచ్చును. దేవుఁడు కల్పితుఁడని నిర్ణయించినందున దేవునిపై నమ్మకము లేనివారని తోచెడిని. నిర్గుణమగు బ్రహ్మమునందు భక్తి-దుర్ఘటమగును. మాయ అను కామధేనువునకు- జీవేశ్వరులుభయులు-వత్సములగుటచే. ఈశ్వరునకు కల్పితత్వము ఏర్పడుచున్నది.

శ్రీ బోధాయనాది మునివర్యులందరిచే నిరాకరింపఁబడుటఁజేసి కేవలాద్వైతము ప్రామాణికమగుట లేదు. భగవానుఁడైన ఆపస్తంబుఁడు గూడ కేవలాద్వైతమును నిరాకరించెను. బోధాయనుఁడు సూత్రవృత్తియందు కేవలాద్వైతమును ప్రతిపాదింపకుండుట-గమనార్హమగుచున్నయది. సిద్ధాంతమగు బోధాయనవృత్తిని పరులు పూర్వపక్షముగా నిరూపించుట- సువిదితమే గదా! మరియు కణాద గౌతమ పతంజల్యాదులు-అనేక విధములుగ- కేవలాద్వైతమును నిరాకరించిరి. మరియు నింకనొక రహస్యమేమనఁగా?

కేవలాద్వైతమును ప్రవర్తింపఁజేసిన పండితప్రకాండులుగూడ సగుణబ్రహ్మము నారాధించుటఁజూడగా-నవ్వారికి- కేవలాద్వైత ముఖ్య విషయమగు జీవబ్రహ్మైక్యమునందు విశ్వాసము లేదని స్ఫురించును. అద్వైతసిద్ధి అను గ్రంధమును రచించినట్టి మధు

సూదనసరస్వతీ స్వాములు భక్తియే ముక్తిప్రదమని నిర్ధారించి- శ్రీకృష్ణునికన్న గొప్పదైన తత్త్వములేదని భావించియు-శ్రీకృష్ణునే ఆశ్రయించిరి. శ్రీ అప్పయ దీక్షితేంద్రులును శిఖరిణీమాలయందు-

శ్లో॥ భ్రమా ల్లోభా న్మోహా-న్మతదురభిమానాదపి మృధా-
నయంత్యాయు ర్నాశం-శివ! తవ పదాంభోజవిముఖాః।
వయం తావత్సర్వే-సహ సుతకళత్రాదిభి రిమే-
భవామస్త్వద్దాసా ఇతి-మతి రియం మేఽస్తు సుదృఢా॥

"శంకరా! నీ పాదకమలారాధనమున విముఖులగువారు-భ్రాంతి వలన, లోభముచేతను, మోహమునఁజేసియు స్వమతదురభిమానము వలనను తమ జీవితమును వ్యర్థపరచుచున్నారు. అందువలన- ఈ మేమందరమైతేనో పుత్రకళత్రాదులతో గూడ నీ చరణ సేవకులము అను భావన-నాకు-నిరంతరము సిద్ధించుగాక!" ఇవ్విధము ఆకాంక్షించుచు పరమేశ్వరునే ఉపాసించిరి.

అట్లే శ్రీ ఆద్యశంకరాచార్యస్వాములు- శైవాచార్యవర్యులుగా సుప్రసిద్ధులైన శ్రీ రేవణసిద్ధులచే ప్రసాదింపఁబడిన చంద్రమౌళీశ్వర లింగమును యావజ్జీవము పూజించుటయే గాక "భావనా యది భవేత్ ఫలదాత్రీ_మామకం నగరమేవ హి కాశీ" మనమ్మలో తల చుట ఫలము వొసఁగునదేని. కాశీనగరమే నా సంబంధమైనదని భావించుచున్నా"నని అవసానకాలమున కాశీక్షేత్రమును స్మరించుటఁ బట్టి—అద్వైతాచార్య ప్రముఖులందరు సగుణబ్రహ్మమునే ఆరాధించి తరించిరని బోధపడును. శ్రీశృంగేరి మఠాధిపతులగు శ్రీ సచ్చిదానందభారతీస్వాములవారి ప్రేరణచే ఆస్థానపండితులగు శ్రీ కాశీ లక్ష్మణశాస్త్రిగారు రచించిన గురువంశకావ్యమునందు తృతీయ సర్గమున-

శ్లో॥ శ్రీ చంద్రమౌళీశ్వరలింగ మస్మై - సద్రత్నగర్భం గణనాయకం చ।
సవిశ్వరూపాయ సుసిద్ధదత్తం—దత్వా స్వగాదీ చ్చిర మర్చయేతి॥
సురేశ్వరాచార్య సరస్వతీంత్వం- సంపూజయన్నాస్వ చిరాదిహేతి।
దత్వాఽభ్యనుజ్ఞాం వినతాయ తస్మై-శిష్యై స్సమస్తైస్స జగామ కాంచీమ్॥

సద్రత్నగర్భమగు శ్రీ చంద్రమౌళీశ్వరలింగము గణపతి విగ్రహమున్ను రేవణాసిద్ధులచే శంకరాచార్యులకు ఈయఁబడినది. అట్టి శివలింగము నెల్లకాలము పూజింపుమని రేవణాసిద్ధులు నిర్వ చించిరి. సరస్వతీదేవిని సురేశ్వరాచార్యులకొసఁగి-నిత్యము ఆరాధింపుమని ఆదేశింపగా వినయశీలురైన ఆచార్యులు రేవణాసిద్ధులకు మ్రొక్కి-లిడిరి. ఆ పిమ్మట తన శిష్యులందరితో కూడ రేవణా సిద్ధుఁడు శివకంచిక్షేత్రమునకునేగిరి. ఇcట "సుసిద్ధ దత్తం" అనుచో "రేవణాసిద్ధ మహాయోగిచే ఈయఁబడిన" అను నర్థమును గ్రంథకర్త గారే వ్రాసియున్నారు

మరియు శివతత్త్వరత్నాకరమునందు-చతుర్థ కల్లోలమున-ద్వాదశ తరంగములో-రేవణాసిద్ధులు శంకరాచార్యులకు చంద్ర మౌళీశ్వరలింగము నిచ్చినట్లు వ్రాయఁబడినది.

"శివతత్త్వరత్నాకరము" అనుగ్రంథము-హిందూదేశపరిపాలక ప్రాచీన శాసనవిమర్శకులగు రావ్‌బహద్దూర్, వి.వి. కృష్ణశాస్త్రి మొద లగువారిచేతను జర్మన్‌దేశీయ పండితులచేతను ప్రశంసింపఁబడినది.

అందువలన శైవశాస్త్రము అన్ని శాస్త్రములకంటె పురాతనమైనదని విదితమగుటచే-శైవదర్శనము ప్రాచీనము కాదనువారు పరాజితులైన వారని చెప్పవచ్చును.

శ్రీ రేవణాసిద్ధులు-ఇష్టలింగధారులైనను-స్మార్త మత ప్రవర్తకుఁడగు శంకరాచార్యులకు పీఠపూజ్యమాస శివలింగము నొసగుట-సముచితంబని చదువరులు గ్రహింతురు గాక!

వ్యాసకాశియందు- శ్రీ వేదవ్యాసుని గురువుగా పేరొందినట్టి శ్రీ ఘంటాకర్ణ శివాచార్యుని విగ్రహమునకు ఇష్టలింగధారణము కనఁబడుటచే శైవాచార్యులందరు ఇష్టలింగమును ధరించిరనుటకు ఎట్టి సంశయము లేదని నిర్ధారింపవచ్చును.

"కేవలాద్వైతము-వేదాంతశాస్త్రము" అను వ్యవహారము లౌకికమైనదే గాని శాస్త్రీయము కాదు. ఎందుకనఁగా?

"య ఏకో జాలవా నీశత-ఈశనీభి స్స్వశక్తిభిః"

"జాలమనఁగా మాయాశక్తి, అట్టి మాయాశక్తి నధిష్ఠించిన పరమేశ్వరుఁ డొకఁడే- తన యనుమతిని జగత్తును శాసించు స్వశక్తులతో ప్రపంచమును నియమించువాడు" "అథవా- మాయ అను వలలో తన శక్తులద్వారా జీవాత్మలను బంధించి-సంసారప్రవర్తనుల జేయునట్టి శివుఁడొకఁడేను" ఇఁట-పశుపాశపతి వివేకమున-జాలము పాశమని స్ఫురించును.

"మాయినం తు మహేశ్వరం" "శివ ఏవ కేవలః" ఇత్యాది శ్రుతులు శివాద్వైతమే వేదాంతశాస్త్రమని స్పష్టపరచినవి.

ఇత్యాది సందర్భమును నిరూపించుటలో- కేవలాద్వైతమును నిరాకరించుటయే లక్ష్యముకాదనియు స్వమతమును సుప్రతిష్ఠితముగ నొనర్చుటయే లక్ష్యమనియు విబుధేంద్రులు అవధరింతురుగాక!

పూర్వకాలము- బౌద్ధాదిమత ప్రాబల్యమున- జనులు నాస్తికులు కాగా అవ్వారిని ఆస్తికులుగా నొనర్చుటకు బౌద్ధమతములోని జగన్మిథ్యాత్వాదులను పరిగ్రహించి- తత్త్వము లేదనువారి భావమును మరల్చుటకు తత్త్వము నిరాకారము నిర్గుణంబు కలదని యుద్బోధించి_సగుణము సాకారంబునగు పరమేశ్వరతత్త్వము లోకవ్యవహారసిద్ధమైనదనియు, ఆత్మాస్తిత్వము పొడగట్టుటకై "అహం"అనుదానితో స్ఫురించు జీవాత్మయే బ్రహ్మంబనియు జీవాత్మాస్తిత్వము నంగీకరించినచో-జీవాత్మను ప్రేరేపించు పరమాత్మను కాలక్రమమున గుర్తింతురనియు శైవాదిషణ్మతస్థుల సామరస్యమునకై-ఆ కాలమున కౌమారము లోపించుటచే శివకేశవాదిపంచాయతనము నర్పింపుదనియు, తమకు ఇష్టమైన ప్రదానదేవతను పంచాయతనమధ్యన నుంచుదనియు శ్రీ ఆద్యశంకరాచార్యులు గొప్ప పరిశ్రమతో ప్రస్థానత్రయమునకు బాష్యములను రచించి- లోకము నను గ్రహించుటకు కేవలాద్వైతమును ప్రచారముఁజేయవలసి వచ్చెననియు స్ఫురించుచున్నందున కేవలాద్వైతము శ్రుతి విరుద్ధంబగుటయే గాక సూత్ర విరుద్ధంబునని శ్రీ నాగలింగియ సంస్కృతసముల్లేఖనము యొక్క శాంకరీయ-శైవనందినీ-ఆంధ్రానువాదము విశదపఱచినది.

ఇత్యలం బహునా

ఓం తత్సత్.

——

శ్రీ శివాద్వైతసంప్రదాయ స్సమభివర్ధతామ్.



మహోపాధ్యాయ-శివయోగి

శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి

120వ జన్మదిన సందర్భమున నివాళులు

భరతఖండమున సర్వమతస్థులకును ప్రమాణగ్రంథములు వేదములు. వేదములను శిరసావహించెడి మతములు ఆరు విధములు. అవి శైవము, శాక్తము, వైష్ణవము, సౌరము, గాణాపత్యము, స్కాందము నైయున్నవి. అనాదియై అఖిల జగత్తునను ప్రాచీనకాలమున శివమతమే వెలసియుండెననుట

సత్యము. అట్టి శైవమతమును వ్యాప్తిలోనికి తెచ్చి శతాధిక గ్రంధకర్తలై కృష్ణాతీరమున గుంటూరుకు 8 మైళ్ళ దూరము నున్న తాటికొండ గ్రామమున క్రీ॥శ॥ 1876 సం. సరియగు ధాత నామ సంవత్సర చైత్రశుద్ధ నవమి సోమవారమున భూలోక ప్రవేశముఁజేసిన మహోపాధ్యాయ శివయోగి శివశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు చిరస్మరణీయులు.

శ్రౌత శైవులకు వేదాగమములు(ఉభయమును) పరమ ప్రమాణములు శిరోధార్యములునైయున్నవి. అట్టి వేదప్రామాణ్యముతో ఆవిష్కరింపబడినదే లోకారాధ్య శ్రౌతశైవ సంప్రదాయ మతిప్రాచీనమని నాగలింగశాస్త్రిగారు తమ గ్రంధములందు నిరూపించిరి. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత మతములను, వానిభేదములను నిరూపించి, ఆయామతాచార్యులు స్వమత ప్రతిష్ఠాపనమునకై వేదమంత్రములకును, వ్యాస సూత్రములకునూ గావించిన యర్థములు సరియైనవి కావని కర్మజ్ఞానసముచ్చయ విలసితమై భస్మరుద్రాక్ష లింగధారణ సహితమైన శైవ మహాదీక్షయే మోక్షసాధనమని సప్రమాణముగా నిరూపించిరి. వేదపథము, వ్యాసపథము, శివఏవ కారణం, శ్రౌతాన్యేవ శైవ చిహ్నాని, శ్రౌతమేవహిలింగధారణమ్, శిష్టాస్సర్వే శివం ప్రసన్నాః ఇత్యాది గ్రంధములను రచించి, నీలకంఠారాధ్యుల భాష్యపథమే సరియైనదని సిద్ధాంతీకరించిరి. ఇంకను మోక్షస్వరూప నిర్ణయమను గ్రంథములో జీవబ్రహ్మైక్యము, ముక్తిస్వరూపమని యెన్నుట- భ్రాంతి యనియు, పరమపురుషార్థ స్వరూపమునుదెలుపునట్టి వేదాన్త వాక్యములవలనను, వాని యర్థమును నిర్ణయింప నేర్పడిన

బ్రహ్మసూత్రముల వలనను పరమేశ్వరుని పరమసారూప్యం బును, సాయుజ్యంబును, ననునదియే మోక్షస్వరూపంబని నిర్ణయించిరి. 13-12-1948న శివసాయుజ్యమందిరి. శ్రీ నాగలింగశాస్త్రిగారు తెనాలి సంస్కృత కళాశాలలో కొంతకాలము విద్యంగరపి, శైవసిద్ధాంత ప్రచారమునకై 1909-1910 వరకు మద్రాసునుండి శ్రౌతశైవ ప్రకాశిక యను మాసపత్రికను, తెనాలినుండి శైవరహస్య బోధిని, జ్ఞానవాహినియను మాసపత్రికలనునడిపి శైవసాహిత్యమున కెనలేని సేవజేసిరి. ఇటీవలనే స్వర్గస్థులైన చందవోలు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు పతంజలి మహాభాష్య మును వీరియొద్ద జదివిరి వీరు మధురావిజయమను గ్రంథ మును రచించి తమ గురుపాదులగు శ్రీ నాగలింగశాస్త్రిగారికి అంకితమిచ్చిరి. శ్రీ నాగలింగశాస్త్రిగారు రచించిన నూరుకు పైగా గల గ్రంథములలో శివాద్వైత పథవిధి, కేవలాద్వైత ప్రతిషేధము, వేదాంతార్థ పరిష్కారతారహారము, రక్షా రుద్రాక్షచండమార్తాండము విద్యాస్థానవినిర్ణయము, మతవినోద చర్చ, చతుర్వేద తాత్పర్యసంగ్రహము, భారత రామాయణ తాత్పర్య సంగ్రహము, జ్ఞానవాశిష్టము శైవసిద్ధాంత సంగ్ర హము, నీలకంఠభాష్య చర్చ, కారణోత్తర, ముకుటోత్తర, చంద్రజ్ఞాన శివాగములకు తెలుగులో వ్యాఖ్యానములు, బసవ పురాణ పీఠికావిమర్శనము, అప్పయ దీక్షిత చరిత్ర ఇత్యాది గ్రంథములుగలవు. వారిరచనలపై జిజ్ఞాసగలవారు కార్యదర్శి శివజ్ఞానలహరి, ధార్మికసంస్థ. 5-9-47/5 బషీర్ బాగ్, హైద్రాబాదు-29. ఫోన్ నెం 233312 వారిని సంప్రదించ గలరు!

అన్నదేవర సుబ్బారావు

ఓం నమో భగవతే సదాశివాయ

మహోపాధ్యాయ శివశ్రీ॥ ముదిగొండ

నాగలింగ శాస్త్రీయమగు

# వేదాంతార్థ పరిష్కార తారహారము

శాంకరీయ - శైవనందిసీ వ్యాఖ్యా సమన్వితము

## ముందుమాట

"వేదాంతములనగా-ఉపనిషత్తులు, (పరమేశ్వర సమీపవర్తులు) వేదాంతములయొక్క అర్థమును పరిష్క (నిర్ధా)రించుట అను-నక్షత్రములచే కూర్పఁబడిన కంఠహారము" అని నిర్వచనము.

(వేదాంతానాం అర్థస్య పరిష్కారాః, త ఏవ తారాః (నక్షత్రాణి) తేషాం హారః- ఇతి వ్యుత్పత్తిః)

ఇందు సిద్ధాంత-అధికారి-సాధన-జగత్- బ్రహ్మ-జీవ-గతి, ముక్తి-నిబంధ సాఫల్య-కేవలాద్వైత శాస్త్రకర్తృభావములఁజెందినట్టి ముఖ్యములైన పరిష్కారములు ఇరువదిమూడు (23) వ్రాయఁబడినవి.

సిద్ధాంతాది పరిష్కారములన్నియు శ్రీ నీలకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యమున-నా ఆంధ్రీకరణమునందు ప్రాయశః వ్రాయఁబడినవైనను- ఆ మహా గ్రంథముల్లో చదువరులకు దుర్లభములగు

టచే— శ్రీ శాస్త్రిగారు — పృథక్ గ్రంథముగా పరిష్కారతారహార మును వ్రాయవలసివచ్చినది.

ఇయ్యది— సంస్కృతభాషలో జటిలముగా నున్నందునను— శ్రీమున్నంగి పున్నయ్యపంతులుగారి అనువాదములో కేవలాద్వైత ఛాయలు ఎక్కువ కనపడుచున్నందునను శైవారాధ్యజిజ్ఞాసువులకు అవగాహనమగునట్లు ఆరాధ్యబాణిలో క్లుప్తముగా సారాంశముల ననువ దింపుడని లోకారాధ్యులు, శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారు- ప్రేరేపించి ముద్రణవ్యయమును యథోచిత సత్కారము నందజేసి యున్నందున శైవలోక కల్యాణార్థము శివప్రీత్యర్థమున్ను దీని నీవిధ ముగా యథామతి అనువదించితిని. కించిత్ సంస్కృతాంధ్ర భాషా పరిచయము గలవారైనను ఓపికతో ద్విత్రిః ఇద్దానిని చదివినచో శైవారాధ్య సిద్ధాంతము- కేవలాద్వైతము కాదనియు; వీరశైవుల ద్వైతాద్వైతము గాని మాధ్వద్వైతముగాని కాదనియు విదితమగును.

బసవపురాణము, ప్రభులింగలీల, అధ్యాత్మ ఆనంద రామాయణ ములు, సీతారామాంజనేయము మొదలగునవి కల్పితములై అప్రమా ణములగునని మీరే గ్రహింతురు !

వేదవ్యాసకృత బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత, శివాగమములు శివమహాపురాణాదులు, మహాభారతము, వాల్మీకి రామా యణము మొదలగునవి శైవులకు పరమప్రమాణములగునట్టివి.

శ్రీ పంతులుగారు తమ పీఠికలో పూర్వపక్షరూపమున కేవలా ద్వైతమును జొప్పించిరి. కేవలాద్వైతులకు శివాద్వైతులకును అను శివాద్వైతము కలదనియు "శివోఽహం" భావనతో శివాద్వైతులు మైమఱతురనియు శివాద్వైతమును కేవలాద్వైతసంకీర్ణముగా

చూపెట్టి-రెంటికిని భేదము గలదని ముఖ్యప్రీతి క్తై నిర్వచించిరి. ఇట్టి యంశములు- సూక్ష్మగ్రాహులకే అందు గోచరించును కథమపి- శ్రీపంతులుగారు దీక్షితసంప్రదాయులగుటచే- శివపారమ్యమును సర్వాత్మనా నిర్ణయించి శైవులకు మహోపకార మొనర్చిరనుట నిర్వివాదమై ముదావహంబగుచున్నయది.

ఇఁక నక్షత్రములు 28, సద్యోజాతాది పంచబ్రహ్మములు 5, వెఱసి ముప్పదిమూడు తేజస్సులతో నమర్పఁబడిన హారమును ఇష్టప్రాణభావలింగాత్మకుఁడైన సదాశివుని-లేక-విద్యామాహేశ్వరుల కంఠమున సమర్పించిన శ్రీ శాస్త్రిగారు తమ జన్మ సార్థకత నాపాదించుకొనిరనుట- అతిశయోక్తి కాదు.

శ్రీ శాస్త్రిగారి రచనలలో- పై పరిష్కారములు తతస్తతః క్లప్తములుగా కనపడుచున్నను- బ్రహ్మపథాంధ్రీకరణముఁ జదివిన వారికి వెనువెంటనే వేదాంతసారము తెలియవలెనని ఉద్దేశించి-ఒకే గ్రంథముగా రెండు ముఖ్య భాగములను ప్రచురింపఁజేయుట- శ్రీ అన్నదేవర సుబ్బారావుగారి సహృదయతకు తార్కాణమైనది.

ఈ ఘోర కలికాలమున ఇట్టి మతగ్రంథములఁ జదివి-ఆకళింపు చేసికొని-యథాశక్తి ఆచరణలోను ప్రవచనమునందును శ్రవణమునందును ఆసక్తి గలవారు వేలకొక్కరైనా ఉందురను సదభిప్రాయమే ఏతత్సముల్లేఖనమునకు మూలమని మనము గ్రహింపవలసియున్నది.

ఇతర మతములలో ఉభయ భాషలందు పెక్కు పొత్తములు లభించుచుండగా ఈ మాత్రము గ్రంథ సంచయము మనకు అవసరమే గదా!

ఈ నా కృషి మీ మెప్పుఁబడయుటే గాక దీనివలన పరమేశ్వరుని ప్రసన్నతయు చేకూరునని ఆశంసించుచున్నాను.

"నా మూలం లిఖ్యతే కించిత్-నానపేక్షిత ముచ్యతే."

నిర్మల శంకరశాస్త్రి

ఓమ్

# వేదాంతార్థ పరిష్కారమున

# 1. సిద్ధాంత పరిష్కారము

"ఏకమేవాద్వితీయం" "బ్రహ్మము రెండవది లేనిదై ఒకటే యగును" ఇత్యాది శ్రుతివలన "తదనన్యత్వమ్" "బ్రహ్మమునకన్న వేరైనది జగత్తు కాదు." అను వ్యాససూత్రమువలనను కేవలాద్వైతమే సిద్ధాంతమగునని కొందరు భావింతురు.

"ద్వాసుపర్ణా" మంచిరెక్కలుగల జీవేశ్వరులు అను పక్షులు శరీర వృక్షము నధిష్ఠించియున్నవి. ఇత్యాది శ్రుతిననుసరించి "అధికంతు భేదనిర్దేశాత్" జగజ్జీవేశ్వరులకు భేదము నిర్దేశింపఁబడుటచే- పరమేశ్వరతత్త్వము- జగజ్జీవులకంటె నధికమైనది". అను వ్యాససూత్రముఁబట్టియు కేవలభేదము సిద్ధాంతమగునని- మఱికొందరు తలంతురు.

ఈ రెండు పక్షముల సమన్వయము ప్రశ్నోత్తర రూపముగా నిరూపింపఁబడుచున్నయది.

ప్రశ్న : ఘటపటములకువలె, ఘట కులాలులకు వలెను, ప్రపంచ బ్రహ్మములకు భేదమే సిద్ధాంతమగునని చెప్పవలెను గదా!

ఉత్తరము : కేవలభేదము సిద్ధాంతమని చెప్పునెడ- "సర్వం ఖల్విదం బ్రహ్మ" "తదనన్యత్వమ్" ఇత్యాది- అభేదశ్రుతి సూత్రములు విరోధించును.

ప్రశ్న : తదనన్యత్వాది సూత్రముల ననుసరించి- అత్యంతా భేదమే యుక్తమని తోచెడిని. ఎందుకనఁగా- అభేదమును ప్రతి పాదించు శ్రుతులు ఎక్కువగా నున్నందున- భేదశ్రుతులు ఔపాధిక భేదపరములని అంగీకరించి కేవలాభేదమునే సిద్ధాంతముగా పరిగ ణించినచో విరోధమేమి ?

ఉత్తరము : "జ్ఞాజ్ఞౌ ద్వావజావీశానీశౌ" "ఈశ్వరుఁడు సర్వ జ్ఞుఁడు స్వతంత్రుఁడు కాగా- జీవుఁడు కించిజ్ఞుఁడు పరతంత్రుఁడు నగును. జీవేశ్వరులిరువురును జననమరణాది రహితులై నిత్యులగు దురు". ఇత్యాది శ్రుతులు-పాషాణ కాష్ఠ లోష్ట తృణాదులగు అచేత నముల వలె- చేతనుఁడైన జీవాత్మ కించిజ్ఞత్వాదులతో- సర్వజ్ఞత్వాది సంపన్నుఁడైన పరమేశ్వరుని కంటె- విలక్షణుఁడని నిరూపించుట- ఉపపన్నంబగుచుండగా- అచేతనమగు పాషాణాదికము ఈశ్వరుని కన్న వేరైనదని వేరు చెప్పనేల ?

ఇట్లు ఉపపత్తులతోకూడిన భేదశ్రుతులు బలిష్ఠములు కాగా- ఉపపత్తులు లేనట్టి అభేదశ్రుతులు దుర్బలములగుచున్నందున కేవలా ద్వైతము- ప్రామాణికము కాకున్నయది.

ప్రశ్న : బ్రహ్మప్రపంచములు శుక్తిరజతముల వలె- (ఒకటి సత్యము మరియొకటి మిథ్యగా) ఏకతర మిథ్యాత్వము గలవమట సమంజసంబగును గదా !

ఉత్తరము : "స ఈక్షత లోకాన్నుసృజా" "పరమేశ్వరుఁడు- లోకములను నిర్మింతునని సంకల్పించెను." ఇత్యాదిశ్రుతులు- సత్య సంకల్పము గల బ్రహ్మముచే సృజింపఁబడిన జగత్తు సత్యమగుటఁ జేసి-జగత్తు మిథ్యయనుట శ్రుతిసూత్రములకు విరుద్ధమైనదని తెలియ

వలెను. ఇంతియేగాక — తేజస్తిమి (అంధకా) రముల వలె విరుద్ధ స్వభావము గల భేదాభేదములు వస్తువిరోధము గలవగుటచే— భేదాభేద సిద్ధాంతంబును పరిగ్రాహ్యము కాకున్నయది.

భేదాభేదము అత్యంత భేదంబు జగన్మిథ్యాత్వమున్ను వేదశాస్త్రాది ప్రమాణ విరుద్ధములగుటఁజేసి - లోన భేదము గలిగి పృథక్స్థితి లేనట్టి విశిష్టాద్వైతమే— భేదాభేదశ్రుతుల తాత్పర్యమని— ఇఁట విదితమైనది. "ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే" "ఒకడే రుద్రుఁడుండెను. రెండవ అధిష్ఠాత లేకుండెను." "శివ మద్వైతం చతుర్థం మన్యంతే" "తనలో ఉండి తనకంటె వేరు గానట్టి చరాచరము గల శివుఁడు— అద్వైతుఁడై— నాలుగవ వాడగునని విబుధులు భావించెదరు." "మాయాం తు ప్రకృతిం విద్యాత్- మాయినం తు మహేశ్వరమ్" "పరమేశ్వరు నెడబాయని మాయాశక్తి ప్రపంచమునకు ప్రకృతి (ఉత్పత్తిస్థానము) యనియు, మహేశ్వరుఁడు మాయ నధిష్ఠించి ప్రవర్తింపఁజేయువాడనియు భక్తులు గుర్తింపవలెను". ఇత్యాదిని— చిదచిదాకారము గల పరమశక్తితో నిరంతరము కూడియుండు శివుఁడు— తనకంటె వేరు వస్తువు లేనివాడగుటచే అద్వితీయుఁడని చెప్పఁబడెను- గాన శక్తివిశిష్టశివాద్వైతమే పరమ సిద్ధాంతమని గ్రహింపవలెను.

"సూక్ష్మచిదచిద్విశిష్టః శివః కారణమ్; స్థూల చిదచిద్విశిష్టః శివః కార్యమ్; తయోరద్వైతం—అపృథక్స్థిత అంతర్భేద సాహిత్యేన వస్త్వైక్యం- శివాద్వైతమ్" అనియు;

"నామరూప విభాగానర్హత్వం - సూక్ష్మత్వమ్." "నామరూప విభాగార్హత్వం స్థూలత్వమ్" అనియు నిర్వచనములు.

ఇయ్యది సిద్ధాంతపరిష్కారము-

# 2. అధికారి పరిష్కారము

నాలుగు సాధనములు పాశుపతవ్రతానుష్ఠానము గలవాడే బ్రహ్మవిద్య (శివధ్యానము) యందు అధికారి యగును.

నిత్యానిత్యవివేకము, విరాగము, శమదమాది సంపత్తు, ముముక్ష యనునవి- సాధన చతుష్టయమనఁబడును.

నిత్యానిత్య వివేకమనఁగా- ఉపాసనాఫలమగు మోక్షము నిత్యమనియు, కర్మఫలంబగు స్వర్గాది సుఖభోగము అనిత్యమనియు వివేకము.

"యదేహ కర్మచితో లోకః క్షీయతే- పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్ – నాస్త్యకృతః కృతేన" "జ్యోతిష్టోమాది సత్కర్మలచే సంపాదింపఁబడు స్వర్గాదిలోక సుఖభోగము క్షీణించును గాన బ్రహ్మము (శివు)నందు నిష్ఠగలవాడు- నిర్వేద (స్వర్గఫలాదులయందు త్యాగబుద్ధిని) మును పొందవలెను. కృతేన = ఫలాభిసంధిసహితమగు కామ్యకర్మతో. అకృతః = అపవర్గ (మోక్ష)ము; నాస్తి = సిద్ధింపదు." న స పునరావర్తతే "సః = శాంభవదీక్షితుఁడై సాధన చతుష్టయ సంపన్నుఁడునై శివునుపాసించి ముక్తిఁబొందువాడు, పునః = జనన మరణ జరా వ్యాధిగ్రస్తమగు ఈ మానవ లోకమునకు మరల, నావర్తతే = రాడు." ఇత్యాది శ్రుతులు కర్మఫలము ననిత్యముగాను, ఉపాసనాఫలమును నిత్యముగా నుపదేశించుచున్నవి.

"నిత్యుఁడు-ప్రత్యగాత్మ (జీవాత్మ) అనిత్యములు దేహేంద్రియాదులు" నని కొందరు చెప్పెడు వాదము సరియైనది కాదు. అట్లగుచో నిత్యుడైన ఆత్మయే బ్రహ్మవిద్యాశ్రవణముఁజేయవలెను గాన అధికారియగు ఆత్మను గుర్తించినంత మాత్రమున బ్రహ్మవిద్యాశ్రవణాధికారము సంభవింపదని గుర్తించి- ప్రత్యగాత్మను తెలిసికొనుటయే పరమావధియని భావింపక - పరాత్మనుపాసించుటయే నిత్యఫలప్రదాయకంబని భావించుట- సమంజసమగుచున్నయది.

"నిత్యానిత్య వివేకమువలన అనిత్యములగు కర్మఫలములయందు వైరాగ్యము కలుగగానే శమ (శాంతి) దమా (ఇంద్రియనిగ్రహ) దిసంపత్తు అద్దాని వెనువెంటనే సంసారబంధమునుండి విడిబడవలెనను మోక్షేచ్ఛ-సంభవించును." అను క్రమము యుక్తంబైనది.

"శాంతో దాంత ఉపరతస్తితిక్షుః" అనుచో గల ఉపరతి శబ్దమునకు సన్న్యాసము అను నర్థము సరి కాదు. ఉపరతియనఁగా- నిషిద్ధకామ్యకర్మలను చాలించుట యని తెలియవలెను. "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" అను వాక్యమున గల సన్న్యాస శబ్దమునకు- కామ్యకర్మత్యాగము, కర్మఫలత్యాగము నను నర్థముఁజేయవలెను. "కామ్యానాం కర్మణాం న్యాసం-సన్న్యాసం కవయో విదుః" "యస్తు కర్మఫలత్యాగి- స త్యాగీత్యభిధీయతే" అను గీతావచనములు ఇందుకు ప్రోద్బలకములగుచున్నవి.

"యతయః శుద్ధసత్త్వాః" అను వాక్యమున గల యతిశబ్దమునకు యమ (ఇంద్రియనిగ్రహ)ము అను గుణము గలవాడనుట- ఉపపన్నంబగును.

"అత్యాశ్రమస్థః సకలేంద్రియాణి" ఇత్యాదిని - సన్న్యాసమ్ము

విద్యాంగముగా విధింపఁబడుచున్నదని భావింపరాదు. అత్యాశ్రమ పదము సన్న్యాసవాచకము కానిదై పాశుపతవ్రతమును చెప్పునది. ఎట్లనఁగా- "వ్రత మేతద్భాంభవం తత్సమాచరేన్ముముక్షు రపునర్భవాయ" అనుచో ముక్తిసాధనముగా నిరూపింపఁబడిన పాశుపత (శాంభవ) వ్రతమును- ముక్తిసాధన ప్రకరణమునఁ జెప్పఁబడిన అత్యాశ్రమపదము- నిర్వచించును గాన "అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రమ్" "అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్" ఇత్యాది శ్రుతులు అత్యాశ్రమమనఁబడు పాశుపతవ్రతము- బ్రహ్మవిద్యాంగమని విశద పఱచుచున్నవి. మరియు మహాభారతమున మోక్షధర్మపర్వమునందు 190 వ అధ్యాయమున- దక్షప్రజాపతిఁగూర్చి పరమేశ్వరుఁడు-

శ్లో॥ గతాంతై రధ్యవసిత-మత్యాశ్రమ మిదం వ్రతం ।
మయా పాశుపతం దక్ష-శుభ ముత్పాదితం పురా॥

"దక్షప్రజాపతీ! వేదశాస్త్ర పారంగతులచే నిర్ణయింపఁబడినట్టి, అత్యాశ్రమ మనఁబడుఁగునట్టి శుభప్రదమైన పాశుపతవ్రతమును నేను పూర్వము ఏర్పరచితిని." అని పాశుపతవ్రతమును అత్యాశ్రమముగా పేర్కొనెను. అందువలననే "తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్" "శిరోవ్రతమనఁబడు పాశుపత వ్రతమును విధివిధానముగ నాచరించినవారికే బ్రహ్మవిద్య నుపదేశింపవలెను."అని శ్రుతి నిర్వచించుటచే అత్యాశ్రమపదము-సన్న్యాస పరము కాదని విదితమైనది.

శిరోవ్రతమనఁగా- పాశుపతము కాదని శంకింపఁగూడదు.

శ్లో॥ వ్రతం పాశుపతం చీర్ణం-యైర్ద్విజై రాదరేణ తు
తేషా మైవోదేష్టవ్య-మితి వేదానుశాసనమ్॥

అను సూతసంహితావచనము-శిరోవ్రతము పాశుపతమని ఉప బృంహించినది. ఇంతియేగాక "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" ఇత్యాది శ్రుతివాక్యము- బ్రహ్మవిద్యోపదేష్ట శ్రౌతాగ్నిధారియగు గృహస్థుఁడే కావలెనని స్పష్టపఱచినది. ఒకవేళ గురువు సన్న్యాసియే కావలెనని భావించునెడ- శిష్యుఁడు సమిత్పాణియై గురువు నాశ్రయించి-అహితాగ్ని కానట్టి ఆచార్యునకు సమిధలను శైత్యనివారణకై సమర్పింప వలసివచ్చును.

ఇఁట నిద్దానిని సారాంశముగా దిగువవిధము గ్రహింపనగును. బ్రహ్మజిజ్ఞాస (ప్రస్థానత్రయ గత వివేచనమున)కు పరమ ప్రయోజనము కైవల్యము కాగా- అద్దానిని - అర్చిరాది మార్గమున నిష్క్రమించు జీవాత్మ- హృదయాంతర్వర్తియగు బ్రహ్మ (భావలింగ) ముచే అనుగ్రహీతుఁడై- పొందునని- శ్రుతి సూత్రములు నిర్ణయించినవి.

ఇఁక హార్ద బ్రహ్మము సర్వోపాస్యమై లింగస్వరూపమగునని "లింగే సుషుప్తిః" ఇత్యాది శ్రుతులఁబట్టి అవగతము కాగా- "తమాత్మస్థం యేஉను పశ్యంతి ధీరా-స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్" ఇత్యాది శ్రుతులు- "ప్రాణలింగ స్వరూపమున హృదయములోనుండు శివునుపాసించువారికే- శాశ్వతమైన శాంతి (మోక్షము) లభించును. "పరమాత్మ పరలోకగతుఁడే కాని ఈ లోకమున ప్రాణులయొక్క హృదయమునందుండువాడు కాడు." ఇత్యాది - అన్యాన్యభావనలు గలవారికి- శాశ్వతశాంతి లభింపదు. అని నొక్కి వక్కాణించుటచే- ప్రాణలింగోపాసనను స్ఫురింపఁజేయుటకు - ఇష్టలింగధారణము- ఆవశ్యకమని తెలియపలెను. "సోஉశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా" అను శ్రుతియందు "ముక్తాత్మ బ్రహ్మముతోకూడ సమస్త

కామ్యముల సమష్టియగు ఆనందము ననుభవించు" నని చెప్పఁబడిన శివసాయుజ్యము నభివ్యక్తీకరింపఁజేయుటకు బాహ్య శివలింగధారణము సువిహితమగుచున్నయది.

భస్మరుద్రాక్ష శివలింగధారణముతో పరావిద్యయగు ప్రణవఘటిత శివపంచాక్షర మహామంత్రమును జపించుచు వామకరతలమున ఇష్టలింగము నారాధించు శాంభవదీక్షితుఁడు- సాధన చతుష్టయ సంపన్నుఁడై- బ్రహ్మ (శివ) జ్ఞానమనఁదగు మహావిద్యను సాధించుటకు అధికారి యగుననియు, మహావాక్యార్థ శ్రవణ మాత్రమున జీవబ్రహ్మైక్యజ్ఞానము కలిగి జీవాత్మ-బ్రహ్మంబగునని కర్మత్యాగము, జేయువారికి, మరియు శివేతర దేవతలను ముముక్షతో నారాధించువారికిని- బ్రహ్మవిద్యా శ్రవణార్హత లేదని ఈ అధికారి పరిష్కారమున చదువరులు గ్రహింతురు గాక! పాశుపతవ్రతనిష్ఠుఁడు గృహస్థుఁడు నగు ఆచార్యు నాశ్రయించుటకు గృహస్థుఁడైన శిష్యుఁడే సమిత్పాణియగుట- సముచితమని తోఁచెడిని. శాంభవదీక్షితుఁడైన సన్న్యాసిని గృహస్థు నాశ్రయించుట ఎంతవరకు సముచితమో విద్వన్మాహేశ్వరుల పరిశీలనముపై ఆధారపడియున్నది.

# 3. సాధన పరిష్కారము

నిష్కామమగు నిజవర్ణాశ్రమ ధర్మముతో కూడినది, ఉపాసనా రూపమైన జ్ఞాన మనఁబడునదియు నగు భక్తియే- ముక్తికి పరమ సాధనమగును.

## సాధన పరిష్కారమున

## 3-1. ఉపాసనావిధి పరిష్కారము

ప్రశ్న : ఓయీ! తమేవం విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పంథా అయనాయ విద్యతే" "మహావాక్యశ్రవణముచే పరమాత్మను తెలిసికొనినచో మృత్యుమయ సంసారసముద్రమునుల్లంఘింపఁ జాలును_ మోక్షమునకు దీనికన్న వేరైన మార్గము లేదు" "జ్ఞానాదేవ తు కైవల్యమ్' "జ్ఞానమువలననే కైవల్య(మోక్ష)ము లభించును. ఇత్యాది శ్రుతి స్మృతులు అనుభవరూపమగు జ్ఞానమే- పరమముక్తి సాధనమని చెప్పుచుండుటచే- జ్ఞానమే ముక్తిసాధనమని- అవగతమగుట లేదా ?

ఉత్తరము: మీరు ఉదాహరించిన శ్రుతి స్మృత్యాది వచస్సులు- "జ్ఞానము ఉపాసనారూపము" అని వక్కాణించినవని తెలియుడు! "కేవల జ్ఞానము విధింపఁబడునది కాదు అని మీరు ప్రతిపాదించుటచే ఉపాసనావిధి బోధకములగు పెక్కు వాక్యములు. జ్ఞానము ఉపాసనాత్మకము కాదనునెడ_ వ్యర్థములగును.

"ఆత్మావారే ద్రష్టవ్యః" "సోఽన్వేష్టవ్యః" "ఆత్మానమేవ లోకముపాసీత'' 'ఓమిత్యేవ ధ్యాయథాత్మానమ్' "తస్మిన్ యదంతస్తదుపాసితవ్యమ్" "ప్రాచీన యోగ్యోపాస్వ" "శివ ఏకో ధ్యేయః, ఇత్యాదులయందు దర్శన-అన్వేషణ-ఉపాసన-ధ్యాన-శబ్దములు శివజ్ఞానార్థకములుగా ప్రయోగింపఁబడినవి.

ఉపాసనావిధి సగుణ బ్రహ్మముఁగూర్చి చెప్పఁబడినదని పరులు గూడ నంగీకరించుటచే- వేదాంతములన్నియు నిర్గుణము నుపాసింపవలెనని నిరూపింపకుండుటవలనను ఉపాసనా వాక్యములలో జ్ఞాన

శబ్దము వ్యవహరింపఁబడుటఁజేసియు జ్ఞానము అనఁదగు ఉపాసనము విధి ప్రచోదిత మైనదని గ్రహింపవలెను.

## 3-2. భక్తి జ్ఞానైక రూప్యపరిష్కారము

ఇందు - భక్తి, జ్ఞానము నొకటేనని పరిష్కరింపఁబడుచున్నది.

"తమేవం విదిత్వాఽతిమృత్యు మేతి" "జ్ఞాత్వా శివం శాంతి మత్యంతమేతి" ఇత్యాది శ్రుతి వాక్యములలో జ్ఞానము- పరమేశ్వర ప్రాప్తిరూపమైన మోక్షమునకు సాధనమని చెప్పినట్లు "పురుషస్స పరః పార్థ- భక్త్యా లభ్య స్త్వనన్యయా" "భక్తిం మయి పరాంకృత్వా మామేవైష్యస్యసంశయః" "మద్భక్తా యాంతి మామపి"ఇత్యాది స్మృతి వాక్యములు. భక్తి- పరమేశ్వర ప్రాప్తికి సాధనమని వక్కాణించినవి. మరియు శ్రుతులయందు జ్ఞానమునకంటె వేరు సాధనము- ముక్తికి లేదని నిరూపించినట్లు "నాహం వేదై ర్న తపసా- న దానేన నచేజ్యయా-భక్త్యాత్వనన్యయా" "మోక్షసాధన సామగ్ర్యాం-భక్తి రేవ గరీయసీ" ఇత్యాది స్మృతులలో భక్తికంటె వేరైన మార్గము మోక్షమునకు లేదని నిర్ధారించినవి.

ఇట్టి శ్రుతి స్మృతులకు విరోధము లేనందున- భక్తి జ్ఞాన శబ్దములు ఏకార్థకములగుచున్నవి.

ఇంతియేగాక "ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే" "సర్వ ధర్మాన్ పరిత్యజ్య-మామేకం శరణం వ్రజ" ఇత్యాది శ్రుతి స్మృతుల యందు-భక్తి- ప్రపత్తిరూపమనియు శరణాగతి రూపంబు ననియు వ్యవహరింపఁబడినది.

"శ్రద్ధా భక్తి ధ్యానయోగా దవేహి" అనుచో భక్తి-ధ్యానము- వేరు వేరని భావింపక- భక్తిపూర్వకమగు ధ్యానయోగమువలన పరమాత్మను తెలిసికొనుము ! అని గ్రహింపవలెను. "శ్రద్ధా భక్తి ధ్యానయోగాదవేహి" అనుచో గల "అవేహి" అను పదము ఈశ్వర సాక్షాత్కారమును జెప్పుటచే- పరులు చెప్పునట్టి అనుభవరూప జ్ఞానమును బోధించునది కాదని అవగతమగును.

ప్రశ్న : జ్ఞానావస్థా విశేషరూపము భక్తియని మీరు నిరూపించితిరి గదా ! శ్రీ నీలకంఠ భగవత్పాదులైతేనో బ్రహ్మసూత్రభాష్యమున శమాద్యధికరణమునందు "వినిర్ముక్త సకలేతర దేవతారాధనా త్రివిధకరణ సంపాద్యా- పరమశివ పరిచర్యామయీ- వైదికీ క్రియా భక్తిః" "శివేతర దేవతారాధనము లేనిది, మనోవాక్కాయములచే సంపాదింపఁబడునది, పరమశివుని సేవించుటయునగు వైదికీ క్రియ భక్తి" యని భక్తికి క్రియారూపము నొసఁగిరి. గాన మీరేమందురు?

ఉత్తరము : జ్ఞానముగూడ మానసక్రియ యగుటచే-భక్తి- జ్ఞానావస్థా విశేషరూప మగుటను, భగవత్పాదులు నిర్వచించిన లక్షణమునకు విరోధము లేదు.

"సేవా భక్తి రుపాస్తిః" అని నైఘంటికులు భక్తి జ్ఞానములు ఏకార్థకములని నిర్ణయించిరి. మరియు "భజ ఇత్యేవ ధాతుర్వై- సేవాయాం పరికీర్తితః- తస్మాత్సేవా బుధైః ప్రోక్తా - భక్తిశబ్దేన భూయసీ'' అను నిఘంటుకారుల నిర్వచనము- సేవాభక్తులు ఏకార్థకములని విశదీకరించినందున "భక్తి-పరమశివ పరిచర్యారూపమైనదనుట" సంగతంబైనది. "స్నేహపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే" అను మఱియొక నైఘంటుక నిర్వచనము- భక్తి- జ్ఞానావస్థా విశేషరూప మగుటను సమర్థించినది.

ఏతావతా- భక్తి- క్రియారూపమని ఆవిష్కరించినట్టి భగవత్పాదులు. "త్రివిధకరణసంపాద్యా" అను విశేషణముచే భక్తి- మానస క్రియారూపమనిగూడా ప్రతిపాదించి- భక్తికి జ్ఞానరూపము నొసంగినందున శ్రీవారి నిర్వచనము భక్తిజ్ఞానైక రూప్యమునకు అనుకూలమైనదని ఇంట విదితమైనది.

మహావాక్యశ్రవణము వలన పరోక్ష జ్ఞానము కలుగగా- పరమేశ్వరుని సాక్షాత్కారమునకై- ఉపాసనావిధి ప్రయోజనము గలదగును. ఉపాసనారూపమగు జ్ఞానమే- పరమేశ్వర సాక్షాత్కారమునకు కారణమగుట నిర్వివాదమైనది.

## 3-3. కర్మజ్ఞాన సముచ్చయ పరిష్కారము

ప్రశ్న : "అంధంతమః ప్రవిశంతి- యేఽవిద్యాయాగ్ం రతాః "ఎవరు కర్మ (అవిద్య)యందు నిష్ఠగలవారో- అట్టివారు-కటికచీకటితో నిండిన లోకములం బ్రవేశింతురు" అని శ్రుతి చెప్పుచున్నందున కర్మ- ముక్తిసాధనమగు జ్ఞానము (విద్య)తో కూడియుండుట పొసగదు గదా!

ఉత్తరము : మీరుచూపిన శ్రుతివాక్యము- కర్మయందే నిష్ఠగలవారింగూర్చి ఉపయోగించునది కాగా- "తతో భూయ ఏవ తే- య ఉ విద్యాయాగ్ం రతాః" అను శ్రుతివాక్యము- కర్మను విడనాడి కేవల జ్ఞాననిష్ఠ గలవారు- కర్మరతులచే పొందంబడు లోకములకంటె నధికమైన తమస్సుగల లోకములం జెందుదురు." అని కేవల జ్ఞాననిష్ఠులను తిరస్కరించినది గాన "విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ం సహ" ఇత్యాది శ్రుతి కర్మజ్ఞానముల నేకకాలమున

అనుష్ఠించువారు ముక్తులగుదురు." అని నిరూపించినందునను కర్మజ్ఞాన సముచ్చయమే విహితమైనదని తెలినది.

ప్రశ్న : మోక్షము కర్మసాధ్యమగునెడ అనిత్యమగును. "యత్ కృతకం తదనిత్యమ్" ఎద్ది కర్మసాధ్యమో అద్ది నిత్యము కాదు. అను న్యాయము గమనార్హము గదా !

ఉత్తరము : జ్ఞానరహితకర్మ-కృతకము కాగా తత్సాధ్యము అనిత్యము అను న్యాయము మాకును సమ్మతమేను. కాని ఇట కర్మ సహిత జ్ఞానమును మేము నిరూపించుటచే జ్ఞానాంగమగు కర్మ అక్షయము గానను తత్సాధ్యమగు మోక్షము నిత్యంబే నగును.

## 3-4. కర్మ-గుణకర్మ యని పరిష్కారము

జ్ఞానమువలె కర్మగూడా మోక్షఫలము నొసఁగునదగుటచే నిత్య నైమిత్తికాది కర్మలు అర్థకర్మలగునని చెప్పరాదు. తుష (పొట్టు) విమోకమువరకే చేయవలసిన వ్రీహిప్రోక్షణమువలె గుణకర్మలు కావనియు గూడ భావింపరాదు.

అర్థకర్మయనఁగా- మహాఫల ప్రాప్తివరకు సహకరించునది.

గుణకర్మయనఁగా- అవాంతర ప్రయోజన సిద్ధివరకే ఆచరింపదగినది. ఐతే ఇఁట నిత్య నైమిత్తికకర్మలు-చిత్తశుద్ధివరకే ఆచరింపఁదగినవై గుణకర్మలుగా చెప్పఁబడినను-చిత్తశుద్ధిలో మార్పు రాకుండుటకై గుణకర్మల నాచరింపవలసియుండును.

పూర్వ జన్మార్జిత సుకృతబలమున కలిగిన పరమేశ్వరుని అనుగ్రహమువలన చిత్తశుద్ధి కలిగినను ఈ జన్మయందుగూడా జ్ఞాన (ఉపాసనా) సహకృతములుగా కర్మల నాచరింపవలసినదేను :

శ్లో॥ ప్రసన్నే సతి కీటోవా-పతంగో వా విముచ్యతే।
గర్భస్థోఽపి విముచ్యేత-సాంబే సంసారభేషజే॥

"సంసారము అను మహావ్యాధిని పోగొట్టు పరమ ఔషధమువంటి సాంబమూర్తి- ప్రసన్నుఁడైనచో-పురుగైనను పక్షియైనను గర్భస్థుడైనను ముక్తులగుదురు" ఇత్యాదిని-గర్భస్థవామదేవునకు గూడ-జ్ఞానోదయము ఐనట్లు-విదితమగుటచే-బ్రహ్మవిచారము జ్ఞానసాధనమగుట భంగపడును గాన- పై శ్లోకాదివిషయము-వ్యక్తిగతమని తెలియవలెను.

"అవిద్యయా మృత్యుం తీర్త్వా-విద్యయాఽమృత మశ్నుతే" శ్రుతి. అవిద్యయు = పురాకృతములతో ఉపాసనానుష్టానమును నిరోధించు దురితములు తొలగినను ఉపాసనఁజేయుపానికి జీవితాంతము వరకు ప్రత్యహము ప్రమాదవశమున సంభవించు ఉపాసనాప్రతిబంధక దురితములు-వెంటది వెంట నివర్తించుటకు- ఉపాసనాసమ కాలమునందే అనుష్ఠింపఁబడు కర్మజాతముచే, మృత్యుం = మృత్యుమయసంసార సముద్రమును, తీర్త్వా = దాటి, విద్యయా = అ తరువాత నిర్విఘ్నముగా కొనసాగునట్టి ఉపాసతో, అమృతం = మోక్షమును, అశ్నుతే = పొందును" అని శ్రుత్యర్థము.

ఇట్లు చెప్పుటచే- నిష్కామ నిజవర్ణాశ్రమ ధర్మముతో కూడినది. ఉపాసనారూపమగు జ్ఞానముగా చెప్పఁబడునదియు నగు భక్తియే ముక్తికి పరమసాధనమగునని-విశదమైనది.

## 3-5 ధ్యానయోగవిధిపరిష్కారము

సాంఖ్య తారక అమనస్కయోగములు- ఆత్మసాక్షాత్కార సాధనములుగా చెప్పఁబడినను ఇయ్యవి-ధ్యానయోగముద్వారా-

పరమేశ్వర సాక్షాత్కారసాధనములగునని అంగీకరింపవలసి వచ్చును.

సాంఖ్యమనఁగా-"అన్యోంతర ఆత్మాఽఽనందమయః"అన్నట్లు తత్త్వములన్నిటిని మించిన పరమాత్మ-ఆనందమయుఁడు అని భావించుట-

తారకమనఁగా- "ఓమిత్యేవాత్మానం ధ్యాయథ!" "ఓమ్ అను దానితో పరమాత్మను ధ్యానించుట" అనునది.

అమనస్కమనఁగా- "మనో యన్న మమతే" "మనస్సు దేనిని గూడ చింతింపక- స్తంభించుట-

ధ్యానయోగము-మోక్షసాధనము కాదనునెడ "అభిధ్యాయీత" "నిదిధ్యాసితవ్యమ్" ఇత్యాదిని చెప్పఁబడిన ధ్యానవిధులు-నిరుపయోగములగును-

ఇందువలన "ఓమిత్యేవాత్మానం ధ్యాయథ" అనుచో తారకయోగము ధ్యానాంగమని చెప్పుట-సంగతంబైనది. మరియు మహాభారతమున మోక్షధర్మపర్వమునందు 321వ అధ్యాయమున "ఏవం హి పరిసంఖ్యాయ-తతో ధ్యాయంతి కేవలం-సయుక్తః పశ్యతే బ్రహ్మ-యత్తత్ పరమమవ్యయమ్-మహత స్తమసోమధ్యే-స్థితం జ్వలనసన్నిభమ్"

"యోగులు ఇన్విధము తత్త్వములను పరిగణించి-తత్త్వాతీతులైన కేవల శివుని ధ్యానింతురు. అట్టి ధ్యానయోగి సర్వశ్రేష్ఠము అవ్యయము నగు బ్రహ్మమును గొప్పచీకటిలో మంటను వలె ధ్యానమున దర్శించును" అనుచో- బ్రహ్మసాక్షాత్కారము-ధ్యానయోగలభ్యమని ఉపదేశింపఁబడినది.

ఇంతియే గాక-భగవద్గీతయందు

"ఆత్మసంస్థం మనః కృత్వా-న కించిదపి చింతయేత్" "మనస్సును బుద్ధియందు నిలిపి-దేనిఁ గూర్చియు ఆలోచింపవలదు" అని ప్రారంభించి-"యుంజన్నేవం సదాఽఽత్మానం. యోగీ విగత కల్మషః సుఖేన బ్రహ్మసంసర్శ-మత్యంతం సుఖ మశ్నుతే" ఇట్లు తన అంతఃకరణమున ధ్యానము నభ్యసించు యోగి-కల్మషములఁ బోకార్చుకొని- అనాయాసముగా బ్రహ్మమును పొంది అత్యంతసుఖ (ఆనంద)ము ననుభవించును."

ఇందువలననే "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" మనస్సును నిర్విషయము నొనర్చుటచే సంభవించు ఏకాగ్రబుద్ధిని పురస్కరించు కొని చేయఁబడు ధ్యానముతో పరమాత్మ- సాక్షాత్కరించును" "అధ్యాత్మయోగాధిగమేన దేవం-మత్వా ధీరో-హర్షశోకౌ జహాతి" "ధ్యానయోగముచే దేవుని చింతించు ధీరుఁడు ప్రాకృత సుఖదుఃఖములను విడనాడును." ఇత్యాది ధ్యానయోగ ప్రతిపాదకములగు వచస్సులు-సుసంగతములగుచున్నవి.

ఐతే—పరులు నిరీశ్వర సాంఖ్యము నవలంబించి-తత్త్వములను పరామర్శించి-ఆత్మను గుర్తించుటయే ఉపనిషత్తులయందు ప్రతిపాదింపఁబడినదని చెప్పుట సరియైనది కాదని గ్రహింపవలెను. ఎందుకనఁగా? తత్త్వవివేచన మాత్రమున ఏర్పడు ఆత్మ-"ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్" ఇత్యాదిని నిరూపింపఁబడిన- ఆదిత్యవర్ణత్వాదులు గలది కానందున-అణవగు ఆత్మను గుర్తించుటయే పరమావధిగా గల పరాభిమతము పరిగ్రాహ్యము కాకున్నయది.

మేము చెప్పెడు ధ్యానయోగము కష్టసాధ్యమైనను-పట్టుదలతో ఆచరింపఁబడినయెడల-సుసాధ్యమగును. ఈ జన్మయందు ధ్యానయోగము సంపూర్ణసిద్ధము కాకున్నను శుచివంశమున మరలజన్మించి

పూర్వాభ్యాసవశమున ధ్యానయోగ సంపూర్ణ సిద్ధితో పరమేశ్వరుని దర్శించి ముక్తుఁడగునని- భగవద్గీతయందు నిర్ణయింపఁబడినది- తర్హి- ఈ పునర్జన్మము-శ్రౌతశైవారాధ్యత్వమని- శివాగములఁబట్టి గ్రహింపనగును.

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం-ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిమ్" 'మననశీలుఁడు పరమేశ్వరుని- శక్తివిశిష్టునిగా, సర్వనియామకునిగా, త్రిలోచనునిగా, నీలకంఠునిగా, ప్రశాంతునిగాను ప్రతిదినము ఒక నిమిషమైనను మనస్సున ధ్యానించుచుండినచో- కాలక్రమమున ప్రసన్నుఁడగు శివుని అనుగ్రహమున నిశ్చలమనస్సున- పరమేశ్వరుని నెక్కువ కాలము ధ్యానింపఁగలుగును. అందువలన- ప్రారబ్ధాంతమునందు సమస్తప్రాణి జనకుఁడగు పరశివు నాశ్రయించి శివసముఁడై- పునరావృత్తి రహిత పరమపదమున విరాజిల్లుచు నిరతిశయశివానందమునను భవించుచు ప్రాకృతములను స్మరింపకుండును.

ఐతే ఇట్టి స్థితి చేకూరుటకు వలయు ప్రాణలింగోపాసమునకు ద్వారమగు ఇష్టలింగధారణము నొనర్చి- భస్మగంధాక్షత పుష్ప బిల్వాదులతో నర్చించుచు- శ్రీ ప్రణవపంచాక్షర మహామంత్రమునను సంధించుచు "శివోఽహం" ఇత్యాది భావనతో ధ్యానయోగమును సిద్ధింపఁజేసికొనవలెనని- సారాంశము.

ఉపసనావిధి, కర్మజ్ఞానైకరూప్య.కర్మజ్ఞానసముచ్చయ, కర్మణో గుణకర్మత్వ-ధ్యానయోగవిధులనఁబడు ఐదు అవాంతర పరిష్కారములతో సాధన పరిష్కారము సమాప్తము.

ముఖ్యములలో నాలుగవదైన

# 4. జగత్పరిష్కారము

ప్రశ్న: కుమ్మరివాని కంటె - కుండ మున్నగునని వేరైనట్లు కార్యమగు జగత్తు - కారణుడైన ఈశ్వరుని కన్న - భిన్నమైనదని చెప్పుటయే సమంజసమని తోచెడిని. మీరేమందురు?

ఉత్తరము: "వాచాఽఽరంభణం వికారో నామధేయం - మృత్తికేత్యేవ సత్యమ్" "మట్టి యనునదియే సత్యమగుటజేసి - మృత్తిక యొక్క వికారములగు ఘటాదులు అవ్వాని పేరులున్ను వేదవాక్కునుదాహరించుటవలన సత్యములగునవి. "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" "సౌమ్యుడా! సృష్టికి మున్ను ఈ జగత్తు సదాత్మకముగానే యుండెను. "ఏకమేవాద్వితీయమ్" "బ్రహ్మము - తనకంటె వేరైన రెండవదిలేనిదై ఒకే తత్త్వముగ నున్నయది. "ఐతదాత్మ్యమిదగ్ం సర్వమ్" "ఈ జగత్తంతయు పరమాత్మ అంతర్యామిగ కలదై యున్నది." విశ్వం భూతం భువనం చిత్రం బహుధా జాతం జాయమానంచ యత్ - సర్వో హ్యేష రుద్రః" "ఐనది, కాకున్నది, చిత్రంబు, అనేక విధములుగా ఆవిర్భవించినది. ఆవిర్భవించుచున్నదియునగు ప్రపంచము సమస్తంబు నీ రుద్రుడే సు." ఇత్యాది శ్రుతి వాక్యములు కారణమగు పరమేశ్వరుని కన్న - కార్యమగు జగత్తు - వేరైనది కాదని ప్రతిపాదించుచున్నందున - ఘటాదికార్యములయందు కారణమగు మృత్తిక ఇమిడియున్నదని తెలియవలెను.

కార్యకారణము లొకటైనను అవస్థా బేదముచే మృత్తికాప్వా ఖావము, ఘటాదుల ప్రయోజనమున్ను అవగతములగును గాన కారణ కార్యములు పృథక్సిద్ధమైన భేదము లేనివనియే తేటపడును.

మట్ ఘటములకు వలె బ్రహ్మ ప్రపంచములకు వ్యాప్యవ్యాపక భావముండుటచే- బ్రహ్మప్రపంచములు భిన్నములు కాజాలవు.

శ్లో॥ శక్త్యాది చ పృథివ్యంతం- శివతత్త్వసముద్భవం ।
తేనైకేన తు తద్వ్యాప్తం-మృదా కుంభాదికం యథా॥

శక్తి మొదలుకొని- పృథివి వరకు గలవన్నియు శివతత్త్వము నుండి ఆవిర్భవించినవి. మట్టిచే కుండమున్నగునవి వలె- శివునిచే జగత్తంతయు వ్యాపింపఁబడినది. అను పురాణవణితియు పై యంశము సమర్థించుటఁజేసి- కేవలభేదనాదులు చెప్పెడు- జగదీశ్వ రాత్యంత భేదము నిరసింపఁబడినది.

## 4-1 జగత్సత్యత్వపరిష్కారము

ప్రశ్న: కార్యము- కారణమునకంటె వేరైనదికానిదగుటచే కార్యము అనఁదగు వస్తువు లేదనియే చెప్పవచ్చును. కార్యము, కార్యముయొక్క వ్యవహారమున్ను అవిద్యాకల్పితములగుటఁ జేసియు కారణమగు మృత్తికకంటే కార్యములగు ఘటాదులు- మిథ్యయని తోచెడిని. ఇట్లే జగత్కారణమగు బ్రహ్మమే సత్యముకాగా కార్యమగు జగత్తు బ్రహ్మ వ్యతిరిక్తము కాదు గాన- లేదనియే అంగీకరింపవలెను గదా!

ఉత్తరము: "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః అను శ్రుతిలో ఆరంభణ శబ్దాదులుండుటచే- కార్యము కారణంబు భిన్నములు కానివై అవస్థాభేదము గలవియునై విశేషణవిశేష్య భావముతో అపృథక్ సిద్ధములుగా అవినాభావసంబంధము గలవిగా అనన్య (అభిన్న)ములు గాను చెప్పఁబడినవి. అంతమాత్రమున కారణమగు బ్రహ్మము సత్య మనియు, కార్యమగు జగత్తు మిథ్యయనియు నిరూపింపరాదు. లోక

ప్రసిద్ధమైన మృద్ఘటదృష్టాంతమున ఘటాదులలో మృత్తిక ఇమిడి యుండుటచే మృత్ఘటములు రెండును సత్యములని- తేటపడును. ఘటము మిథ్య మృత్తిక సత్యమనుచో మృద్ఘటదృష్టాంతము ఉపపన్నము కాజాలదు. అట్లు కాదందురేని మృత్తిక- ఘటము అను కారణకార్యముల నుదాహరించుట అనుపయుక్తమగును.

శ్రుత్యర్థము- ఆరభ్యత ఇతి ఆరంభణం అనువ్యుత్పత్తి వలన నపుంసకమగు ఆరంభణశబ్దము- నామధేయశబ్దమునకు విశేషణము కాగా- మృద్వికారమగు ఘటాదికము- మృణ్మయమగుటచే- సత్యమైనది. కారణమగు మృత్తికకంటె కార్యమగు ఘటాదికము అత్యంత భిన్నము కానిదై సత్యమగుచున్నయది.

అట్లే కారణమగు బ్రహ్మమును నిరాకరించి- స్వతంత్రముగా మనఁజాలనట్టి జగత్తు-అసత్తుగా భాసించినను కారణము నెడబాయక ప్రవర్తించునదగు జగత్తు- సత్యమనియే తేటపడును.

బ్రహ్మమును గురించి వినినచో సమస్తము వినఁబడు నను శ్రుతిచే బ్రహ్మమువలె జగత్తు గూడ అస్తిత్వము కలిగియుండు నను అర్థము పరిగ్రాహ్యం బగును. ఇంతియేగాక వేదవ్యాససూత్రమున అనన్యత్వ శబ్దముండుటయు, మిథ్యాశబ్దము లేకుండుటయు గమనార్హములు.

స్వప్నానుభూతములు జాగ్రదవస్థలో లేనిదై మిథ్యయైనట్లు భ్రాంతిలో భాసించు జగత్తు- బ్రహ్మదృష్టిని లేదనుట సరి కాదు.

స్వప్నములు- శుభాశుభసూచకములనియు, పరమేశ్వరుఁడే సాధకుని అభీష్టరూపమున-స్వప్నమున శుభాశుభములఁ జెప్పుననియు శాస్త్రమునందు ప్రతిపాదింపబడినందున- స్వప్న దృష్టాంతము-జగన్మిథ్యాత్వమును సాధింపఁజాలదు-

సుషుప్తిలో జీవాత్మ-పరాత్మతో ఏకీభవించుననుటలో-జీవాత్మ యొక్క నిత్యత్వము బోధపడుచున్నయది.

ఏతావతా-జగత్తు సత్యము, జీవాత్మ-నిత్యుఁడు బ్రహ్మము నిత్యసత్యంబు ననుట- శ్రుతి స్మృత్యాగమాది ప్రమాణసమ్మతమై అనుభవసిద్ధంబగుచున్నదవి- విదితమైనది.

## జగత్పరిష్కారమున

## 4-2 పరిణామవాదపరిష్కారము

శ్రీ వేదవ్యాసభగవానుఁడు "పరిణామాత్" అను సూత్రమున బ్రహ్మము జగద్రూపముగా పరిణమించునని-నిరూపించెను.

"కారణము- తన రూపమును విసర్జించి- కార్యరూపమున మారుట పరిణామము" అను న్యాయము ఈ విషయమై ప్రవర్తింపదు.

"పూర్వరూపము ఉండగానే రెండవ రూపము ఏర్పడుట- పరిణామము" అను న్యాయము- ఇఁట ఉపయుక్తమగునది. జీవాత్మ- తన స్థితిని విడనాడక-ఇచ్ఛ మొదలగు విశేషములతో ఏకీభవించి కామాత్మగా పరిణమించుట- అనుభవసిద్ధమైనట్లు బ్రహ్మము-స్వపూర్ణత్వమునకు భంగము లేకుండ జగద్రూపమున పరిణమించుట-శ్రుతి సూత్రసమ్మతమైనది.

"ప్రధానము సత్త్వరజస్తమో గుణములున్ను సంపూర్ణ పరిణామము గలవగును" అను సాంఖ్యావాదమున- ప్రధానమునకు సత్త్వాది గుణములకును స్వరూప వినాశము తారసిల్లును- అట్టి పరిణామము బ్రహ్మమునకు ఘటింపదు. "పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే" అను శ్రుతివాక్యమున- వివిధశక్తుల ద్వారా

జగద్రూపమున పరిణమించు బ్రహ్మమునకు-ఎట్టి క్షతిలేదని తెలియవలెను.

ఇత్యాది సందర్భముఁ బట్టి బ్రహ్మము జగద్రూపమున పరిణమించుననుటయే సమంజసంబని- తేటపడినది.

జగత్పరిష్కారమున

## 4-3 విశిష్ట కార్యకారణభావ పరిష్కారము

బ్రహ్మమే కారణము కార్యంబగుట- శ్రుతిస్మృతి విహితముగా కనఁబడును. ఎట్లనఁగా?

"విశ్వాధికో రుద్రో మహర్షిః" "సర్వజ్ఞుఁడైన రుద్రుఁడు-విశ్వము నధిష్ఠించి విశ్వమును మించినవాఁడగును."

"ద్యావాపృథివీ జనయన్ దేవ ఏకః" "భూమ్యాకాశోపలక్షితమగు జగత్తు నొకే మహాదేవుఁడు సృజించెను" ఇత్యాది శ్రుతులు పరమేశ్వరుఁడు జగత్కర్తగా కారణమగుననియు "సర్వో వై రుద్రః" "రుద్రుఁడు సమస్త జగద్రూపుఁడు" "బ్రహ్మవనం, బ్రహ్మస వృక్ష ఆసీత్" "బ్రహ్మము-వనము, వృక్షాదికమునగును" ఇత్యాది శ్రుతులు పరమేశ్వరుఁడు- జనత్తుగా పరిణమించి కార్యమగుననియు- విశదపఱచినవి.

"సాక్షాచ్చోభయామ్నానాత్" అను వ్యాససూత్రమున బ్రహ్మమునకు కారణత్వము కార్యత్వంబును నిర్ణయింపఁబడినవి. "సోఽకామయత-బహు స్యాం ప్రజాయేయేతి-తదాత్మానగ్ం స్వయ మకురుత" "పరమాత్మ- అనేకమునగుదునని సంకల్పించెను." "అప్పుడు తానే జగత్తుగా పరిణమించెను" ఇత్యాదిని పరబ్రహ్మము- బహుభవన

సంకల్ప పూర్వకముగా- తానే జగదాకారము గలవాడయ్యెనని అవ గతమగుచున్నందున-విశిష్టకార్యకారణభావమునకు-పరులు చూపెట్టు కుతర్కము-వైదిక జన పరిగ్రాహ్యము కాజాలదు.

సూక్ష్మచిదచిద్విశిష్టమగు బ్రహ్మము కారణము కాగా-స్థూలచిద చిద్విశిష్టమగు బ్రహ్మము వార్యంబగు ననుటలో- సూక్ష్మదశ, స్థూల దశయు చిదచిత్తులకే గాని బ్రహ్మమునకు లేవు నను నర్థము ఇమిడి యున్నదని తెలియవలెను.

సూక్ష్మమనఁగా-నామరూప విభాగము లేనిది.

స్థూలమనఁగా-నామరూప విభాగము కలది.

చిత్-అనఁగా-జీవాత్మ, అచిత్తనఁగా పాంచభౌతిక ప్రపంచము. ఈ రెంటికి ఆధారమగు శక్తి-శివు నెడబాయకుండును గాన- శక్తికి గల సూక్ష్మస్థూలదశలు- శివునకు సంఘటించుచున్నవి. అందువలన అట్టి శక్తితో కూడియుండు (విశిష్ట) బ్రహ్మమే కారణము కార్యంబు నని నిరూపించుట- సమంజసంబైనది.

"విశిష్టం చ-విశిష్టం చ=విశిష్టే,(బ్రహ్మణీ) తయో దద్వైతం (ఐక్యం)అథవా-విశిష్టశ్చ విశిష్టశ్చ= విశిష్టౌ(శివౌ) తయోరద్వైతం =విశిష్టాద్వైతమ్"అని నిర్వచనము.

ఇట్లు చెప్పుటవలన- విశిష్ట కార్యకారణభావమే- సుసంపన్న మైనదని- విదితమైనది.

ఇఁట నొక రహస్యము పొందుపరుపఁబడుచున్నది. ఎట్లనఁగా- "లోకవత్తు లీలాకైవల్యమ్" అను బ్రహ్మసూత్రమున పరమేశ్వరుని లీలావస్థ సృష్టి కాగా- కేవలావస్థ ప్రళయమగును. శివుఁడు-లీలా

విలాసముగ సృష్టిఁ జేయుననియు-తానొంటరిగా నుండవలెనను కేవల స్థితియందు ప్రళయముఁ జేయుననియు వివేకము.

అందుకే "క ఇత్థా వేద యత్ర సః" ప్రపంచకబళ భోక్తృత్వ విషయమై పరమాత్మ- ఇంతటివాడే నని ఎవఁడు గుర్తించును? అని కఠవల్లి అవశముగా చెప్పవలసివచ్చినది.

## 4-4 శక్త్యుపాదానత్వపరిష్కారము

దిగువ నుదాహరింపఁబడిన శ్రుతులు- అచిత్తు భోగ్యమనియు, చిత్తు = భోక్త యనియు, పరబ్రహ్మము- చిదచిత్తులను శాసించున దనియు తేటపఱచుచున్నవి.

"అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్— తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" "మాయాశక్తిసంపన్నుఁడగు పరమేశ్వరుఁడు విద్యావిద్యాస్వరూపమగు శక్తి తత్త్వముయొక్క పరిణామముగా ఈ విశ్వమును నిర్మించుచున్నవాఁడు".

"మాయాం తు ప్రకృతిం విద్యాత్- మాయినం తు మహేశ్వరమ్" "మాయాశక్తి- జగత్తునకు ఉత్పత్తిస్థానముగా ప్రకృతియనియు మహేశ్వరుఁడు-మాయాశక్తి నధిష్ఠించి ప్రవర్తింపఁజేయువాడనియు తెలియవలెను".

"క్షరం ప్రధానం అమృతాక్షరం హరః-క్షరాత్మానా వీశతే దేవ ఏకః" "ప్రధానము (ప్రకృతి) దేహేంద్రియాత్మనా క్షరం (మార్పులతో క్షీణించునది కాగా- హరతీతిహరః = దేహేంద్రియాదుల నాకర్షించి అదుపులో పెట్టగల జీవాత్మ-అమృతాక్షరం = జనన మరణాదులు లేని అక్షరుఁడు (క్షీణించువాఁడు కాఁడు) అనియు క్షరమును జీవాత్మను శాసించు దేవుఁడు ఒకఁడేను."

"స కారణం-కరణాధిపాధిపో-న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః" "పరమాత్మ-జగత్కారణమే గాక-కరణము (దేహేంద్రియాదు)లకు అధిపుఁడైన జీవాత్మపై అధికారము గలవాడును, ఇట్టి పరమాత్మకు-ఒకానొక జనకుఁడు గాని అధికారి గాని లేడు."

"ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః" ప్రకృతిని క్షేత్రజ్ఞుఁడగు జీవాత్మను శాసించు ప్రభువు, సత్త్వరజస్తమోగుణములను వశపఱచుకొనునట్టి- లేక సర్వజ్ఞత్వాది నిత్యగుణములు గలయట్టివాడు-ఈశ్వరుఁడేను."

"పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం" "విశ్వమునకు ప్రభువు జీవాత్మను ప్రేరేపించు ఈశ్వరుఁడును పరమేశ్వరుఁడేను".

"జ్ఞాజ్ఞౌ ద్వా వజా వీశానీశౌ" జీవేశ్వరులు-నిత్యులు కాగా, ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు స్వతంత్రుఁడునై జీవుఁడు-కించిజ్ఞుఁడు పరతంత్రుఁడునై యుండువారు".

"నిత్యో నిత్యానాం-చేతన శ్చేతనానాం-ఏకో బహూనాం యో విదధాతి కామాన్"

"పరమేశ్వరుఁడు- నిత్యులైన జీవాత్మలకు-శాశ్వతనిత్యమగు తన (శివ) రూపము నొసఁగువాడు, చేతనులగు జీవాత్మలు-తనను ధ్యానించునెడ తన సంకల్పముచే పూర్వము మఱుగుపడిన-సంపూర్ణ దై తన్మూర్తిని (ఆనందపరిపూర్ణతను) కలుగఁజేయువాడు తానొకఁడే-ఇష్టప్రాణ భావలింగములయందు తన నుపాసించు మాహేశ్వరులకు కామ్యముల ననుభవింపఁజేసి- విరక్తిని కలిగించియు సకల కామావాప్తి రూపమగు మోక్షమును ప్రసాదించును."

"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా-జుష్ట స్తత స్తేనామృతత్వమేతి" "సాధకుఁడు- "భోక్త-సుఖదుఃఖముల ననుభవించు

జీవాత్మ, భోగ్యం=అనుభవింపఁదగిన దేహేంద్రియాది ప్రపంచము, ప్రేరితా=జీవాత్మను సుఖదుఃఖానుభవమునకై ప్రేరేపించు పరమాత్మ, ఈ మూడు- అపృథక్ సిద్ధమైన భేదము గలవని భావించువాడు- పరమేశ్వరునిచే అనుగ్రహింపఁబడినవాడై మోక్షమును పొందును."

ఇఁక శక్తి పరమేశ్వరునాజ్ఞచే జగత్తునకు ఉపాదానకారణమగుటను దిగువ శ్రుతి-స్పష్టపఱచినది.

"అజా మేకాం లోహిత శుక్లకృష్ణాం-బహ్వీః ప్రజా జనయంతీగ్ం సరూపాః- అజో హ్యేకో జుషమాణోఽనుశేతే- జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః" "ప్రకృతి(మాయాశక్తి) సామాన్యమైనది కాదు. సత్వరజస్తమో గుణములు నిండియుండిన ప్రకృతి-తనతో సమానులైన- అనఁగా కొందరిని సత్త్వ గుణాధికులు గాను, మరికొందరిని రజోగుణప్రాచుర్యము గలవారిగాను ఇంక కొందరిని తమోగుణ ప్రధానులుగాను పుట్టించును.

ఇట్లుండగా- సంసారియగు జీవాత్మ- అత్యాసక్తితో (తేనె నాకినట్లు) ప్రకృతిని అనఁగా- దేవమానవాదులఁజెందిన-దేహేంద్రియాది సుఖముల ననుభవించును. అట్లే- పరవశుఁడై దుఃఖముల పాలగును. మరియొక జీవాత్మ (వేలకొకఁడు) అనేక జన్మలయందు ప్రకృతి ననుభవించుటచే విసుఁగుఁజెంది- విరక్తి గలవాడై-దేహేంద్రియాది జడప్రకృతియందు ఆసక్తి లేనివాడై-శివానుగ్రహమున శాంభవ దీక్షితుఁడునై పరమేశ్వరునందు నిష్ఠ గలవాడగును."

"సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః జుష్టో యదా పశ్యత్యన్యమీశ-మస్య మహిమాన మితి వీతశోకః"

"పురుషః=జీవాత్మ, సమానే వృక్షే=పరమాత్మతో సహ శరీరము అను వృక్షమునందు, నిమగ్నః=ఆసక్తితో ఉన్నవాడై, అనీశయా=పారతంత్ర్యముచే, ముహ్యమానః=మోహముఁ జెందినవాడునై, శోచతి=దుఃఖించును. యదా=ఎప్పుడైతే, జుష్టః=పరమేశ్వరునిచే అనుగ్రహింపఁబడినవాడై, అన్యం= తనకంటె నితరుడై, తనలో నున్నట్టి, ఈశం=పరమేశ్వరుని, పశ్యతి=శాంభవదీక్షితుఁడై ఉపాసించునో, (తదా= ఈ జన్మయొక్క ప్రారబ్ధాంతమున) అస్య =ఈ పరమాత్మయొక్క, మహిమానం = ఆనందమయత్వాది మహిమను, వీతశోకః = జనన మరణ జరావ్యాధ్యాది దుఃఖమును బొత్తుగా పోగొట్టుకొనినవాడై, ఇతి (ఏతి)=పొందును "

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ-విద్ధ్యనాదీ ఉభావపి ।
మమ యోని ర్మహద్బ్రహ్మ-తస్మిన్ గర్భం దధామ్యహమ్॥
సంభవ స్సర్వభూతానాం-తతో భవతి భారత !

భరతవంశోద్భవా! ప్రకృతి, పురుషుఁడు నీ రెండును అనాదులై నిత్యములగునని గుర్తింపుము! జగద్యోని గొప్పదియు నగు ప్రకృతి యందు-చిద్రూపుఁడగు జీవాత్మను ప్రవేశింపఁజేయుట యను గర్భము ను నెలకొలుపుదును. నాచే చేయఁబడిన అచిద్వస్తుసంసర్గము వలన అచిన్మిశ్రులు దేవాదిస్థావరాంతులు నగు ప్రాణుల యుత్పత్తి యగును. అను(గీతా) స్మృతియు- జగత్తు శక్త్యుపాదానమగుటను సమర్థించుచు ప్రకృతిపురుషులు-మిథ్యకారని ఉద్ఘాటించినది.

చిచ్ఛక్తి-జగత్తునకు ఉపాదానమైనను చిచ్ఛక్తితో కూడియుండు పరమేశ్వరుఁడు- జగదుపాదానమని యంగీకరింపవలసి వచ్చినది.

శ్లో॥ శక్తయోఽస్యజగత్కృత్స్నం-శక్తిమాంస్తుమహేశ్వరః
శక్తిస్తు శక్తిమద్రూపాత్-వ్యతిరేకం న గచ్ఛతి॥
తాదాత్మ్య మనయో ర్నిత్యం–వహ్నిదాహికయో రివ।
శక్తిశక్తిమతో ర్యస్మా-దభేద సర్వదా స్థితః ।
న వహ్నే ర్దాహికా శక్తిః-వ్యతిరేకా విభావ్యతే ॥

"పరమాత్మయొక్క శక్తులు- సమస్త జగత్తు కాగా- పరమేశ్వరుఁడు శక్తిమంతుఁడగును. శక్తిమంతుని రూపమునుండి శక్తిని విడదీయరాదు గాన మహేశ్వరుని నిరాకరించినచో శక్తి ప్రవర్తించునది కాదని తెలియుచున్నది. అగ్నిదాహకులకువలె వీరిరువురికిని ఐక్యము నిత్యమైనది. నిప్పునకు కాల్పు విడిగా నుండనట్లు మహేశ్వరుని విడిచి మాయాశక్తి ఉండజాలదు.

ఐతే బ్రహ్మము శక్తిద్వారా జగద్రూపంబని "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతివాక్యము వెల్లడించినది.

ఇత్యాది సందర్భముచే- జగత్తు—శివునాశ్రయించి శివునాజ్ఞచే ప్రవర్తించు శక్తి ఉపాదానముగ గలదనియు, శక్తి శక్తిమంతులకు అవినాభావము నిరంతరముండుటచే శక్తివిశిష్టుఁడైన శివుఁడే జగద్రూపుఁడనియు, విశదమైనది.

## 4_5 బ్రహ్మశరీర రూపత్వ పరిష్కారము

బ్రహ్మము-తనచే నియమింపఁబడు ప్రపంచమును వ్యాపించునదగుటచే సర్వచిదచిత్ప్రపంచము శరీరముగా కలదగును.

ఇందుకు శ్రుతి ప్రమాణములు ఉదాహరింపబడుచున్నవి.

"యః పృథివ్యాం తిష్ఠన్- పృథివ్యా అంతరో, యం పృథివీ

న వేద- యస్య పృథివీ శరీరం- యః పృథివీ మంతరో యమయతి ఏష త ఆత్మాంఽతర్యామ్యమృతః"

"పృథివి నంతర్యామిగ నుండు పరమాత్మను- పృథివి- గుర్తింపదు. కాని పరమాత్మకు పృథివి- శరీరము కాగా- పృథివిని లోనుండి నియమించు ఈ అమృతుఁడగు పరమాత్మ- నీకు నంతర్యామి యగును.

అనునది మొదలుకొని "యో విజ్ఞానే తిష్ఠన్- విజ్ఞానాదంతరో యం విజ్ఞానం న వేద-యస్య విజ్ఞానం శరీరం- యో విజ్ఞానమంతర్యమయతి-ఏష త ఆత్మాంఽతర్యామ్యమృతః"

"విజ్ఞానమనఁదగు జీవాత్మ నంతర్యామిగ నుండు పరమాత్మను విజ్ఞానము (జీవాత్మ) గుర్తింపదు. కాని పరమాత్మకు జీవాత్మ శరీరము కాగా- జీవాత్మను లోనుండి నియమించు ఈ అమృతుడగు పరమాత్మ నీకు నంతర్యామియగును" అనునది వరకు బ్రహ్మము సమస్త చిదచిచ్ఛరీరకంబని నిరూపింపఁబడినది.

ఈ యర్థమును దిగువ పూరాణసూక్తి ఉపబృంహించినది.

శ్లో॥ విగ్రహం దేవదేవస్య-జగదేత చ్చరాచరం।
ఏత మర్థం న జానంతి-పశవః పాశగౌరవాత్॥

విద్యేతి చేతనాం ప్రాహు-స్తథాఽవిద్యా మచేతనాం।
విద్యాఽవిద్యాత్మకం సర్వం-విశ్వం విశ్వగురోర్విభోః॥

రూప మస్య న సందేహో-విశ్వం తస్య వశే యతః।
వృక్షస్య మూలసేకేన-శాఖాః పుష్యంతి వై యథా।
శివస్య పూజయా తద్వత్-పుష్యత్యస్య వపుర్జగత్॥

ఆత్మా తస్యాష్టమీ మూర్తిః-శివస్య పరమాత్మనః।
వ్యాపికేతరమూర్తీనాం-విశ్వం తస్మాచ్ఛివాత్మకమ్॥

"చరులు(దేవమానవాదులు) అచరములు (తరుపర్వతాదులు) అనువానితో నుండు ఈ జగత్తు- మహాదేవుని విగ్రహమైయున్నది. సంసారపాశబద్ధులగువారు- పాశభారమున క్రుంగుచు ఈ విషయమును తెలిసికొనఁజాలరు. విద్యయనఁగా- చేతనమనియు, అవిద్యయనఁగా- అచేతనమనియు ప్రాజ్ఞులు చెప్పుదురు. విద్యాఽవిద్యాత్మకమైన విశ్వము విశ్వగురువు విభువు నగు పరమేశ్వరునకు రూపమైయున్నది. ఎందుకనఁగా? విశ్వము- పరమేశ్వరు నధీనమగునది. ఇవ్విషయమై సంశయింప నవసరములేదు. వృక్షముఁదగు మూలమును తడుపుటచే కొమ్మలు పెంపొందునట్లు- శివు నారాదించుట వలన- శివశరీరంబగు జగత్తు పరిపుష్టంబగును. శివుని పృథివ్యాద్యష్టమూర్తులలో- ఆత్మ శివుని ఎనిమిదవ మూర్తియై ఇతరమూర్తులను వ్యాపించునదగుటఁజేసి విశ్వము శివుని స్థూలరూపమగునని తెలియవలెను.

బ్రహ్మము విశ్వరూపముగా పరిణమించి- విశ్వమునకు కారణమగుటయు, విశ్వము బ్రహ్మకార్యమగుటయు- మట్టి కడవగా పరిణమించి కడవకు కారణము కాగా-కడవ మట్టియొక్క కార్యమైనట్లు- పొసగును.

కారణములో కార్యాంశము, కార్యములో కారణాంశము ఇమిడియుండుటచే- కారణకార్యములు పృథక్సిద్ధము కాని అంతర్భేదముగల ఏకవస్తువగుటవలన- విశిష్టాద్వైతము ఉపపన్నంబగుచున్నయది. వస్తుతః జగత్తుగా పరిణమించుట శక్తిచే ఐనను శక్తి ఈశ్వ

రునికంటె వేరుండదుగాన- జగత్తునకు ఉపాదానము పరమేశ్వరుఁ డనుటలో విరోధము లేదు-

"అస్య ప్రశాసనా ద్గార్గి- సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" "గార్గి! పరమాత్మయొక్క- శాసనమువలన సూర్యచంద్రాది జగత్తు యథాస్థానమున నిలచియున్నది" ఇత్యాది శ్రుతిచయము జగద్రక్షణము "యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః" బ్రాహ్మణ క్షత్రియోపలక్షితమగు జగత్తు- ప్రళయకాలమున ఆహారమగును" ఇత్యాదిని జగత్సంహారంబు "ఆత్మన ఆకాశ స్సంభూతః" ఇత్యాదిని జగత్సృష్టియు పరమేశ్వరునివలననే జరుగుచున్నవని అవగతమగుచున్నయది.

వేదవ్యాసుఁడును "జన్మాద్యస్య యతః" ఇత్యాదిసూత్రములయందు ప్రపంచగతములైన సృష్టి స్థితి సంహారములు- పరమేశ్వరుని వలన సంభవించునని- నిర్ధారించెను.

జగత్తు- భ్రాంతిమయమనునెడ- భ్రమకు ఆశ్రయమెవరు? బ్రహ్మమునకంటే వేరైనది లేదను పరాభిమతమున- భ్రమాశ్రయము జీవాత్మయని చెప్పరాదు. బ్రహ్మమే భ్రమాశ్రయమనునెడ బ్రహ్మము తుచ్ఛంబగును. అందువలన సత్యకాముఁడు సత్యసంకల్పుఁడు నగు పరమేశ్వరుని సంకల్పముచే నేర్పడు జగత్తు- పరమార్థసత్యమైనదని తేటపడినది. ఏతావతా- బ్రహ్మమునకు శరీరము రూపంబు-జగత్తగునని- మనము గ్రహించితిమి గదా!

## 4—6 శేషశేషిత్వపరిష్కారము

పరమేశ్వరునకు ప్రపంచమునకు- శేషశేషిత్వము కలదని "పశుపతయే" ఇత్యాదిశబ్దములవలన బోధపడుచున్నది. మరియు-

శ్లో॥ బ్రహ్మాది స్తంబపర్యంతం-పశూన్ బద్ధ్వా మహేశ్వరః।
పాశైరేతైః పతి ర్దేవః- కార్యం కారయతి స్వకమ్॥

అను పురాణ వాక్యము

"బ్రహ్మదేవుఁడు మొదలుకొని గడ్డి పఱకవరకు గల జీవాత్మలందరు- సంసారపాశబద్ధులగుటచే- పశువులనఁబడుదురు. అట్టి వారిని మహేశ్వరుఁడు పాశములచే బిగించి- తనను ఆరాధించుట యను కార్యమును చేయించుకొనును".

చేతనులు- తమతమ యోగ్యత ననుసరించి- శివారాధన రూపములగు భక్తి (జ్ఞాన) కర్మల ననుష్ఠించువారు కాగా అచేతనములు- శివారాధన స్థానములుగాను, పరమేశ్వరునకు ఉపయోగించుచున్నందున చరాచర ప్రపంచము శేషము గాను, తదధికుఁడగు మహేశ్వరుఁడు శేషిగాను నిర్ధారింపబడుట- సమంజసమైనది.

ఇందువలన- పరమేశ్వరుడు సర్వైశ్వర్య సంపన్నుఁడనియు, సర్వోత్కృష్టుఁడనియు విదితమైనది.

ముఖ్యములలో ఐదవదగు

## బ్రహ్మపరిష్కారము

పరమేశ్వరుఁడే జగత్కర్త యగును. ఎట్లనఁగా? ఈ జగత్తు దేవమానవ పశు పక్షి వృక్ష పర్వతాదులతో నిండినదై- దేశకాల నిమిత్తములకు అనుకూలములగు ప్రవృత్తి నివృత్తులు గలిగి భూలోక స్వర్గాది లోకములతో విచిత్రంబు, అనేక ప్రాణులచే అనుభవింపఁ బడు ప్రదేశములు సాధనములు గలదియు, నిపుణులైన శిల్పులచేత

నిర్మింపనలవి గానిదియునై భోక్తలగు జీవాత్మలచే చేయఁబడుకర్మల యొక్క విభాగమును గుర్తించు పరమేశ్వరునిచే నిర్మింపఁబడునదగుచున్నయది.

ఇట్లు చెప్పుటవలన- చిత్రవిచిత్రమైన జగత్తును నిర్మించు సామర్థ్యము గలది బ్రహ్మము- అను బ్రహ్మ లక్షణముయొక్క పరిష్కారము- అపగతమగుచున్నయది.

## 5–1 ప్రపంచ నిర్మాణమునకు కర్మ కారణము కాదను పరిష్కారము

ప్రశ్న: కర్మ- అచింత్య ప్రభావము గల దగుటచే నయ్యది ఫలహేతువగునని ఆచార్యులందరు అంగీకరించుటఁజేసియు కర్మ చేతనే జగత్తు ఏర్పడుచుండగా- ఈశ్వరుఁడు జగత్కర్త యని చెప్పుట ఎందుకు?

ఉత్తరము: "నీచేత నేను నిర్వర్తింపఁబడితిని. నీ యభీష్టమగు ఫలము ననుభవింపఁజేయుదును" అను అధికారము కర్మకు లేకుండుటచే- నయ్యది పరతంత్రమై యుండును.

ఒకవేళ - కర్మయే దేశకాలములను గుర్తించి స్వతంత్రముగా ఫలము నొసగు ననునెడ- కర్మకు ప్రతికూల ఫలములగు దుఃఖములఁ గూడ కలుగఁజేయవలసివచ్చును. యాగాది కర్మలు సమాప్తములు కాగా అట్టి కర్మలను కాపాడి- కాలాంతరమున తత్ఫలముల నొసఁగువాడు నిత్యుఁడు నగు ఈశ్వరుఁడేను.

అనుమాన ప్రమాణములతో ఈశ్వరుఁడు సిద్ధించుచున్నను

సర్వాత్మత్వము మొదలగు అనంతమాంగళ్యగుణములు గలవాడు నిర్దోషుఁడు పరమేశ్వరుఁడు అని వేదాంతములచే తెలియును గాన- బ్రహ్మము ఉపనిషన్మాత్ర ప్రతిపాద్యము- అను లక్షణమునకు భంగము లేదని విదితమైనది.

## 5—2 సగుణత్వ పరిష్కారము

పరులు భావించు నిర్గుణపరమైన ప్రకరణములో "సర్వస్య వశీ సర్వస్యేశానః" "పరమేశ్వరుఁడు-చరాచరప్రపంచమునంతయు అదుపులో నెలకొలిపి- సమస్తమును శాసించువాడు" ఇత్యాది శ్రుతిని "బ్రహ్మము సగుణము" అని యుండుటచే- బ్రహ్మము సగుణము అను సంశము నివారింపఁదగినది కాదని తెలియుచున్నది.

"ఏష ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః" "ఈ పరమాత్మ పాపములు లేనివాడై ముసలితనము మృత్యువు దుఃఖము ఆకలిదప్పులును లేనివాడునై యున్నవాడు" అనుచో శ్రుతి- జరామరణాదులను నిషేధించుటచే-సర్వేశ్వరత్వాది గుణములు నియతములుగ గలవాడు పరమాత్మ యని తేటపడును.

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" శబ్దము స్పర్శ రూపము లేని అవ్యయుఁడు సాక్షియు చేతనుఁడు కేవలుఁడు నిర్గుణుఁడు నగువాడు పరమాత్మ ఇత్యాది శ్రుతులు యందుగల నిషేధము "యస్సర్వజ్ఞస్సర్వవిత్. యస్య జ్ఞానమయం తపః" "ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి" "సమస్తమును విశేషించి-గుర్తించువాడు, చరాచరమును సామాన్యముగ కనిపెట్టువాడు, జ్ఞానమయమైన తపస్సు నొనర్చువాడు పరమాత్మ" "పరమేశ్వరుని ఆనందమయునిగా నుపాసించు

వాడు- దేనినుండియు భయపడువాడు కాడు" ఇత్యాదిని సగుణత్వము నిర్ధారింపఁబడుటఁజేసి- హేయగుణరహితుఁడు పరమాత్మ-అను నంశమునందు-వర్తించును. "న హింస్యాత్సర్వాణి భూతాని"అనుచో గల సామాన్య హింసా నిషేధము "అగ్నిషోమీయం పశు మాలభేత" అనుచో గల విశేషవిధిచే బాధింపఁబడినట్లు- శ్రుతిప్రోక్తమగు గుణనిషేధము- శ్రుతిబాహుళ్య ప్రతిపాదితమగుసగుణత్వముచే బాధింపఁబడు గాన బ్రహ్మము సర్వజ్ఞత్వాది మాంగళ్యగుణములు గలదనియే గ్రహింపవలెను.

## 5—3 జ్ఞానగుణత్వ పరిష్కారము

"తద్గుణసారత్వాత్ తద్వ్యపదేశః" "జ్ఞానము అను గుణము శ్రేష్ఠముగా గలదగుటచే— బ్రహ్మము జ్ఞానముగా వ్యవహరింపఁబడును. అను సూత్రమున వేదవ్యాసాచార్యులు- జ్ఞానము గుణమని కీర్తించిరి. "నీలం ఉత్పలం" "నల్లని కలువ" అనుచో నీలత్వమునకు ఉత్పలమునకును విశిష్టాభేదము చెప్పఁబడినట్లు జ్ఞానగుణమునకు బ్రహ్మమునకు విశిష్టాభేదము గ్రహింపఁదగినది.

పరబ్రహ్మపరముగా పరులచే అంగీకరించఁబడిన బృహదారణ్యకమున- ఆరవ అధ్యాయమునందు- సర్వస్య వశీ సర్వస్యేశానః- ఇత్యాదిని గల సర్వేశ్వరత్వాది గుణములు బ్రహ్మమునకు సంగతములగుటవలన- బ్రహ్మము సగుణమనియే సిద్ధించును.

"తస్యైవ శక్తి ర్వివిధైవ శ్రూయతే- స్వాభావికీ జ్ఞాన బల క్రియాచ'' అను శ్రుతివాక్యము-బ్రహ్మమునకు సహజమై ఇచ్ఛాజ్ఞాన క్రియారూపిణిగా అనేకవిధయు నగు శక్తి- పరమేశ్వరునిదే నని

తెలుపుటచే- బ్రహ్మము నిర్గుణమను వాదము శ్రుతివిరుద్ధంబని తేట పడుచున్నయది.

"జగత్తు మిథ్య, బ్రహ్మము నిర్గుణము" అను సంశము ప్రసిద్ధ శ్రుతులయందు వినఁబడుట లేదు.

"ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనుచో రెండవ అధిష్ఠాత లేదను నర్థము గలది. అద్వితీయపదమనియు, ఏకమేవ అనువది తనకంటె వేరుగానట్టి జగత్తునకు బ్రహ్మము నిమిత్తోపాదానకారణ మగుటను తెలుపునదనియు గ్రహింపవలెను.

అద్వితీయపదము-నిర్విశేషత్వ పరమనునెడ- తదనంతరమగు "తదైక్షత-బహుస్యాం-ప్రజాయేయ" అను వాక్యమునగల- బహుభవనసంకల్పము నిరర్థకంబగును.

అందువలన-ఉపనిషత్ ప్రతిపాద్యమగు బ్రహ్మము-జ్ఞానాది గుణసమన్వితమై సవిశేషంబనఁబడుగుననుటయే సమంజసమైనది. ప్రపంచబ్రహ్మములకు అనన్యత్వమనఁగా- శుక్తి రజతములకు వలె ఏకతరమిథ్యాత్వము కాదు. మృద్ఘటములకు వలె-గుణగుణిలకు వలెను కార్యకారణములుగా-విశేషణవిశేష్యములుగాను అవినాభావము గల విశిష్టాభేదమగును. బ్రహ్మము లేనిది- ప్రపంచశక్తి లేదనియు శక్తి లేనిది బ్రహ్మము ప్రకాశింపదనియు సారాంశము.

బ్రహ్మ ప్రపంచములకు అత్యంతాభేదమును నివారించుటకై వ్యాసాచార్యుఁడు "అధికం తు భేదనిర్దేశాత్" అను సూత్రమున- "విశేషణమగు జగత్తునకంటె-విశేష్యమగు బ్రహ్మము అధికమైనది" అని పృథక్సిద్ధము గానట్టి భేదమును ప్రతిపాదించెను. సగుణత్వ పరములైన శ్రుతివాక్యములు బహుశములుగ నున్నందున-నిర్గుణత్వ

ప్రతిపాదక శ్రుతులకు "క్షుత్ పిపాసాది ప్రాకృత గుణములు లేనిది బ్రహ్మము" అను నర్థముఁ జేయుట అనివార్యమగునది.

ఇంతియే గాక "సత్యకామః సత్యసంకల్పః—సోఽన్వేష్టవ్యః—స విజిజ్ఞాసితవ్యః" అను శ్రుతివలన—సగుణబ్రహ్మము ఉపాసింపఁదగినది తెలియఁదగినదియు అని యవగతమగుటచే- నిర్గుణత్వ ప్రతిపాదకవాక్యములు- దుర్బలములగుచున్నవి. మరియు "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అను ఫలవాక్యమున "విపశ్చితా" అను పదముతో సర్వజ్ఞత్వగుణము తెలుపఁబడుటచే- సగుణబ్రహ్మమే ముక్త ప్రాప్యంబగునని తేటపడుచున్నది. ఏతావతా నిర్గుణబ్రహ్మము— ఉపాస్యము ప్రాప్యంబు కాదని విదితమైనది.

## 5-4 విగ్రహవత్త్వ పరిష్కారము

"ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ-పురుషం కృష్ణపింగళమ్" "పరబ్రహ్మము-మనోవికారము లేనట్టి ఋతము, వాగ్వికారరహితమైనట్టి సత్యంబునై పూర్ణము లేక శరీరమందు శయవించు అంతరాత్మ (భావలింగము) గాను, సగము నీలవర్ణము, సగము గోరోజన వర్ణము గల అర్ధనారీశ్వర (శక్తి విశిష్ట)ము నగునది."

"యా తే రుద్ర శివా తనూ రఘోరాఽపాపకాశినీ" రుద్రా! నీ రూపము శుభకరము సౌమ్యము శాంభవదీక్షితులైన పుణ్యాత్ములయందు ఇష్టలింగరూపమున ప్రకాశించునదియు" "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం- త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్" ఇత్యాది శ్రుతులు- బ్రహ్మము దివ్యమంగళవిగ్రహము గలదని ప్రతిపాదించుచున్నవి.

శ్రుతులు విగ్రహవత్త్వమును కల్పితమూర్తిమత్త్వముగా నిరూ

షించునవనునెడ- శ్రుతులు యథార్థమును చెప్పనివగుటఁజేసి-అప్ర మాణములగును. మరియు "స్థిరేభి రంగైః పురురూప ఉగ్రః" పర మేశ్వరుఁడు- నిత్యములైన దివ్యశరీరములతో నానారూపములు గల వాడై ఉగ్రుఁడనబఁడును." "అపాణిపాదో జవనో గృహీతా–పశ్యత్య చక్షుః స శ్రుణోత్యకర్ణః" "హస్తములు లేకున్నను స్వీకరించువాడు, పాదరహితుఁడైనను వడిగా నడచువాడు, నేత్రములు లేకున్నను చూచువాడు, చెవులు లేనివాడైనను వినువాడు పరమేశ్వరుఁడు "సర్వతః పాణిపాదం తత్" బ్రహ్మము అంతట హస్తములు పాద ములు గలదియు" ఇత్యాది శ్రుతివాక్యములయందు- బ్రహ్మము సర్వేంద్రియశక్తి గలదని ప్రతిపాదించుటచే బ్రహ్మము సగుణమై లోకుల సనుగ్రహించుటకు దివ్యమంగళ విగ్రహము గలదియనై యుండునని సారాంశము.

## 5-5 నామవత్త్వపరిష్కారము

ప్రశ్న: "నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతిచే-బ్రహ్మము నకు నామరూపములు కల్పింపఁబడినవని బోధపడును గదా!

ఉత్తరము: మీరు ఉదాహరించిన శ్రుతివాక్యము-"బ్రహ్మము తాను ప్రపంచమునకు నామరూపముల నేర్పరతు" నను నర్థము గలదగును కాని బ్రహ్మమునకు నామరూపములు లేవను అర్థము గలది కాదు. మరియు "అమృతస్య హ వా నామదేయాని" "తస్యనామ మహద్యశః" "శివ మద్వైతం చతుర్థం మన్యంతే" "శివ ఏవ కేవలః" "ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే" "మాయినం తు మహేశ్వరమ్" ఇత్యాది శ్రుతులయందు-అమృతుఁడు, యశస్సు మొదలగు సామాన్య నామములను నిర్వచించి- శివ రుద్ర మహేశ్వరాది విశేష నామముల

నిరూపించుటవలన- పరబ్రహ్మము నామము గలదని విదితమగు చున్నయది.

## 5—6 శివాభిధేయత్వపరిష్కారము

"యదా తమ స్తన్న దివా న రాత్రి-ర్నసన్నచాసత్ శివ ఏవ కేవలః అను మంత్రమున- ఆదిసృష్టి సమయమున—పగలుగాని రాత్రిగాని లేకుండెను. నామరూపవిభాగార్హమైన స్థూలజగత్తు-మరియు నామరూపవిభాగానర్హ మగు సూక్ష్మజగత్తు గోచరింపకుండెను-తమస్సు (గాఢాంధకారము లేక జీవాత్మలందరి మహాసుషుప్త్యవస్థ) మాత్ర ముండెను. అప్పుడు ఆ గాఢాంధకారమున-చరాచరమును తనలో దాచుకొని శివుఁడొకడే విరాజిల్లుచుండెను" అని చెప్పఁబడుటఁజేసి- సుబాలోపనిషద్గత నారాయణుఁడు జగత్కారణమని చెప్పుట సరి కాదు. ఎట్లనఁగా? జగత్కారణములుగ నిర్వచింపఁబడిన సత్-ప్రజా పతి నారాయణాది శబ్దములు "యదాతమః" ఇత్యాదివాక్యమున గల శివునియందే పర్యవసానముఁ జెందునని తెలియవలెను.

కూర్మమహాపురాణమీ విషయమునే దిగువనిధము సమర్థించి నది.

శ్లో॥ వశిత్వా దప్య వశ్యత్వా—దీశ్వరః పరికీర్తితః ।
ఋషి స్సర్వ గతత్వేన—హరిః సర్వగుణైర్యుతః॥

అనుత్పాదాచ్చ పూర్వత్వా-త్స్వయంభూ రితి స స్మృతః
నారా అప్యయసం యస్మా-త్తేన నారాయణః స్మృత॥

హర స్సంసారహరణాత్-విభుత్వా ద్విష్ణు రుచ్యతే।
భగవాన్ సకలై శ్వర్యా-దవనా దోమితి స్మృతః॥

సర్వజ్ఞ స్సర్వవిజ్ఞానా-త్సర్వః సర్వమయో యతః।
శివ స్స నిర్మలో యస్మా-ద్విభు స్సర్వగతో యతః॥

"పరమేశ్వరుఁడు సమస్తమును స్వాధీనపఱచుకొనుటచేతను దేనికిని లొంగనివాడగుటను ఈశ్వరుఁడనియు, సమస్తముఁజెంది యుండుటచే-ఋషియనియు, సమస్త సద్గుణములతో కూడియుండుట వలన హరి యనియు, జన్మలేనివాడగుటచే పూర్వుఁడగుటఁజేసియు స్వయంభువు అనియు, ఉదకములు లేక జీవ సముదాయము నివాస ముగ గలవాడగుటచే-నారాయణుఁడనియు, సంసారమును అనఁగా జననమరణాది క్లేశమును హరించువాడగుటవలన హరుఁడనియు, సర్వవ్యాపకుఁడగుటఁజేసి- విష్ణువనియు, అణిమాద్యష్టసిద్ధులు మొద లగు సమస్తైశ్వర్యములు గలవాడగుటచే భగవానుదనియు, రక్షించు వాడగుటఁజేసి ఓమ్ అనియు, సమస్తము నొకేసారి తెలిసికొనుటచే సర్వజ్ఞుఁడనియు, చరాచర ప్రపంచము స్వరూపముగ గలవాడగు టచే సర్వుఁడనియు, నిర్మలుఁడగుటవలన శివుఁడనియు, సమస్తము నంతరాత్మగా నుండుటచే విభువనియు పేర్కొనఁబడును".

ఇఁట నారాయణశబ్దము శివనామములలో కీర్తింపఁబడుటవలన "సంజ్ఞావాచకమైతేనే నారాయణనామము సార్థకమగు" నను పర నిర్వచనము పరాస్తమైనది. అనఁగా నారాయణ నామము శివునకు సంజ్ఞావాచకమగుటచే- ఈశ్వర హరి నారాయణాది ముఖ్య శబ్దములు శివునందు వర్తించుటఁజేసి జగత్కారణమగు బ్రహ్మము-శివాభి ధేయము గలదనియు, కేశవ బ్రహ్మాది శబ్దవాచ్యులు-జగత్కారణులు కారనియు విదితమైనది. మూలరామాయణాదులు కల్పితములగుటచే అందలి విష్ణుపారమ్యము పరిగ్రాహ్యము కాదనియు, వాల్మీకి రామా యణము శివపారమ్యమును బోధించుననియు బ్రహ్మపథమున విశ

దీకరింపఁబడినది. ఇతోఽధికమును శ్రీ సుదర్శనాచార్య విరచితమైన శ్రుతిసూక్తి మాలయందు, శ్రీమదప్పయ దీక్షితేంద్ర నిర్మితములైన శివతత్త్వవివేక - శివార్కమణిదీపికాది-ముప్పదిమూడు గ్రంథముల యందును గాననగును.

## 5-7 సమానాధికరాహిత్యపరిష్కారము

ప్రశ్న: ఓయీ! పరమేశ్వరుఁడు సర్వోత్కృష్టుఁడుగా ఏర్పడినను పరమేశ్వరునితో సమానుఁడు లేదని చెప్పుటకు వీలులేదు. పరమేశ్వరునితో సమానుఁడు నారాయణుఁడని తెలియుచున్నది. ఎట్లనఁగా? "సహస్రశీర్షా పురుషః" అనునది మొదలుకొని "త్రిపాదస్యామృతం దివి" అనునదివరకు జగద్విశిష్టత్వము పేర్కొనఁబడినది. మరియు "తమేవం విద్వా నమృత ఇహ భవతి" అనుచో మోక్షహేతుత్వము అవగతమగుచుండుటే గాక- పూజాదులఁ గూర్చి "శివం వా విష్ణుమేవ వా" అని స్మృతులలో గానంబడుటచే శివకేశవులకు సమానత్వము వికల్పరూపమున ప్రతిపాదింపఁబడినది లోకమున పూజాస్థానములగు క్షేత్రాదులు మరియు హరిహరసామ్యమును నిరూపించు పురాణాగమములును గానఁబడుచున్నవి. కావున పరమేశ్వరునితో సమానుఁడు నారాయణుఁడని తేటపడుచున్నది గదా!

ఉత్తరము: న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే అను శ్రుతి వాక్యము "పరమేశ్వరునితో సమానుఁడుగాని, అతనికంటె గొప్ప వాడు గాని లేడు" అని ప్రతిపాదించినందున "ఖద్యోతో యది చంద్రభాను సదృశ-స్తుల్యో హరిః శంభునా" "మిణుత పురుగు సూర్యునితో సమానమగునేని- శ్రీహరి పరమేశ్వరునితో సరిఁదూగు" నని-సూత సంహితయందు నిరూపించుటవలనను "హరిహరులు సమానులు" అను భావన- సర్వప్రమాణ సమ్మతము కాదని తెలియుచున్నది.

బ్రహ్మపథమున-పురుషసూక్తము శివపరమని నిర్ణయింపఁబడి నను- సుబాలోపనిషత్తు ననుసరించి నారాయణుఁడు జగత్కారణ మగునను బావన- పరమేశ్వరుని చిచ్ఛక్తి యొక్క అంశముగా ఆవిర్భవించిన నారాయణుఁడు-పరమేశ్వరుని మహిమాతిశయలేశము గలవాడని బ్రహ్మపథమునందు నిరూపించుటవలన-ముఖ్యముకాదని తేటపడుచున్నయది.

"మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్" అను వాక్యమున- నారాయణుఁడు మోక్షేచ్ఛను కలుగఁజేయువాడు" అని యర్థము.

సూత సంహితయందు-

శ్లో॥ విరించస్య ప్రసాదేన-తతః శాంత్యాదిసాధనం।
ప్రసాదా ద్వైష్ణవా త్సాక్షాత్- ముముక్షుత్వం పునఃస్వతః

బ్రహ్మదేవుని కృపతో శమదమాది సాధనములు చేకూరును. విష్ణు భగవానుని అనుగ్రహమున మోక్షేచ్ఛ-స్వతఃసిద్ధముగా ఏర్ప డును" మరియు నదే సూతసంహితయందు-సత్యసంధోపాఖ్యానమున సత్యసంధుఁడు మోక్షముకొరకు ప్రార్థింపగా- విష్ణుమూర్తి-

శ్లో॥ అహం బ్రహ్మాదిదేవాశ్చ-ప్రసాదాత్తస్య శూలినః-
ప్రణిపాతేన సంసార-మోచకా నాత్ర సంశయః।
ప్రసాదో ముక్తిదః సాక్షాత్-శివాత్ సత్యాదిలక్షణాత్-
అంబికాసహితా దస్మాత్- సర్వజ్ఞాదేవ నాన్యతః॥

"నేను, బ్రహ్మాది దేవతలున్ను పరమేశ్వరుని అనుగ్రహమును ప్రణిపాతముతో సంపాదించియే సంసారబంధమునుండి విడుదలఁ జేయువారము. ఇందు సంశయము లేదు. సత్యత్వాదిలక్షణములు గల

వాడు, అంబికతో కూడియుండువాడు, సర్వజ్ఞుఁడునగు శివుని వలన సంభవించు అనుగ్రహము- సాక్షాత్తు మోక్షము నొసఁగునది. అనఁగా హరిబ్రహ్మాదులను ప్రార్థించినచో ముముక్షువులకు మోక్షమును-శివునాజ్ఞఁబడసియే కలుగఁజేయుదురనియు, పరమేశ్వరుఁడైతేనో-ఇతరుల సహకారము లేకయే-తానే మోక్షము నొసఁగుననియు, ఇఁట విదితమైనది.

విష్ణూపాసన—వైకుంఠనివాసముద్వారా శివపదమును పొందించునదగుటచే- జనార్దనునిచే మోక్షేచ్ఛమాత్రము కలుగును. శివానుగ్రహమువలననే పునరావృత్తిరహితమగు "శివసాయుజ్యము" అను మోక్షముచేకూరును. అని గ్రహింపవలెను. అందువలననే శ్రుతి "శివ ఏకో ధ్యేయః-శివంకరః సర్వమన్యత్ పరిత్యజ్య" అని వక్కాణించినది.

హరిహరక్షేత్రములు సమానములగుటచే-శివకేశవులు సమానులగుననుట సరి కాదు- ఇటీవల కొన్ని శివక్షేత్రములు విష్ణుక్షేత్రములుగా మార్చబడినవని- చరిత్ర చెప్పుచున్నది. ఒకవేళ హరిహరసామ్యము నంగీకరించినచో-జగత్కారణము ఎవరు? అనుప్రశ్న ఉదయించును. సృష్టి స్థితిలయముల నొనర్చువాడే- జగత్కారణమగునని-వ్యాసుడు "జన్మాద్యస్య యతః"అను సూత్రమున నిరూపించుటఁబట్టి-అవాంతర సృష్ట్యాదికారకులగు హరిబ్రహ్మలకంటె- మహాసృష్టిస్థితిలయముల నొనర్చు మహేశ్వరుఁడే అధికుఁడనియు హరిబ్రహ్మలు శివునితొ సమానులు కారనియు నిర్ధారింపవచ్చును.

ఇందువలననే "పరాత్పరతరో బ్రహ్మ-తత్పరా త్పరతో హరిః-యత్పరాత్ పరతోఽధీశః" అని శివసంకల్పోపనిషత్తు- ఉద్ఘాటించినది. హరిలో హరుఁడు, హరునిలో హరియుండునని చెప్పనెద-

అన్యోన్యాశ్రయ దోషము ఘటించును. ఇంతియేగాక- "తన్మహేశ్వర కోట్యంశా- ద్బ్రహ్మవిష్ణ్వోః సముద్భవః" "హరిబ్రహ్మాది దేవేభ్యః- శ్రేష్ఠం పశ్యంతి యే హరం- తే మహాఘోర సంసారాన్ముచ్యంతే నాత్ర సంశయః''అను సూతసంహితాది ప్రమాణములు-గమనార్హము లగుచున్నవి.

"ప్రపన్నవత్సలో దేవః-సంసారార్తాన్ సముద్ధరేత్
ఏవ మన్యే న కుర్వంతి- దేవాః సంసారమోచనమ్"

అని మహాభారతము- అను శాసనిక పర్వమునందు వక్కాణించుటను గాననగును.

## 5-8 రూపవత్త్వపరిష్కారము

ప్రశ్న: "అరూపమద్భుతం"ఇత్యాది శ్రుతి-బ్రహ్మము రూపము లేనిదని నిర్వచించుటవలన-బ్రహ్మమునకు రూపవత్త్వము సిద్ధించుట లేదు గదా!

ఉత్తరము: "అరూపం" ఇత్యాదిశ్రుతులు ప్రాకృతిక (హేయ) రూప గుణములను నిషేధించునవని తెలియుము!

"అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్" అను వ్యాససూత్రమున పరమాత్మ-రూపము లేనివాడని చెప్పఁబడినదని- శంకింపరాదు. రూపములేని వస్తువువలె పరమాత్మయుండునని-"అరూపవత్" అను దానిలోని "వత్" ప్రత్యయమునకు అర్థము గాన రూపరహితమైన ఆకాశమువలె-పరమాత్మ-ఘటమఠాది సర్వప్రపంచమును వ్యాపించు వాడని తేటపడును.

"న సందృశే తిష్ఠతి రూప మస్య-న చక్షుషా పశ్యతి కశ్చ

నైనం" "పరమాత్మయొక్క రూపము-దృశ్యములలో నుండదు. ప్రాకృత నేత్రముతో పరమేశ్వరుని నెవ్వడును చూడఁజాలడు" అను శ్రుతి పరమేశ్వరరూపము-చక్షుర్గోచరము కాదని చెప్పగా- "హృదామనీషా మనసాఽభిక్లుప్తా-య ఏతద్విదు రమృతాస్తే భవంతి" "హృదయములో శుద్ధమనస్సున ఏకాగ్రబుద్ధితో చూడఁబడును పరమాత్మ" అను శ్రుతి- పరమేశ్వరరూపము- అంతరింద్రియగ్రాహ్యమని నిరూపించినది.

ఇందువలననే "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా" "ఇతరచింతలు మానుకొని చిత్తశుద్ధిని సూక్ష్మమైన ఏకాగ్రబుద్ధితో పరమేశ్వరుని చూడనగు" నని స్మృతియు సమర్థించినది. మరియు "వేదాహమేతం పురుషం మహాంతం-ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అను శ్రుతివాక్యమున "ఆదిత్య వర్ణత్వము; యత్తే కల్యాణతమం రూపం పశ్యామి" అనుచో కళ్యాణతమ (శుభమయ) మగురూపము; "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం" అనుచో కాంచనవర్ణత్వము నిరూపింపఁబడినందున "పరమాత్మ రూపవర్ణములు లేనివాడు" అనునెడ పై శ్రుతులు విరోధించును.

మరియు "ఆత్మా వారే ద్రష్టవ్యః" పరమాత్మ-దర్శింపఁదగినవాడు" "తస్మిన్ దృష్టే పరావరే" "సంసార సముద్ర తరణకారకుఁడగు పరమాత్మఁజూచినచో సంశయములన్నియు పటాపంచలగును. "తతస్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః" "పరమేశ్వరుఁడు పరిపూర్ణుఁడని ధ్యానించు ముముక్షువు-పరమాత్మను చూడగలుగును" ఇత్యాద్యనంత శ్రుతులు సార్థకములగుటకు-పరమేశ్వరుఁడు సాక్షాత్కరించు దివ్యరూపము గలవాడని అంగీకరింపవలసివచ్చును.

"రుక్మాభం స్వప్నధీగమ్యం- విద్యాత్తు పురుషం పరమ్"

"పరమేశ్వరుని-బంగారువన్నెగల వానిగాను,నిష్కళంకమగు యోగ నిద్రలో బుద్ధిచే పొందఁదగినవానిగాను గుర్తెరుగవలె" నని మనువు పై యంశమును సమర్థించెను.

కొందరు ఆచార్యులు శైవవైష్ణవాదిసంఘీభావమునకై బ్రహ్మము నామరూపగుణరహితమని- చెప్పవలసివచ్చినదను విషయము వ్యాస పథమున- వివరింపఁబడినది.

ఇట్లు చెప్పుట వలన- పరమేశ్వరుఁడు దివ్య రూప గుణ నామ ములు గలవాడనుటయే సమంజసమని- తేటపడినది.

ముఖ్యములలో ఆరవదగు

## జీవ పరిష్కారము

"బ్రహ్మమే సమస్త శరీరములయందు ప్రవేశించి- జీవభావము ననుభవించును. జీవభావమును అవిద్యకల్పించు" ననుకొందరివాదము సరియైనది కాదు.

## 6—1 బ్రహ్మభిన్నత్వపరిష్కారము

జీవభావమును అవిద్య కల్పించుననుమనెద- అవిద్య అచేతన మగుటచే- జీవభావమును కల్పింపఁజాలదు. చిత్తుయొక్క ప్రతి బింబము అవిద్యయందు పడుటచే జీవభావము ఏర్పడు ననుట సరి కాదు. "న విద్యత ఇతి అవిద్యా" అను వ్యుత్పత్తి వలన లేనిదగు అవిద్యయందు చిత్ప్రతిబింబము ఎట్లు ప్రసరించును? అట్టితఱి-జీవుడు గొడ్రాలి కొమరునివలె, కుందేలు కొమ్మువలెను శబ్దమాత్రుఁడగును. అట్టి జీవునకు సుఖదుఃఖానుభవమెట్లు కలుగును? శరీరేంద్రియ

సంబంధముచే అంతఃకరణవైశిష్ట్యముఁబట్టి- జీవునకు సుఖదుఃఖాను భవము కలుగుననునెడ- జీవునకు అస్తిత్వమే లేనపుడు అంతఃకరణ వైశిష్ట్యము ఎట్లు పొసఁగును?

"ఆభాసా ఏవ" అను సూత్రమున వేదాచార్యుఁడు "అద్వైతులు చూపెడు యుక్తిప్రయుక్తులు- ఆభాసములనియే" నిరూపించెను. "జ్ఞాజ్ఞౌ ద్వౌ వజా వీశానీశౌ" అను శ్రుతి "అజులైన జీవేశ్వరులు కించిజ్జత్వ సర్వజ్ఞత్వ స్వాతంత్ర్య పారతంత్ర్య భేదములతో విలక్ష ణులై యున్నారు." అని చెప్పుటచే- జీవేశ్వరులిరువురు- అంశాంశి భావమున శరీరశరీరి సంబంధమున, కర్తృత్వకారయితృత్వమునను అస్తిత్వము గలవారని బోధపడుచున్నయది.

"పరాభిధ్యానాత్తు తిరోహితం-తతో హ్యస్య బంధ విపర్యయౌ" "పరస్య = పరమేశ్వరునియొక్క, అభిధ్యానాత్ = సంకల్పమువలన, తిరోహితం = జీవుని నిజరూపము మఱుఁగుపడినది, హి = అందు వలన, అస్య = ఈ జీవాత్మకు, తతః = పరమేశ్వరుని వలననే, బంధవిపర్యయౌ = బంధ మోక్షములు సంభవించును" అను సూత్ర మున- బంధము అవిద్యాకల్పితము కాదనియు, మోక్షము నిత్యుఁ డైన జీవునకే కలుగుననియు తేటపడుటచే-జీవాత్మ బ్రహ్మము నంటియే వేరుగా నుండునని గ్రహింపవలెను.

## 6-2 కర్తృత్వపరిష్కారము

"జీవాత్మ- దేహేంద్రియాదులాచరించు కర్మలకు-ఎడతెగని దేహేంద్రియాభిమానము గలవాడై- నేను కర్తనని భావించునుగాని వసుతః కర్త కాదని- పరులువాదించుట-పరిగ్రాహ్యము కాదు. ఎందు కనఁగా? వేదాచార్యుఁడు "కర్తా- శాస్త్రార్థవత్త్వాత్" అనుచో "ఇదం

కురు! ఇదం మా కురు! అను శాస్త్రార్థము జీవునియందే వర్తించును గాన జీవాత్మ-సుకృత దుష్కృతకర్తయై-సుఖదుఃఖభోక్తయగునని సూత్రించెను.

"మోక్షోపాయమును వచింపు" మని జనకుఁడు ప్రశ్నింపగా యాజ్ఞవల్క్యుఁడు- ఫలాపేక్షతో చేయఁబడిన కర్మ-బంధకమగుటచే ఫలత్యాగమును చేయవలెనని నుదాహరించెను. "స వా ఏష ఏతస్మిన్ సంప్రసాదే- రత్వా చరిత్వా-ద్రష్టైవ పుణ్యంచ పాపంచ పునః ప్రతి న్యాయే- ప్రతియోన్యా ద్రవతి-స్వప్నాయైవ-స యత్తత్ర కిం పశ్య త్యనన్వాగతస్తేన భవత్యసంగో హ్యయం పురుషః".

శ్రుత్యర్థము: స వా ఏషః=విజ్ఞానమయుఁడగు జీవాత్మ, ఏత స్మిన్ ప్రసాదే=అనుభూయమానముగ ముందున్నట్టి స్వప్నమునందు (సంప్రసాదశబ్దము సుషుప్తి వాచకమైనను- సుషుప్తి (గాఢనిద్ర)లో రత్యాదులుండవు గాన నిట స్వప్నవాచకముగా నిరూపింపఁబడినది). రత్వా=స్త్రీ పుత్రాదులతో సుఖము ననుభవించి నానాదేశముల సంచ రించియు ద్రష్టైవ పుణ్యం చ పాపంచ=పుణ్యపాపరూపమగు కర్మ నవలోకించును. పునః=మరల, ప్రతిన్యాయే=పుణ్య పాప పద్ధతిఁ బట్టి ఏర్పడు ప్రతిజన్మలో, ప్రతియోన్యా=ప్రతిస్త్రీ యోనినుండి, స్వప్నాయైవ= జన్మగతమైన స్వప్నానుభవము కొరకే, ద్రవతి= జారిపడును, యత్=ఏకారణమువలననైనా, సః= జీవాత్మ, తత్ర = పూర్వజన్మయందు, అనన్వాగతః=ఫలాపేక్ష లేనివాడై, కిం పశ్యతి=దేనిని భావించును? ఎట్టి కర్మఫలము నాశింపదని భావము, తేన= ఆ కారణముచేత, అయం పురుషః=ఈ జీవాత్మ, అసంగః =కర్మఫల సంబంధము లేనివాడగును."

స్వప్నము మిథ్యకానిదగుటచే- స్వప్నమునందు దేవతాదర్శనాదికము శుభఫలప్రదమగుచున్నయది. జీవాత్మ కర్త యగుటవలననే-జాగ్రత్స్వప్నములతో సుఖదుఃఖముల ననుభవించుచు-సుషుప్తిలో పరమాత్మతో నేకీభవించి- కర్మశేషమువలన-పునః జాగ్రద్దశలోనికి వచ్చుచున్నవాడు.

"గుహాం ప్రవిష్టా వాత్మనౌ హి తద్దర్శనాత్" "జీవాత్మ పరమాత్మలు హృదయగుహఁబ్రవేశించినవారు, ఇట్లు శ్రుతియందు కనఁబడుచున్నయది" అను బ్రహ్మసూత్రమున జీవాత్మకు అస్తిత్వమును కర్మఫలానుభవము కొరకు శరీరగత హృదయగృహఁబ్రవేశించుటను, తన్నిమిత్తముగా కర్తృత్వమున్ను వేదవ్యాసుఁడు ప్రతిపాదించెను. మరియు "జ్ఞోఽతఏవ" అను సూత్రమున జీవుఁడు జ్ఞాతయునని-నిరూపించెను.

జీవాత్మ— పరాధీనకర్తగా పరతంత్రుఁడనియు, పెద్ద బరువు లేపుటకు యత్నించు బాలునకు పెద్దవాడు చేయూతనిచ్చుటచే బాలుడు కృతార్థుఁడగునట్లు జీవాత్మ తలపెట్టు గొప్పపనులు సిద్ధములగుటకు పరమేశ్వరుఁడు లోనుండి స్ఫురింపఁజేయుచు-దేవమానవాదిరూపమున ప్రత్యక్షముగ సహకరించినచో జీవాత్మ-కృతార్థుఁడగును కావుననే పరాధీనకర్త యనఁబఱఁగునని-శ్రీ నీలకంఠభగవత్పాదులు— తమ- సూత్రభాష్యమున ద్వితీయాధ్యాయమున—మూడవ పాదమునందు బాగుగా నిరూపించిరి. "ఇత్యాది సందర్భమువలన జీవాత్మకు కర్తృత్వమే సంగతమని- విదితమైనది.

## 6-3 అణుత్వపరిష్కారము

"ఉత్క్రాంతి గత్యాగతీనామ్" అను సూత్రమున-జీవాత్మ—శరీ

రము నుండి లేచుటయు పరలోకమునకు వెళ్ళుటయు భూలోకమునకు వచ్చుటయు గలవాడగుటచే- అణువనియే చెప్పవలెను. విభువగునెడ గమనాగమనాదులు సంగతములు కాకుండును. శరీరమునంతయు వ్యాపించువాడగుటవలన జీవుఁడు విభువని చెప్పుట సరి కాదు. శ్రీగంధబిందువు ఒకచోటనుండియే శరీరవ్యాపకమైనట్లు జీవాత్మ-హృదయమందుండియే తన ప్రభావమును శరీరమునందు వ్యాపింపఁజేయును.

ప్రశ్న: "న తస్య ప్రాణా ఉత్క్రామంతి- అత్ర బ్రహ్మ సమశ్నుతే" అను శ్రుతియందు-జ్ఞానియొక్క ప్రాణములు లేవవు. ఈ శరీరమునందే బ్రహ్మమును పొందును" అని యున్నందున జీవాత్మకు గమనాగమనాదులు లేనందున విభువని తెలియుచున్నది గదా!

ఉత్తరము: నీవు ఉదాహరించిన శ్రుతికి "తస్య = జీవాత్మయొక్క, ప్రాణాః = పంచప్రాణములు మాత్రము, నోత్క్రామంతి = లేవవు, అత్ర = ఈ ప్రారబ్ధాంతమునందే, బ్రహ్మ సమశ్నుతే = బ్రహ్మమును పొందును'' అని యర్థము. అనఁగా- పంచప్రాణములు జీవాత్మను విడిచి బయలుదేరవు, జీవాత్మననుసరించియే శరీరము నుండి లేచునుగాన- జీవాత్మ-ఉత్క్రాంతి గత్యాగతులు గలవాడని అవగతమగుచున్నందున అణువనియే నిర్ధారింపవలెను.

జ్ఞానగుణము ముఖ్యముగ గలవాడగుటచే జీవాత్మ విజ్ఞానమని వ్యవహరింపఁబడినవాడు అందువలన జ్ఞానమే జీవాత్మకాదనియు, జ్ఞానము గుణముగాగలవాడనియు అట్లే అణువనియునని బోధపడును.

## 6-4 భేదపరిష్కారము

ప్రశ్న: జీవాత్మ-పరమాత్మతో భేదము లేనివాడగుటచే పర

మాత్మకు సహజమగు విభుత్వాదికము—జీవాత్మకు గూడ సిద్ధించునని చెప్పవలెను గదా!

ఉత్తరము: జ్ఞానము శక్తి కర్మ అనువానితో భిన్నత్వమున్నందున—ఉపాస్యము ఉపాసకుఁడు, శుద్ధుఁడు అశుద్ధుఁడు ముక్తుఁడు బద్ధుఁడు అనువానిచే భేదము ఏర్పడుచున్నందున జీవుఁడు బ్రహ్మముకంటె వేరైనవాఁడని నిర్ధారింపవలెను. మరియు అశ్వమహిషములకువలె జీవేశ్వరులకు లక్షణ భేదము సహజసిద్ధమగునని తెలియవలెను. ఎట్లనఁగా? ఈశ్వరునికైతేనో—జ్ఞానము నిత్యము సర్వవిషయకంబునై సూర్యప్రకాశమువలె నుండునది. సంసారియగు జీవాత్మయొక్క—జ్ఞానము మిణుతపురుగువలె—కించిత్ప్రకాశము కలదగును.

ఇరువురికి శక్తిభేదము అట్టిదేను. ఈశ్వరుని శక్తి నిత్యమై సమస్త ప్రపంచము నాక్రమించునది కాగా—జీవుని శక్తి స్వల్పమై పరమేశ్వరు నధీనమగునది. జీవేశ్వరుల కర్మ గూడా భిన్నమైనదేను. పరమేశ్వరుఁడు— నిజప్రభావనిమిత్తకమైన సృష్ట్యాది కర్మను చేయును. జీవుఁడైతేనో అనాదివాసనవలన పుణ్యపాపకర్మలను పరవశుఁడై చేయుచుండును.

"ఉపాసీత" అనుటఁబట్టి- గురువువలె—రాజువలె- ఉపాస్యుఁడు పరమేశ్వరుఁడనియు, శిష్యునివలె భృత్యునివలె-ఉపాసకుఁడు జీవుఁడనియు "అపహతపాప్మా" "పాపములు బొత్తుగా లేనివాఁడుగా ప్రతిపాదింపఁబడు ఈశ్వరుఁడు నిత్యశుద్ధుఁడనియు పుణ్యపాపములను దేహేంద్రియాదులతో నొనర్చు జీవుఁడు—నిత్యశుద్ధుఁడు కాడనియు, ఈశ్వరుఁడు నిత్యముక్తుడు కాగా-జీవుఁడు అనాదికాలమునుండి సంసారబద్ధుడగువాడనియు తేటపడుచున్నందున

జీవాత్మ- పరమాత్మకంటె- వేరైనవాడనుటయే సమంజస మైనది.

జీవాత్మ-పరమాత్మకంటె విలక్షణుఁడనియు, కర్తయనియు కర్మఫలభోక్తయనియు"కర్తా-శాస్త్రార్థవత్వాత్"ఇత్యాదిసూత్రములు నిరూపించుటయే గాక- "జ్ఞాజ్ఞౌ ద్వావజా నీశానీశా" ఇత్యాది శ్రుతి- నిత్యులగు జీవేశ్వరులలో- సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వ స్వాతంత్ర్య పార తంత్ర్యములతో వైలక్షణ్యము కలదని విశదీకరించినది.

జీవేశ్వరులకు ఐక్యము బహుశ్రుతులయందు గానఁబడుట లేదు. ఇందుకు కొన్ని లౌకికవాక్యములు దిగువ నుదాహరింపఁబడుచున్నవి.

"గావః సాయం గోష్ఠే ఏకీభవంతి"

"ఆవులు సాయంత్రము గోష్ఠమునందు ఒకటగుచున్నవి."

"ఏకీభూతా నృపాస్సర్వే-వవర్షుః పాండవం శరైః"

"రాజులందరు ఒకటై-పాండుపుత్రునిపై బాణములను కురి పించిరి."

"కీటో భ్రమరేణ ఏకీభూతః"

"కీటము తుమ్మెదతో ఏకీభవించినదై" అనువానియందు గోవు లకు స్థానైక్యము, రాజులకు ఉద్దేశము ఒకటగుటయు, కీటభ్రమర ములలో సాదృశ్యము అను ఐక్యంబులు పొడగట్టుటచే జీవేశ్వరు లకు- కొన్ని శ్రుతులయందు చెప్పఁబడిన ఐక్యము-సాదృశ్యార్థక మగునని విదితమగుచున్నయది.

"పరమం సామ్యముపైతి" పరాత్పరం పురుషముపైతి" ఇత్యాది వాక్యములలో శివసమానత్వము ముక్తపురుషునకు సంప్రాప్యమగునని బోధపడుచున్నయది.

"అధికం తు భేదనిర్దేశాత్" "సుషుప్త్యుత్క్రాంత్యో ర్భేదేన"ఇత్యాది వైయాసిక సూత్రములు-జీవునికంటె ఈశ్వరునకు అధిక్యము కలదనియు, సుషుప్తియందును జీవేశ్వరులకు భేదము ఏర్పడుచున్నదనియు చాటుచుండుట- ఇందుకు ప్రోద్బలకమైనది.

"కీటము నేను భ్రమరము నగదు" నని తలచుచుండగా భ్రమరము కీటమును వెంటాడినచో-కీటము భ్రమరమగును'' అనునట్లు పశువైన జీవునకు పశుత్వము తొలగుట ద్వారా- ఎట్టి దోషములు లేనిది నిఖిలకల్యాణ గుణములు కలదియునగు శివత్వము చేకూరుట- శివాహంభావనతో శివు నుపాసించుచున్న శాంభవదీక్షితునకు-సుసంగతంబగునది.

"అద్వైత మాగమశిరోభి రూపాసనాయా-ముక్తం తదేవ పరమార్థతయా న వాచ్యమ్" ఉపాసనయందు అద్వైతమును వేదాంతములు చెప్పినను- అట్టి జీవేశ్వరైక్యము పరమార్థము కాదు" అని సుదర్శనాచార్యులు- జీవేశ్వర భేదమే పరమార్థమని నిరూపించిరి. జీవేశ్వరులు ఒకరినొకరు విడువనివారై -పృథక్సిద్ధముగానట్టి భేదము గలవారని "ద్వాసుపర్ణా సయుజా సఖాయా-సమానం వృక్షం పరిష్వజాతే- తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి-అనశ్నన్నన్యో అభిచాకశీతి" "మంచిరెక్కలుగల పక్షులబోలిన జీవేశ్వరులు అనాదికాలము నుండి కూడినవారై స్నేహితులునై- ఒకే శరీరము అను వృక్షము నధిష్ఠించినవారు- వారిలో ఒకడు (జీవాత్మ) రుచికరమని భ్రమించి కర్మఫలము ననుభవించుచుండును. మరియొకడు (పరమాత్మ) కర్మఫలము ననుభవింపక- సాక్షిమాత్రుడై ప్రకాశించుచుండును'' అని శ్రుతి- ప్రబోధించినది.

మరియు "యదా జుష్టం పశ్యత్యన్యమీశం- పృథగాత్మానం

ప్రేరితారం చ మత్వా" ఇత్యాది శ్రుతి- పరమాత్మను తనను ప్రేరే పించు పృథగాత్మగా నుపాసించు జీవాత్మ ముక్తుఁడగు" నని నిరూపించినది. ఇంతియే గాక—

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య-మమ సాధర్మ్యమాగతాః।
సర్గేపి నోపజాయంతే-ప్రళయే న వ్యథంతి చ॥

"పూర్వోక్తమగు జ్ఞానమనఁదగు ఉపాసన నాచరించిన ముముక్షువులు- పరమేశ్వరునితో సాదృశ్యముఁబడసినవారై -సృష్టిలో జన్మింపరు. ప్రళయయమున బాధపడరు."

"జగద్వ్యాపారవర్జ్యమ్" "ముక్తపురుషులకు శివసమానత్వము ఏర్పడినను- జగత్సృష్ట్యాది వ్యాపారము ఉండదు."

"భోగమాత్రసామ్యలింగాచ్చ" "పరమేశ్వరునకు ముక్తపురుషులకు సకలకామావాప్తిరూపమైన ఆనందభోగమే సమానత్వముగా పరిగణింపఁబడును." ఇత్యాది స్మృతిసూత్రములు- మోక్షమునందు పరమసామ్యమును చెప్పుటచేత జీవేశ్వరభేదము నిత్యమైనదని బోధపడుచున్నయది.

జీవేశ్వరభేదము- వ్యావహారిక మనునెడ— ముక్తిగూడ వ్యావహారికమై శాశ్వతము కాదను అనర్థము వాటిల్లును.

"ఆత్మాతస్యాష్టమీ మూర్తిః" "పరమేశ్వరుని ఎనిమిదవమూర్తి జీవాత్మ యగును" అనుచో-జీవేశ్వరులకు శరీరశరీరిభావము పొదగట్టుచున్నందున— జీవాత్మపరమాత్మలకు భేదమునే నిర్ణయింపవలెను-

అస్మత్కృతమగు బ్రహ్మపథగత వేదపథమునందు-ఉపనిషత్తులన్నియు కేవలభేదమునుగాని కేవలాభేదమునుగాని నిరూపింపనివై

విశిష్టశివాద్వైతమును ప్రతిపాదించునవనియు, వ్యాసపథమున బ్రహ్మ మీమాంసయందు- బ్రహ్మసూత్రములన్నియు శ్రీ కంఠాచార్యప్రోక్త మగు శివాద్వైత సిద్ధాంతమునే సమర్థించుచున్నవనియు సవిస్తరముగా వ్రాయఁబడినందున ప్రకృతము పరిష్కరింపఁబడిన అంశములు నిశ్శంకములైనవని తెలియవలెను.

ముక్తునకు పరమేశ్వరునితో అత్యంతసామ్యము ఏర్పడునని గుర్తించిన ప్రాచీనమహాపురుషులు కొందరు ముక్తాత్మ పరమాత్మ కోటిలో చేరునని భావించి- జీవుని అస్తిత్వము భావగ్రాహ్యమగుటచే- జీవత్వము కల్పితమని ఊహించి- కేవలాభేదమును పాటించినంత మాత్రమున జీవబ్రహ్మైక్యమునందు వారికి తాత్పర్యము లేదని స్ఫురించును గదా!

ముఖ్యములలో-ఏడవదగు

## 7. గతిపరిష్కారము

నిర్గుణవిద్య-ఆకాశకమలముఁబోలినది కాగా-సగుణబ్రహ్మము నందు నిష్ఠగలవాదే పరవిద్యానిష్ణాతుఁడగుటఁజేసి-సగుణోపాసకునకు అర్చిరాదిగమనము-సుసంగతమగునని-తెలియవలెను.

ఎట్లనగా? "అథ పరా-యయా తదక్షర మధిగమ్యతే" దేనిచేత అక్షరమైన పరబ్రహ్మము పొందఁబడునో- అట్టి పరావిద్యను ప్రారంభించుచున్నాము" అనునది మొదలుకొని "యః సర్వజ్ఞః సర్వ విత్" అనుచో పరమేశ్వరుని సర్వజ్ఞత్వాది నిఖిల మాంగళ్య గుణ విశిష్టునిగా నిరూపించి- "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనుచో సమస్తకామవిశిష్టమగు బ్రహ్మమును ముక్తపురుషుఁడు అనుభవించు

నని నిర్ణయింపఁబడినది. మఱియు "అస్మాచ్ఛరీరా త్సముత్థాయ-పరంజ్యోతి రుపసంపద్య" అనుచో-జీవాత్మ "ఈ శరీరమునుండి లేచి-పరంజ్యోతి స్వరూపుడగు పరమేశ్వరుని పొందు" ననియు, "తయోర్ధ్వమాయ న్నమృతత్వ మేతి" అనుచో-మూర్ధన్యనాడిద్వారా నిష్క్రమించు జీవాత్మ-మోక్షము నొందును-అనియు "తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి-చక్షుషో వా మూర్ధ్నో వా" అనుచో ఈ జీవాత్మ-స్వయం ప్రకాశమానుఁడగు పరమాత్మ (ప్రద్యోతము)తో కూడి- నేత్రమునుండిగాని, శిరస్సునుండిగాని- నిష్క్రమించును" అనియు-వేదాంతములన్నియు పరావిద్యా నిష్ఠునకే- ఉత్క్రాంతి గత్యాదులు కలవని- విశదపఱచినవి.

ఇంతియే గాక- గమనమునకంటె ముందు- ఉత్క్రాంతి-విద్వాంసునకు అవిద్వాంసునకు సమానమైనదనియు, ఉత్క్రాంతి తరువాత-గమనము విద్వాంసునకు మూర్ధన్యనాడీద్వారా సంభవించు ననియు, అవిద్వాంసునకు-ఇతరములద్వారా గతి ఏర్పడుననియు, తెలియవలెను.

జీవదవస్థయందు స్థూలశరీరమున గానఁబడు వేడి-సూక్ష్మశరీరముఁజెంది యుండును. అర్చిరాదిగతితో పరమపదముఁ బ్రవేశించు వరకు లింగశరీరము అంటుకొనియుండగా-పరంజ్యోతిః ప్రాప్త్యనంతరము ఆవిర్భవించు నిజరూపమునకు బ్రహ్మానందానుభవమునకై దివ్యములైన మనోబుద్ధ్యాదులు సంభవించును. మరణించినవాని దేహమునందు కనఁబడని ఉష్ణత్వము- సూక్ష్మశరీరముఁ జెందినదని విదితమగుటచే- లింగశరీరముతో కూడ ప్రాణి నిష్క్రమించునని తెలియుచున్నది. "న తస్మాత్ ప్రాణా ఉత్క్రామంతి" అను పంచమీ పాఠముండుటవలన-జీవాత్మను విడిచి ప్రాణములు పోవని నిర్ధారింప

వలెను- "అత్ర బ్రహ్మ సమశ్నుతే" "ఈ శరీరమున-హార్ద బ్రహ్మ మును సాక్షాత్కరింపఁజేసికొని- హార్దబ్రహ్మానుగ్రహమున ప్రకాశించు మూర్ధన్యనాడిద్వారా ముక్తుఁడు నిర్గమించి పరమపదముఁజేరును. "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" "బ్రహ్మమువంటి వాడయ్యే బ్రహ్మ మును పొందును. అనునది "దేవో భూత్వా దేవానప్యేతి" "దేవుఁడై దేవతలను పొందును" అనునట్లు-ఉపపన్నంబగును.

విద్వాంసుడు బ్రహ్మమును పొందుననియు, అవిద్వాంసుఁడు కర్మక్షయముకాగానే స్వర్గాదిలోకములనుండి భూలోకమునకు వచ్చు ననియు-ఉభయులకు ఉత్క్రాంతి సమానము కాగా- భిన్నవిధముగా గతిమాత్రము ఉండుననియు గ్రహింపవలెను. ఉత్క్రాంతిలేదనినచో- దేవయానమార్గమున బ్రహ్మమును పొందుట కుదురదు గదా!

యదాసర్వే ప్రముచ్యంతే-కామా యేఽస్య హృది స్థితాః
అథ మర్త్యోఽమృతోభవ-త్యత్ర బ్రహ్మ సమశ్నుతే"

ఈజీవాత్మయొక్క హృదయములో పాదుకొనియున్నట్టి కోరిక లన్నియు సమసినతటి-మరణధర్మముగల మానవుఁడు ముక్తుఁడు కానున్నవాడై ఈ శరీరమునందు హార్దబ్రహ్మమును గాంచును" అనుచో-ఇచటనే ముక్తి లేదనియు ఉత్క్రాంతి కలదనియు విశద మగుచున్నయది.

"వాఙ్మనసి సంపద్యతే-మనః ప్రాణే-ప్రాణస్తేజసి-తేజః పరస్యాం దేవతాయామ్" వాక్కు మనస్సునందు, మనస్సు ప్రాణమునందు. ప్రాణము జీవాత్మయందు, జీవాత్మ పరమాత్మయందు లయించును. అనగా-వాగాదులు వృత్తిలయమును (అవిభాగసంపత్తిని) మాత్రము చెందుననని భావము". అనుచో జీవాత్మను విడిచి ప్రాణములు నిష్క్ర మింపనను అర్థము- ద్యోతకమగును. పాము విడిచిన కుబుసము వలె

మృతుని స్థూలశరీరము పడియుండును. జీవాత్మ యైతేనో- శరీరము నుండి లేచినవాడై- శరీరముపై అధికారమును గోలుపోయి శరీరము లేనట్టి ప్రాణముల నెడబాయఁజాలడు.

ముక్తాత్మ- ఏ మార్గమున ఎట్టి సాధనములతో కూడినవాడై నిష్క్రమించుననఁగా?

"అణుఃపంథా వితతః పురాణో మాంస్పృష్టో అనువిత్తో మయైవ తేన ధీరా అపియంతి బ్రహ్మవిదఃస్వర్గం లోకమితఊర్ధ్వోవిముక్తాః, తస్మిన్ శుక్లముత నీలమాహుః పింగళం హరితం లోహితం చ-ఏష పంథా బ్రహ్మణాఽనువిత్తస్తేనైతి బ్రహ్మవిత్ పుణ్యకృత్తైజసశ్చ" ఈ మంత్రముయొక్క భావము-దేవయానమార్గము- మూర్ధన్య నాడిద్వారా బయలుదేరువారికే లభ్యమగుటచేతను-సులభముగా తెలియునది కాకుండుటను అణువని చెప్పఁబడును. నేను ధ్యానములో దేవయానమును కనుగొంటినని యాజ్ఞవల్క్యమహాముని నిర్వచించెను. నిరతిశయానందముగలయట్టి స్వర్గలోకమనఁదగు బ్రహ్మండమునకన్న పైననుండు పరమ పదములో శివయోగులు ప్రవేశించి ప్రాకృతికములైన స్థూలసూక్ష్మశరీరములనుండి విడిబడుదురు. మూర్ధన్యనాడి సూర్యకిరణములవలె శుక్ల నీల పింగళ హరిత లోహితవర్ణములు గలదై- విరాజిల్లును. ఈ దేవయానమార్గము బ్రహ్మముచే వ్యాపింపబడియుండును. ఇఁట తేజఃశబ్దముచే చెప్పఁబడు విద్య మొదలగు సాధనములతో ముక్తాత్మ- నిష్క్రమించును గాన- ముక్తాత్మ-తైజసుదనఁబడెను.

ఇందువలననే "విద్య (ఉపాసనాత్మకజ్ఞానము) అవిద్య-(విద్యాంగమగు నిత్యనైమిత్తికము వర్ణాశ్రమోచితంబునగు కర్మ అనువానిలో ఏదే నొకదాని నవలంబించువారిని-శ్రుతి తిరస్కరించినది ఎట్లనగా-

"అంధంతమః ప్రవిసంతి-యేఽవిద్యాముపాసతే-తతోభూయఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః "ఎవరు కేవలము కర్మ నాచరింతురో వారు- కటికచీకటితో నిండినట్లు కనఁబడు- అనగా పునరావృత్తి నొసఁగు కామ్యలోకములు-అముష్మికసుఖప్రదములైనను నరకతుల్యములగు స్వర్గాదులను లేక నరకములను-లేక పశుపక్ష్యాదిజన్మలను పొందుదురు. ఇక ఎవరైతే- వర్ణాశ్రమధర్మమును విడనాడి ఉపాసనయందే ప్రవర్తింతురో లేక వాక్యార్థశ్రవణాత్మకమగు శుష్కజ్ఞానము నవలంబించి "మేము పరమహంసలమైతి" మని వాఙ్మాత్రజ్ఞానులగుదురో-వారు-కర్మిష్ఠులకు లభించు కటికచీకటిని మించిన దుర్దశను పొందుదురు'' ఇత్యాది ప్రకరణమును బాగుగా పరిశీలించి నచో విద్వాంసునకుగూడ ఉత్క్రాంతి గతియు అనివార్యములని తేటపడుచున్నందున-ప్రాణోత్క్రమణనిషేధము శరీరమునుండి గాక శారీరకుని (జీవాత్మ) వలన యని విదితమైనది.

ఇవ్విషయమును దిగువవిధము మహాభారతము పేర్కొనినది.

శ్లో॥ శుకస్తు మారుతాచ్ఛీఘ్రాత్-గతిం కృత్వాఽంతరిక్షగః।
దర్శయిత్వాప్రభావం స్వం-సర్వభూతగతోఽభవత్ ॥
సర్వభూతాత్మభూతస్య-సమ్యక్ భూతాని పశ్యత।
దేవాఽపి మార్గే ముహ్యంతి-అపదస్య పదైషిణః॥

కర్మసముచ్చితమైన ఉపాసనాత్మకజ్ఞానము నవలంబించి పరిశుద్ధుఁడైన అనఁగా- పుణ్యపాపలేపరహితుఁడైన ముక్తాత్మ శీఘ్రము వాయుమార్గమున- దివ్యాంతరిక్షముఁజెందినవాడై ఈశ్వరేచ్ఛచే పూర్వము గోలుపోయిన ప్రభావము గల నిజరూపమును దర్శించి-

అనఁగా ఆవిష్కరింపఁజేసికొని-ప్రాణులందరిఁజెందిన పరమేశ్వరుని వలె చరాచరమునువ్యాపించు సామర్థ్యముగలిగి ప్రాణులనుశివమయు లనుగా నవలోకించును. ఇట్టి దేవయానమార్గము దుర్విజ్ఞేయమై శరీర గత హృదయమునుండిలేచి పరమపదముఁజేరువరకు విరామస్థానము (అపద్యస్య పద్రైషిణః) లేనివాడై బ్రహ్మపదముఁజేరుటకు తత్పర పడువానికే అవగతమగుటచే-దేవతలుగూడ ఇవ్విషయమైమోహముఁ జెందుదురు.

"అథ య ఏతౌ పంథానౌ న విదుః తే కీటాః పతంగా యది దందశూకమ్" "ఈ శుక్ల కృష్ణములగు అర్చిరాదిధూమాదిమార్గముల నెవరు గుర్తింపరో- లేక-లేవందుదో-వారు పురుగులై పక్షులై సర్ప ములై లేక బ్రహ్మరాక్షసులై జన్మింతురు" అనుచో మార్గద్వయ భ్రష్టులకు అధోగతి వినఁబడుచున్నయది.

మరియు

"తస్య తావదేవ చిరం, అథ సంపత్స్యే" అను శ్రుతివాక్యమున "బ్రహ్మోపాసకునకు శరీరవియోగమే తడవుగా బ్రహ్మప్రాప్తియగు" నని యున్నందున "జీవాత్మ-ప్రాణములతో గూడ శ్వరమునుండి లేచు" నని అర్థాత్-అవగతమగును.

"అస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుప సంపద్య-స్వేన రూపేణా భినిష్పద్యతే" ఇత్యాదిశ్రుతులు- విద్వాంసునకు గూడ- ఉత్క్రాంతిపూర్వకమగు బ్రహ్మప్రాప్తి నుద్ఘోషించుటను పరులు గమ నింపవలెను.

"అర్చిరాదినా తత్ప్రథితేః" అను బ్రహ్మసూత్రమున- సాత్య వతేయుఁడు "విద్వాంసునకు అర్చిరాదిగతిద్వారా బ్రహ్మప్రాప్తియగు

నని శ్రుతియందు ప్రసిద్ధమైనదని" విశదీకరించుటను కాదనఁజాలము గదా!

"బ్రహ్మము సర్వవ్యాపక మగుటచే తత్రాప్తికై దేశాంతరగమనము అవసరము లేదనరాదు. పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడైనను భక్తుల ననుగ్రహించుటకు మహాకైలాసమున దివ్యమంగళ విగ్రహము గలవాడైయుండు కతన- లోకోత్తరమగు శివలోకముఁ బ్రవేశించి పరమేశ్వరు నవలోకించుటకు విద్వాంసునకు ఉత్క్రాంతి గతియు తప్పనిసరి యగుచున్నవి.

"శుక్ల కృష్ణే గతీహ్యేతే- జగతః శాశ్వతీ మతే"

"శుక్ల కృష్ణములనఁబడు దేవయాన పితృయాన మార్గములు- జగత్తునకు శాశ్వతములైనవి" అను స్మృతియు ఇవ్విషయమునే సమర్థించినది.

ఏతావతా- బ్రహ్మవిదులకు గూడ- ఉత్క్రాంతి పూర్వకమైన గతి తప్పదని తేటపడినది.

అలమతి విస్తరేణ.

ముఖ్యములలో ఎనిమిదవదగు

## 8. ముక్తి పరిష్కారము

ముక్తిని గురించి కొందరు "తమేతం విదిత్వాఽతిమృత్యుమేతి "పరబ్రహ్మము నేనని గుర్తించినచో-మృత్యుమయసంసారబంధము విడిపోవునుగాన ముక్తుఁడగును. "నాన్యః పంథా అయనాయ విద్యతే" "మోక్షముకొరకు జ్ఞానమునకన్న వేరుమార్గము లేదు." "జ్ఞానాదేవ

తు కైవల్యమ్" "జ్ఞానమువలననే మోక్షము" ఇత్యాది శ్రుతి స్మృతి ప్రామాణ్యమువలన- జ్ఞానమే ముక్తి సాధనమని తోచుటఁజేసి జ్ఞానము అజ్ఞానమును ముఖ్యముగా తొలగించు స్వభావము గలదగుటచేతను, బంధము—అజ్ఞానరూపమని అవగతమగుటవలనను—జీవుని యొక్క "నేను బ్రహ్మమును కాను" అను అజ్ఞానమును నివారించు "అహం బ్రహ్మాస్మి" "నేను బ్రహ్మమును" అను ప్రత్యక్షమైన అనుభవముతో "తనతో వేరు గానట్టి బ్రహ్మమునైతిని" అను మోక్షము సిద్ధించునని స్ఫురించుచుండుటవలన—"జీవబ్రహ్మైక్యరూపమైనదియే ముక్తి" యని-భావించుట-సరి కాదు ఎందుకనఁగా?

"బ్రహ్మవిదాప్నోతి పరమ్" పరమేశ్వరు నుపాసించువాడు పరమేశ్వరుని పొందు" ననుచో-జీవాత్మ-పరమాత్మఁజేరునని నిరూపించి "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా" అనుచో—ముక్తపురుషుఁడు పరమేశ్వరునితోకూడ సకలకామావాప్తిరూపమైన పరమానందము ననుభవించు" నని యున్నందున-పరమముక్తి శివసాయుజ్య రూపమైనదని నిర్ధారించుటవలన- జీవబ్రహ్మైక్యము- పరమముక్తి యనుట-పై శ్రుతివాక్యములకు విరుద్ధంబగుచున్నయది.

ముక్తిసాధనముగా వేదాంతములయందు చెప్పఁబడిన-జ్ఞానము ఉపాసనాత్మకమగునని—సాధనపరిష్కారమునందు మాచే నిర్ణయింపఁబడినందున—ముక్తి సాయుజ్యరూపమనుటలో ఎట్టి విరోధము లేదు.

"ధ్యాననిర్మథనాభ్యాసాత్—పాశం దహతి పండితః "శివోపాసనాత్మకజ్ఞానము గల పండితుఁడు-పూజాజపధ్యానముల నభ్యసించుచు పరాకాష్ఠఁ జెందినచో— సంసారపాశమును దహించును" "జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః" "మహాదేవు నుపాసించినయెడల-సర్వవిధ సంసారపాశములు పటాపంచలగును." ఇత్యాది శ్రుతులు—బంధము

పాశరూపమనియు అజ్ఞానరూపము కాదనియు తేటపఱచినవి. "సయుజా సఖాయా" ఇత్యాదిశ్రుతిని—సాయుజ్యము కూడియుండు వారి ధర్మమగుటచే ఒకరితో నొకరు సంబంధించియుండుట యని విదితమగుచున్నది. సహయోగము—భేదము ముఖ్యముగా గలదని భావింపఁదగియుండుటచే—అయ్యది ఐక్యరూపము కాదని తెలియవలెను

''అహం బ్రహ్మాస్మి'' ఇత్యాది వాక్యములు- ఉపాసనయందు "సోఽహం" భావము నుపదేశించునవని తెలియవలెను. అంతమాత్రమున-జీవేశ్వరులకుపారమార్థికమైన అభేదముండునని భావింపరాదు.

''వైష్ణవం నామన మాఅభేత-స విష్ణురేవ భూత్వేమాన్‌లోకానభిజయతి" అనుచో గల ఏవకారమునకు ఇవార్థము నంగీకరించినట్లు "నిరంజనః పరమం సామ్యముపైతి""ముక్తః శివసమో భవేత్" ఇత్యాది శ్రుతిస్మృతులఁబట్టి-"బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" అనుచో-ఏవకారమునకు ఇవార్థముఁ జెప్పుట-విహితమగుటచే బ్రహ్మోపాసకుఁడు బ్రహ్మసదృశుఁడగును అనుఅర్థము లభించుటఁజేసి—పరమేశ్వరుని పొందిన యనంతరము పరమేశ్వరునితో సమానత్వముద్వారా శివసాయుజ్యము చేకూరుటయే పరముక్తియని సిద్ధాంతము.

మరియు శ్వేతకేతువుఁగూర్చి ఉద్దాలకుఁడు"ఐతదాత్మ్యమిదగ్ం సర్వమ్" అనుచో చరాచరప్రపంచమంతయు పరమేశ్వరుఁడంతర్యామిగా కలదని సామాన్యముగ నిరూపించి సర్వాంతర్యామిత్వమును సమర్థించుటకు- "స ఆత్మా తత్త్వమసి" "నీవు పరమాత్మ అంతర్యామిగ గలవాడవు"అని—పలుతడవులు ఉపదేశించెనని-తెలియుచున్నందున "తత్త్వమసి" అనుదానికి జీవబ్రహ్మైక్యమును చెప్పుట లేదని-ఋజువైనది.

"యో విజ్ఞానే తిష్ఠన్" "య ఆత్మని తిష్ఠన్" ఇత్యాది శ్రుతి వాక్యములనేకములు జీవపర భేదవాచకములగుటచే- జీవాంత ర్యామి పరమేశ్వరుఁడనియే తేటపడును. "ప్రజ్ఞానం బ్రహ్మ" "అయ మాత్మా బ్రహ్మ" ఇత్యాదులు జీవ బ్రహ్మైక్యమును చెప్పునని తోచు చున్నను. అయ్యవి "యో విజ్ఞానే తిష్ఠన్''ఇత్యాతిశ్రుతివచో బాహుళ్య బలమున-అంతర్యామిత్యాద్యర్థము గలవని యంగీకరింపవలసివచ్చును. ఎట్లనఁగా-''ప్రజ్ఞానం=జీవాత్మ ముక్తుఁడగునపుడు బ్రహ్మ=బ్రహ్మ సదృశుఁడగును"అయమాత్మా" సంసారియగు ఈ జీవాత్మ పరమాత్మ నుపాసించి బ్రహ్మ=బ్రహ్మ సమానుఁడగును. ఇట్లుకాదందురేని-శ్రుతి సూక్తులు-పరస్పర విరుద్ధార్థములై అప్రమాణములు కావలసివచ్చును.

''తత్త్వమసి'' ''నీవు బ్రహ్మము''అను ఉపదేశము-మహిషము నుద్దేశించి-నీవు అశ్వము-అనునట్లు అసంగతమగును. విద్వాంసుని దేహము పడిపోవునపుడు-సుకృత దుష్కృతములు రెండును తొలగు ననియు అనుభవశేషము లేనందున-అతడు అర్చిరాదిగతిని శివసాయు జ్యముఁ బొందునని గ్రహింపవలెను.

ప్రశ్న. "జగద్వ్యాపారవర్జ్యమ్" అను బ్రహ్మసూత్రమున-బాద రాయణుఁడు- ''ముక్తునకు జగత్సృష్ట్యాదివ్యాపారము ఉండదు" అని చెప్పినందున-పరమేశ్వరునితో సమానత్వము సంభవింపదని తోచెడిని.

ఉత్తరము: "సత్యకామ స్సత్యసంకల్పః" ఇత్యాదిని సత్య సంకల్పత్వాదులు చెప్పఁబడినందున-ముక్తుఁడు శివసముఁడనుటలో ఎట్టి క్షతిలేదు.

''కొన్ని ధర్మములతో ముక్తపురుషుఁడు శివసముఁడైనను పర

మేశ్వరునితో పరమసామ్యము ముక్తునకు సిద్ధించుటలేదు'' అను శంకకు సమాధానమేమనఁగా?

త్రాసునందు ఇరుప్రక్కలలో గల వస్తువులు భిన్నములైనను తూలతలో అత్యంతము సమానములైనట్లు-పరమేశ్వరునకు ముక్త పురుషునకు బహుళధర్మసాదృశ్యముండుటచే పరమసామ్యవ్యవహారము సుసంగతంబగుచున్నయది.

ప్రశ్న: ''భోగమాత్ర సామ్యమ్''అను సూత్రమున బ్రహ్మము దగు ఆనందము ననుభవించుట మాత్రము'' అని మాత్ర పదము నుపయోగించుటచే ముక్తునకు ఈశ్వరునితో అత్యంతసామ్యము ఘటించుట లేదు గదా!

ఉత్తరము: సూత్రగతమైన మాత్రపదము-సమస్తము అను నర్థము గలదై అవధారణార్థరహితమగునది. ఎట్లనఁగా? బ్రహ్మము ఎట్లు సమస్త కామముల ననుభవించునో, అట్లు ముక్తుఁడును సకల కామముల ననుభవించునని- శ్రీకంఠాచార్యులు-సూత్రభాష్యమున ప్రతిపాదించిరి. ఇవ్విధము-పరమేశ్వరునితో పరమసామ్యమును పొందుటద్వారా సంభవించు సాయుజ్యమే పరమముక్తి యగుటఁజేసి శివోపాసనచే భ్రమరకీటన్యాయమున_పొందఁదగినట్టి పరమముక్తిని స్ఫురింపఁజేయునట్టి శివలింగధారణరూపమైన పాశుపతవ్రతము-శివ ధ్యానమునఁదగు బ్రహ్మవిద్యావిషయమై అధికారమును సాధించునదని "వ్రత మేతచ్ఛాంభవం-తత్సమాచరేత్_ముముక్షు రపునర్భవాయ" "ఇయ్యది_శాంభవమనఁబడు పాశుపతవ్రతము_ముముక్షువుపునర్జన్మ లేకుండుటకై దీని నాచరింపవలెను" అని శ్రుతి విధించుట సమంజస మైనది.

ప్రశ్న: ఓయీ! "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" ఇత్యాది

శ్రుతిని జీవుఁడు శివుని తో కూడియుండునని తెలియుటచే శివసాయుజ్యము బద్ధదశయందును జీవునకు సంభవించును గాన- మోక్షమును సాధించుటకు శ్రమపడవలసిన యవసరము లేదు గదా!

ఉత్తరము: జీవుఁడు బద్ధదశయందు-అనాదిమలముచే తన జ్ఞానశక్తిని పోగొట్టుకొనినందున-శివసాయుజ్యమునందు గల నిరతిశయానందము జీవాత్మకు స్ఫురింపనిదై-లభింపదు. ముక్తదశయందైతేనో పరమేశ్వరానుగ్రహమున మలావరణము తొలగుటచే శివుని నిరతిశయానందము స్ఫురించినదై లభించును.

ఇందువలననే "హిరణ్యనిధిం నిహిత మక్షేత్రజ్ఞా"ఇత్యాది శ్రుతి వాక్యము-భూగతమైన హిరణ్యనిధిని గుర్తింపనివారు నిధిప్రదేశముపై సంచరించునట్లు-బద్ధజీవులు - శివసహయోగముగలవారైన న్దానిని గుర్తింపరని-ప్రతిపాదించినది.

ప్రశ్న: సగుణ బ్రహ్మసాయుజ్యమే పరముక్తి యనునెడ- సగుణ బ్రహ్మ సాయుజ్యము-అంతము గలదగుటచే-నిత్యమని చెప్ప రాదు గదా!

ఉత్తరము: "న సపునరావర్తతే"అను శ్రుతి-మరల జన్మించుటకు ముక్తపురుషుఁడు రాడని నొక్కి-చెప్పుచున్నందున "ఈ మానవలోకమునకు మాత్రము రాడు" అను అర్థమును కల్పించి-సగుణ బ్రహ్మ సాయుజ్యము నిత్యము కాదని-వాదించుట-సరి కాదని తెలియుచున్నది. ఎందుకనగా? నిర్గుణ బ్రహ్మముకలదనుటకు-స్పష్టములైన ప్రమాణములు లేనందున-సగుణ బ్రహ్మమే ఉపాస్యమై ముక్తప్రాప్యంబగునని నిర్ణయింపవలెను. సగుణ బ్రహ్మము - చతుర్ముఖుఁడనునెడ - ముముక్షువు చతుర్ముఖు నుపాసింపవలెనని ఎందును లేనందున-సగుణ బ్రహ్మమగు సదాశివు నుపాసించువారికి - సద్యోముక్తి సంభవించు

ననియు, విష్ణ్వాదులను నిష్కామ్యముగా ఉపాసించినవారికి-వైకుం ఠాది ప్రాప్తిద్వారా మహాకైలాసప్రాప్తి యను క్రమముక్తి - ఏర్పడు ననియు, చతుర్ముఖుఁడు-జీవసమష్టి రూపుడైనందున ఉపాస్యుఁడు కాదనియు, బాహ్య శివలింగధారణ పూర్వకమగు ప్రాణలింగాను సంధానము దొనర్చు శైవవతంసులకు లభించు-పునరావృత్తిరహిత-శాశ్వత శివసాయుజ్యమే పరమముక్తియనియు ఏతావత్ గ్రంథముఁ దగు సారాంశము-ఇఁట-పొందుపరుపఁబడినది.

ముఖ్యములలో తొమ్మిదవదగు

## 9. నిబంధన సాఫల్య పరిష్కారము

ప్రశ్న: మీరు-విమతస్థులు ప్రతిపాదించినట్టి అర్థములు శ్రుతిసూత్ర విరుద్ధములని నిరూపించి విశిష్టశివాద్వైతమే శ్రుతిసూత్ర సమ్మతమని నిర్ణయించితిరి గాని ప్రతిభావిశేషముగల పరులు-ఇఁట మీచే పరిష్కరింపఁబడిన అర్థములను తలక్రిందు లొనర్చినచో ఈ మీ పరిష్కార ముల కూర్పు-సఫలము కాకుండును గదా!

ఉత్తరము: అతీంద్రియులైన బ్రహ్మాదుల విషయమై "అతీంద్రియార్థే శ్రుతిరేవ మానమ్""ఇంద్రియములకు అందనిదానిని నిరూపించుటకు వేదమే ప్రమాణమగును"అని యున్నందున శ్రుతియే పరమ ప్రమాణమగుటచే భగవద్బాదరాయణునిచే నిర్ణయింపఁబడిన వేదాంతార్థమే యథార్థమగుటవలనను-శ్రుతులను సూత్రముల ననుసరించి-ఈ నిబంధనమునందు వేదాంతార్థములు పరిష్కరింపఁబడినవి. ఎవరైతే తమ ప్రతిభా బలముతో వ్యాససూత్రములను వ్యాకులపఱచుచు ఆయా అర్థములను మార్చినాతో-వారు-తమ సిద్ధాంతమునందలి

వక్రభావమును ప్రకటించి అనుచరులను నిఃశ్రేయసు (మోక్షము) నుండి భ్రష్టులఁజేయువారు గాన అనర్థమునుగూడ పొందువారగుదురు.

అంతమాత్రమున-పకృత నిబంధనమునకు ఎట్టి వైఫల్యము సంక్రమింపదని మా యభిప్రాయము.

ముఖ్యములలో పదవదగు

## 10. కేవలాద్వైత శాస్త్రకర్తృభావ పరిష్కారము

ప్రశ్న: విమతములు శ్రుతిసూత్ర విరుద్ధములు కాగా-అవ్వానిలో ముఖ్యమగు కేవలాద్వైతమును ప్రతిపాదించు శాస్త్రమును రచించిన వారి భావమేమైయుండును?

ఉత్తరము: అద్వైత శాస్త్రకర్తలకు ముముక్షు జనమును మోస గించు నుద్దేశము లేదని చెప్పవచ్చును. ఐతే వారిట్లు ప్రబోధించి రెందు కనఁగా? పరమాత్మ సాక్షాత్కారమునకు శ్రవణ మనన నిదిధ్యాస నములు సాధనములు కాగా-శ్రవణమనఁగా-ఏకార్థ నిశ్చయమనియు, మననమనఁగా-ఏకార్థమును స్మరించుటయనియు, నిదిధ్యాసనమనఁగా ధ్యానమనియు నిర్వచన మాతమున్నయది.

ఇతర వాసనలన్నిటిని విస్మరించి చేయఁబడు ఏకాగ్ర చింత నము-ధ్యానమగును. ఇతర వాసనలను విస్మరించుట-పరమేశ్వ రైక్య భావనా సాధ్యమగును. కేవలాద్వైతభావనతో పరమేశ్వర దర్శన మగునని ఆశించి చూపిన యుక్తులు-ఆభాసములగునని వ్యాసుఁడు నిర్ధా రించెను.

ఐనను-ముముక్షుజనము నన్గ్రహించుటకు-కేవలాద్వైతమును శ్రుతిసమ్మతముగా నొనర్చుటకు శ్రమపడి జిజ్ఞాసువులకు విశ్వాస

మును కలిగింపఁబూని - ఆచార్యులు దీనిని ప్రవర్తింపఁజేసిరని తోచెడిని.

ఇందువలననే-మోక్ష హేతువగు ధ్యానయోగమున సంభవించు ఆత్మానందమునకు నిఃసంకల్పత్వము అనఁగా-ఐహిక ఆముష్మిక సంకల్పములను విడనాడుట-పరమసాధనమను వాసిష్ఠకారుని నిర్వచనము నంగీకరించి నిఃసంకల్పతమునకు నికటవర్తియగు మోక్షమును "సామీప్యాత్తు తద్వ్యపదేశః" అను న్యాయమున-నిఃసంకల్పత్వముగా వ్యవహరించిరి.

కేవలాద్వైతము యోగవాసిష్ఠమునుండి స్వీకరింపఁబడినదని-అవగతమగుటచే శివాగమ ప్రతిపాదితము పశుపాశపతి తత్త్వత్రయ నిర్ణాయకంబునగు శివాద్వైతమే శ్రుతిసూత్రాగమ సమ్మతమైనదని-అద్వైతాచార్యులు సంభావించి ఉపాసనాంగీకృత శివజీవైక్యమును పరమార్థముగా నిర్వచించినందున.వృథాఽభిమానరతుల మతద్వేషమును తొలగించి లోకకల్యాణము నొనఁగూర్చిరని గుర్తించి-అద్వైతాచార్యుల విషయమై సదభిప్రాయము కలిగియుందురుగాక!

## స్వాగతము

తమ పాండిత్యప్రతిభచే వేదాంతార్థముల నయథార్థములుగా ప్రవచించి - మత్తగజములవలె - వాగాడంబరముతో విజృంభించు విద్వత్ప్రకాండుల నీసందర్భమున పరిగణింపఁజాలము.

అపమార్గమున లభించు స్వర్గమును నరకతుల్యముగాను సుమార్గమున సంభవించు మరణమును శాశ్వత ధనముగాను భావింతుము.

వేదాంతముల యథార్థమును పరిశీలింప నుత్సుకత కలిగి-గట్టి

త్రాడుచే లాగబడినట్లు-ఇటునటు పొర్లాడుచుండగా-శివప్రేరితుఁడనై నిగమాంతార్థ నిర్ణయమును గావింప కడంగితిని.

శ్రుతిశతమును ప్రసాదించిన పరమేశ్వరునియొక్కయు, అట్టి శ్రుతుల కనుగుణములైన సూత్రములను రచించిన వేదవ్యాస మహా మునియొక్కయు అభిమతమును కలుషితముఁజేసినవారితో మాకు ఐకమత్యము లేదు.

ఈ రచనలో నాకు గల తొందరపాటును సహించి నా యంత రాత్మలోని వేదాంతార్థ సమన్వయ చికీర్షయను గుణము నభినందించు మహాత్ములు నన్ననుగ్రహింతురుగాక!

వ్యాససూత్రములతో అవినాభావము గల వేదాంతములు అను కుసుమముల మాలికలోని పరిమళము గలదై-శ్రీ నీలకంఠాచార్యులచే ప్రతిపాదింపఁబడిన శివాద్వైతమే శ్రేష్ఠమైనది.

మతాభిమానమువలనగాని, యుక్తాయుక్త వివేకాభావమనఁదగు మోహమువలనగాని, భ్రాంతివలనగాని ఈ శివాద్వైతము నంగీక రింపనివారు-గ్రుడ్డిదైన వానరముఁ బోలుదురనుట-నిక్కము.

లింగాంబాహృదయేశుఁడగు నాగలింగార్యునిచే నిర్మింపఁబడిన వేదాంతార్థ పరిష్కారము-శివుని చరణయుగళమునందు సమర్పింపఁ బడినదిగా భావింపఁబడుచున్నది.

ఐదువేల ముప్పదియారు (5036) వత్సరములు కలియుగము గడచినవేళ-నీ వేదాంతార్థనిష్కర్షమును రచించితిని.

ఇట్లు

శివశ్రీ-మహోపాధ్యాయ, ముదిగొండ నాగలింగశాస్త్రి

సంస్కృత భాషాప్రాచుర్యము తేని జిజ్ఞాసువులకే గాక-సాహితీ పరులై సమర్థులనుండి సేకరింపఁ-ఆత్మాభిమానము అడ్డుపడు పండిత

కల్పులకు నుపయోగించునని భావించి-సమర్థులైన యథార్థ జ్ఞానామృత పిపాసువుల-వాచిక ఆర్థిక ప్రోత్సాహమున "శైవనందిని" అను పేర తెలుగర్థమును తేలికభాషలో వ్రాసితిని. ఇయ్యది-వెంటనే శివానుగ్రహమున ముద్రితమై పాఠకుల కరకమలముల నలంకరించుచున్నందుల-కెంతయు ధన్యుడనని మురియుచు-ఇందుమూలముగా ఆరాధ్య శైవులకు శివాద్వైతసిద్ధాంతమునందు తత్సంప్రదాయమునందును ప్రగాఢ విశ్వాసము కలుగునని భావించుచు-స్వమతా చరణము నుపేక్షించి పరమత పద్ధతుల నవలంబింపవలదని-శైవ మహాజనులనుగురించి-ఆత్మీయతతో ఆకాంక్షించుచున్నాను.

ఇట్లు

ఆచార్య-నిర్మల శంకరశాస్త్రి-ఆరాధ్యులు,

శ్రీ బహుధాన్య సం॥ జ్యేష్ఠశుద్ధ త్రయోదశి, ఆదివారము,
శాలివాహనశకం 1920, 7-6-1998. కలి॥ గతం 5099,

---

## శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రీయమగు భరతవాక్యము

శ్లో॥ వస్తున్యస్తు శరీరిణాం పరతరే-ఽశేషోఽభిలాషస్సదా-
సంతస్సంతునితాంతశాంతిసుగుణాక్రాంతాస్సమంతాత్ భువి।
క్ష్మాంసర్వామపిభూషయంతుకృతధీవర్యాః క్షమాభూషణాః-
విద్వాంసః పరిపూరయంతు రసగంభీరై ర్నిబంధైరసామ్ ॥

శరీరధారులైన మానవులకు సర్వశ్రేష్ఠమైన వస్తువునందు సంపూర్ణమైన ఆకాంక్ష-ఎల్లకాలము ఉండుగాక! మానవులందరు ఆస్తికులై ఇహపరములను సాధింతురుగాత! అని భావము. ఉత్తములు-మిక్కిలి శాంతిగుణమునిండినవారై భువినంతట విరాజిల్లుదురుగాక! ఏక నిశ్చయము గల ధీమంతులు క్షమాగుణము భూషణముగ గలవారై భూలోకమునంతటి నలంకరింతురుగాక! రసగంభీరములగు గ్రంథములను విద్వాంసులు రచించి-భూప్రదేశమును నింపుదురుగాక!

ఓం తత్సత్

శివజ్ఞానలహరీ-ధార్మికసంస్థ(రిజి.) హైదరాబాదువారిచే
ప్రచురింపఁబడిన గ్రంథములు

1. ఉపనిషత్ భాష్యము-ప్రథమభాగము, వెల రూ. 60-00
ఇందు ఏడు ఉపనిషత్తులకు
అర్థము-తెలుగున వ్రాయఁబడినది.

2. ఉపనిషత్ భాష్యము-ద్వితీయభాగము, వెల రూ. 90-00
ఇందు పదునైదు (15) ఉపనిషత్తులకు
అర్థము-తెలుగున-వ్రాయఁబడినది.

3. బ్రహ్మపథము-వేదాంతార్థ పరిష్కారతారహారముతో రూ. 100-00
ఇందు శైవసిద్ధాంతము విశదీకరింపఁబడినది.

వలయువారు:

శివశ్రీ॥ A.V.S.R. చంద్రశేఖర్,
కార్యదర్శి-శివజ్ఞానలహరి-ధార్మిక సంస్థ (రిజి.)
3-6-462/8, మొదటి అంతస్తు
సుందరసదనము, వీధి నెం. 5
హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029, ఆం.ప్ర.
ఫోనులు : 7603662(0)7645516(2)

ఓం నమో భగవతే సదాశివాయ

# బ్రహ్మపథము

## వేదపథ వ్యాసపథ సమన్వితము
మరియు
## వేదాంతార్థ పరిష్కార తారహారము


మూలం శివశ్రీ మహోపాధ్యాయ-ముదిగొండ-నాగలింగశాస్త్రివర్యులు

అనువాదం

ఆచార్యశివశ్రీ నిర్మల శంకరశాస్త్రి-ఆరాధ్యులు



ప్రకాశకులు

శివ జ్ఞాన లహరి


సర్వేజనాః సుఖినోభవన్తు


ధార్మికసంస్థ, (రిజిస్టర్డ్) హైదరాబాద్.





వెల రూ. 100-00